# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 65 సెప్టెంబరు 1988 సంచిక : 9

విడిప్రతి వెల ఐదు రూపాయలు


## విషయానుక్రమణిక

సెప్టెంబరు - 1988

# స్వవిషయం

ఈ నెల భారతిలో ప్రచురించబడిన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి వ్యాసం ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉన్నదనవచ్చు! శ్రీ శర్మగారి భావాలు ఎప్పుడూ సంచలనం కలిగించేట్లుగానే ఉంటాయన్న అభిప్రాయం లేనివారు ఎక్కువమంది ఉండరు.

"ఎలమంచిలి(విశాఖ జిల్లా)కీ కాటమరాజుకీ ఎంతమాత్రం సంబంధం ఉండేది?" అన్న విషయాన్ని గురించి శ్రీ కొల్లూరి సూర్యనారాయణగారు రాసిన వ్యాసం నయితం కొన్ని వివాదాలని లేవదియ్యవచ్చు!

శ్రీ తిరుమల రామచంద్రగారు కొంతకాలంగా ప్రాకృత భాషలమీద ప్రత్యేకంగా పరిశోధనలు జరుపుతున్నట్లు తోస్తుంది! గాథాసప్తశతిలో తెలుగు పదాలని గురించి ఆయన రాసినప్పటినుంచి నేటిదాకా వివిధ భారతీయ భాషలకీ ప్రాకృతాలకి మధ్య ఉన్న సంబంధాలని గురించి కొత్త అంశాలు ఎన్నయినా బయటపడి ఉండాలి! కీ॥శే॥ నీలకంఠశాస్త్రిగారే "తమిళం ఒక ప్రాకృతభాష అనటానికి అవకాశాలు ఉన్నా"యని ఒక సందర్భంలో అన్నారు. ప్రాకృతభాష అన్న మాటకే నిర్వచనాలు మారిపోయినా మారిపోగలవు....

భారతిలో కథలూ, కవిత్వమూ, పరిశోధనా వ్యాసాలూ, విమర్శా— వీటన్నిటికీ ఎప్పుడూ చోటు ఉంటూనే ఉంటుంది. సెప్టెంబరు భారతి సంచికలో కావలసినంత వైవిధ్యం ఉన్నదని సహృదయులయిన చదువరులు తప్పకుండా అంగీకరించగలరని అనుకుంటున్నాము....



# ఆశా గీతము

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

గీ॥ చిమ్మ చీకటి రాతిరి రొమ్ముమీద
మినుకుమను కన్నెచుక్కలు మనసులోని
వెలుగు తలపుల మానికల్ మలచి నాకు
అమృత కావ్య సందేశము లందజేయు

గీ॥ కొండ తలనుండి జాజిపూదండ వోలె
జారివచ్చెడు సెలయేటి ధారలందు
క్రేళ్ళువారెడు మధుర సంగీతవాణి
మూగవోయిన నా గుండె మ్రోగజేయు

గీ॥ తొగరు జిగిమీరు సంధ్యావధూలలామ
పెదవి గిన్నెలో తొణకు గోర్వెచ్చనైన
రాగ మధురసపూరము ప్రత్యహమ్ము
చేదు బ్రతుకున మాధురుల్ చిలుకరించు

గీ॥ పూవు పడతి నెమ్మోమున మోసులెత్తు
పరిమళపు సిగ్గుతెరల దొంతరల నడుమ
దళము లిడు చిరునవ్వురేకలు మదీయ
నయన మార్గములో నందనములు నాటు

గీ॥ స్నిగ్ధ పాటల వర్ణరంజిత ఉషస్సు
స్వర్ణ కింకిణుల్ రవళింప వచ్చి ఇరులు
క్రమ్ముకొను నాదు జీవితరంగమందు
నవనవానంద కలిత తాండవ మొనర్చు

గీ॥ ప్రకృతిలోని ప్రత్యణువు శోభాప్రపూర్ణ
భావ రమణీయమై నిరాశా విషాద
గీతములు పాడువన్ పులకింపజేసి
చేర్చు ఆశా సుఖ స్వప్న శిఖరములకు

శ్రీ రవి రంగారావు

# చిరంజీవి మినీకవిత

మినీకవితను కొందరు విప్లవమని, మరికొందరు ఉద్యమమని, ఇంకా మరికొందరు ఉద్యమస్ఫూర్తి అని ఒక దృక్కోణంలో భావించారు. ఆ తర్వాత కొందరు మినీకవిత విప్లవం కాదని, మరి కొందరు ఉద్యమం కాదని, ఇంకా మరికొందరు ఉద్యమస్ఫూర్తి కాదని మరో దృక్కోణంలో విమర్శించారు.

మినీకవితను కొందరు విప్లవమని ఎందుకన్నారు? విప్లవమని అన్నవాళ్లు తెలిసో తెలియకో మంచివో చెడ్డవో ఏవో ఉద్దేశాలు లేకుండా అనరు కదా! బహుశా విప్లవంగా చెప్పిన వాళ్ళ ఉద్దేశాలు ఈ క్రిందివి కావచ్చు.

1. విప్లవం అంటే నిఘంటువులో రకరకాల అర్థాలున్నాయి. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 14 అర్థాలున్నాయి. "మార్పు" అనే అర్థంలో వుంది కాని "వస్తువులో మార్పు" అని ఎక్కడా వున్నట్లు లేదు. సాహిత్య అకాడెమీ తెలుగు నిఘంటువులో "తీవ్ర పరివర్తనము", "రాజ్యక్రాంతి" అని అర్థాలున్నాయి. ప్రక్రియలో "మార్పు"గా భావించి విప్లవమని భావించి వుండవచ్చు. ఇది మొదటి ఊహ.

2. విప్లవ కవిత్వం, విప్లవ రచయితల సంఘం, విప్లవ కవులూ వున్నారు. ఈ దుష్టవ్యవస్థను అంతంచేసి సమసమాజ వ్యవస్థను నిర్మించుకోవాలంటే విప్లవం తప్పనిసరి అని భావిస్తున్నారు. ఆ విప్లవం రావాలంటే ఆ విప్లవ కవిత్వం ప్రజల్ని ఆకర్షించాలి కదా, అర్థం కావాలి కదా, కడుపు మండేలా చేయాలి కదా, తిరుగుబాటుకు సమైక్యశక్తిగా మారాలి కదా; మరి విప్లవ వచన కవిత్వం ఈ పనులను సాధించటానికి ప్రజలను ఆకర్షించగలుగుతున్నదా? (ఇక్కడ నేను - జనం పాటలను గురించి కాని, చెరబండరాజు మొదలైనవారు రాసిన స్పష్టత గల కవిత్వాన్ని గురించి కాని మాట్లాడటం లేదు. ప్రముఖ పత్రికల్లో ప్రచురిస్తున్న కవిత్వం, విప్లవకవులుగా చెప్పుకుంటున్న వారి కవిత్వం గురించే మాట్లాడుతున్నాను.)

కవిత్వం అన్నాక వస్తువైవిధ్యం, శిల్పవైవిధ్యం వుంటే ప్రజలను అది బాగా ఆకర్షిస్తుంది. విప్లవ వచన కవిత్వంలో నిబద్ధత వలన వస్తు వైవిధ్యం కొంత లోపించింది. ఇది లోపం అనటానికి వీలులేదు. అవసరమైన పరిమితి. సామాజిక వస్తువునే చారిత్రక అవసరంగా తీసుకోక తప్పటంలేదు. ఇక మిగిలింది శిల్ప వైవిధ్యమే. వస్తు వైవిధ్యానికి అంత అవకాశం లేనపుడు శిల్పవైవిధ్యాన్ని ఎక్కువగా పెంచుకుండేనే తప్ప విప్లవ వచనకవిత ప్రజల్ని ఆకర్షించదు. ఒకేమూసలో పోసినట్లు విప్లవ వచన కవిత్వమంతా ఒకేరకమైన శిల్పంతో వస్తోంది. ఒక పదేళ్ళ కిందట విప్లవ వచన కవిత్వంలో కాస్తో కూస్తో శిల్పవైవిధ్యం వుండేలా కవులు కవిత్వం రాసేవాళ్ళు. విమర్శకులు కూడా ఆ వైవిధ్యం గమనించినట్లే వుండేవాళ్లు. పత్రికలూ అలాంటి వైవిధ్య కవిత్వానికి అవకాశం కూడా ఎక్కువగా ఇచ్చేవి. కాని ఇటీవల సాహిత్య వాతావరణం మారింది. గట్టిగా చెప్పాలంటే మార్చబడింది, మార్చబడుతోంది! కవిత్వంలో సంక్లిష్టత ఎక్కువయ్యే కొద్దీ గొప్ప కవిత్వం అవుతుందనే భావన బాగా బలిసిపోతున్నదిపుడు. ఒకనాడు అప్రసిద్ధ సుదీర్ఘ సమాసార్భటి కవిత్వంగా చెలామణీ అయ్యేది! అది ఆనాటి చాదస్తం అయితే ఈనాటి సంక్లిష్ట కవిత్వం. "ఆధునిక చాదస్తం"గా మనం గుర్తించాలి. అవసరమున్నా లేకపోయినా కవిత్వంలో "ఇమేజరీ" పులుముడు - ఉండితీరాలి. ప్రతి లైనుకు రెండో మూడో పదచిత్రాలుండాలి. కవితలోని పదచిత్రాలన్నింటినీ కలిపి ఉంచే అంతస్సూత్రం వుండాల్సిన అవసరం లేదా పొంతన లేకుండా పదచిత్రాల్ని గుప్పించటమేనా ఆధునికత! పొంతన? వుంటే బలహీనతా!! కవిత్వం పల్చగా వున్నట్లు లెక్క!!! (కుందుర్తి రచనల్లో కవిత్వం పల్చగా వుంటుందన్నాడో విమర్శకుడు. ఆయనకో నమస్కారం.) ఒక ముద్ర సృష్టించి ఇలా రాస్తేనే వచన కవిత్వం, విప్లవ వచన కవిత్వం అని బలవంతంగా ముద్ర వేస్తున్నారనిపిస్తోంది ఈనాటి పరిస్థితి. అలా ఒకే మూసలో రాస్తేనే ఆ కవితా సంపుటాలు బాగున్నాయని విమర్శకులు(?) రాస్తున్నారు, ఆ కవులు సరుకున్న కవులని అంటున్నారు. ఆ కవితల్నే ప్రముఖ పత్రికల సాహిత్య అనుబంధాల్లో వేస్తారు. అలా లేకపోతే కవిత్వం చాలా పేలవంగా వుందని వదిలేస్తున్నారు. కొత్తగా కవిత్వం రాస్తున్న కుర్రవాళ్ళు పత్రికల్లో వస్తున్న సంక్లిష్ట కవితలు చూచి అలా రాస్తేనే ప్రచురిస్తున్నారు కాబట్టి, అలా రాస్తేనే కవిత్వం కాబోలు అనిపించి అలాగే రాస్తున్నారు. శిల్ప వైవిధ్యంతో యువకులు కవిత్వం రాసే అవకాశం ఇలా చచ్చిపోతోంది.

కవితలో పదచిత్రం గొప్పదే. కాదనటానికి వీల్లేదు. పదచిత్రాల గుంపే కవిత్వం కాదు. కొత్తగా వచ్చిన "స్వీటు" లాంటిది

పదచిత్రం. అంతమాత్రాన భోజనం మానేసి స్వీట్లు కుప్పలుగా పోసుకొని ఎన్నాళ్ళు తినగలరు పాఠకులు! వచన కవిత్వస్థితి ఈనాడిలాగే వుంది. రుచిని బట్టి కొత్తదనాన్ని బట్టి భోజనంలో స్వీటు ప్రముఖంగా కనిపిస్తే కనిపించవచ్చు కాని ఎన్నో ఇతర పదార్థాలు కలిస్తే కాని భోజనం కాదని గుర్తించాలి.

ఇమేజిజం చాలవరకు వ్యక్తి నిష్ఠమైన ఆలోచనలతో కూడుకొన్నదే. కవి సమాజానికంటె ఉన్నతుడనే ఊహలోనుంచి ఇలాంటివి పుట్టినవని, కవిత్వం కొంతమందికి మాత్రమే అని పరిమితి గీసుకొన్న పరిస్థితిలోనుండి వచ్చాయని కుందుర్తి ఏనాడో స్పష్టీకరించారు కూడా. "అలా అన్నంతమాత్రాన ఇమేజిజం, సింబాలిజం, ఎక్స్‌ప్రెషనిజం, మరేదైనా సరే ఏ ఒక్కటీ అంటరానిదని కాదు. అన్నిటినీ వాడుకోవచ్చు. ఈ రూపాలనూ, పద్ధతులనూ ఎందుకు వాడుకొంటున్నామంటే మన సందేశాన్ని ప్రజల దగ్గరికి తీసుకువెళ్ళడానికనే స్పృహ మాత్రం ఉండి తీరాలి." కొత్త సిద్ధాంతాల బరువుకు ఈ స్పృహ పుష్పం నలిగిపోతూ వుందిపుడు. వచనకవిత్వంలో ఈ ప్రమాదం ఎక్కువగానే వుంటోంది (విప్లవ వచన కవితల్లో ముఖ్యంగా). విప్లవం కోసం రాసే మినీ కవితల్లో ఈ ప్రమాదం చాలా తక్కువ - లేదనవచ్చు. మినీ కవితల్లో చక్కని "ఇమేజరీ" వుండి సంక్లిష్టత లేనివి చాలా వున్నాయి. విప్లవాన్ని సాధించే లక్ష్యం కోసం విప్లవ వచన కవితలకన్న విప్లవ మినీకవితలు ఎక్కువగా ప్రజల్ని ఆకర్షించగలుగుతున్నాయి. అందుకే విప్లవ కవిత్వోద్యమంలో ఒక ముఖ్యభాగంగా మినీ కవితను "విప్లవ మినీకవిత", "మినీ కవితా విప్లవం" అని అంటున్నారని అనుకొనకూడదా! ఇది రెండో ఊహ.

* * *

"మహత్తరమైన భావాలను 'మహత్తర విధంగా' ప్రతిపాదించేదే ఉత్కృష్ట కవిత్వం" అన్నాడు శ్రీశ్రీ. ఆదికాలంలో తిక్కనను, మధ్యకాలంలో వేమనను, ఆధునిక కాలంలో గురజాడను శ్రీశ్రీ మహాకవులుగా భావించటానికి "స్పష్టత" కూడా ఒక ముఖ్య కారణం. పావురంలాగా ప్రశాంతంగా కనిపిస్తూనే సింహం లాంటి గంభీర భావాలను వెదచల్లగలగాలి కవిత. ఇది చేతకానివాడు కృత్రిమ సంక్లిష్టత ముసుగేసుకొని గొప్ప కవిత్వంగా చెలామణీ చేయజూస్తాడు. చిత్తశుద్ధితో "ఫీల్" అయి రాస్తే ఈ కృత్రిమత్వం వుండదు. తిలక్ భవిష్య కవిత్వ దుస్థితిని కూడా ఊహించి ఏనాడో అన్నాడు.

"అర్థంలేని ఇమేజరీ కలగా పులగపు వర్ణనలతో
డిలాన్ థామస్‌కు చేతకాని అనుకరణలతో
ఒక దేశం నిర్దేశం లేని వాగ్జాల వికారంతో
ఎందుకు బాధిస్తావు నన్ను, బాధపడతావు నువ్వు
కవిత్వంలో అబ్‌స్క్యూరిటీ కొన్ని సందర్భాలలో వుండొచ్చును
కాని పాఠకుడికి నీ అనుభూతి ఆకారం హత్తుకోవాలి
అది ట్రాన్స్‌పరెంట్ చీకటై వుండాలి నిన్ను పలకరించాలి
కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరవాలి, కదిలించాలి"

అలంకారాలేవీ పెద్దగా లేకుండా అనుభూతి ఆకారం గాఢంగా హత్తుకునే ఉత్తమమైన విప్లవ వచన కవితకు ఒక ఉదాహరణ చూద్దాం. విప్లవ వస్తువుతోపాటు శిల్పవైవిధ్యాన్ని కూడా మనం గమనించవచ్చు.

ఎక్కడెక్కడ తగిలిందండీ తుపాకీ గుండు

ఆ బజ్జీలవాడు
ఏం చేస్తున్నాడయ్యా ఆ బజ్జీలవాడు
చచ్చేముందు?
వాడు బజ్జీలు వేయిస్తున్నాడయ్యా మూకుడులో.

ఆ కూలిమనిషి
ఏం చేస్తున్నాడోయ్ ఆ కూలిమనిషి
ఆ చావుదెబ్బ తినేముందు?
రోడ్డు దాటుతున్నాడోయ్ కూలిడబ్బుల కోసం.

ఆ కుర్రాడున్నాడే
ఏం చేస్తున్నాడు బాబూ ఆ కుర్రాడు
ఆఖరుసారిగా కెవ్వుమనేముందు?
సందేహం తీర్చుకోడాని కెళ్తున్నాడండీ ఎదురుగా వున్న సందులోకి.

ఆదే ఆ మనిషి
ఏం చేస్తున్నాడండీ ఆ మనిషి
ఆఖరి పొలికేక పెట్టే ఆ కుర్రాడిమీద పడేముందు?
తన కొడుకుని రక్షించడాని కొస్తున్నాడండీ గుండుదెబ్బనుంచి.

అద్సరే
ఆ బజ్జీలవాడు ఆ కూలిమనిషి ఆ కుర్రాడు ఆ మనిషి
అందరూ ఒకే సమయంలో అక్కడెందుకున్నారయ్యా?

అదా
వాళ్ళందరూ కూడా
ఆ బజ్జీలవాడు ఆ కూలిమనిషి ఆ కుర్రాడు ఆ తండ్రీ
అక్కడికొచ్చేసరికి
"కడుపునిండా తిండి కావాలి"
అంటూ వూరేగే జనసమూహం అక్కడికొచ్చిందా సమయంలో.

అంతే
ఇంతలోనే తుపాకి గుండు కదిలిందండి

ఆరే
మరి...ఆరితేరిన ఆ తుపాకీగుండు
ఎవరెవరి కెక్కడ తగిలిందండీ?

కడుపులోనుండి
సుళ్ళు తిరుగుతున్న కడుపులో ఆకలికి తగిలాయండీ
తుపాకీగుళ్ళు.

దీనికి హిందీమూలం శ్రీ సోమదత్త. అనువాదం భైరవయ్య. ఇలా ఉండాలి ఆధునికత అంటే. ఇలా ఎన్నోరకాలుగా శిల్ప వైవిధ్యాన్ని ప్రదర్శించవచ్చు. అపుడే వచనకవిత పాఠకుల్ని ఆకర్షించ గలుగుతుంది. పై కవితలో కృతకశైలి, సంక్లిష్టత లేవు. ఆధునిక వ్యక్తీకరణలో ప్రయోజనం ఎందుకు ఎక్కువగా వుండాలో, ఎంత వైవిధ్యం సాధించవచ్చునో, ఎలా పాఠకుల్ని ఆకర్షించి నిర్మాణాత్మక భావాలవైపు వారిని మళ్ళించాలో మన ఆధునిక కవులకు సరైన అవగాహన చాలా అవసరం. పై కవితలోలా అలంకారాలు లేకుండా రాస్తేనే ఉత్తమ కవిత అని నా ఉద్దేశం కాదు. కవితలో అలంకారం వున్నా, సింబాలిజం వున్నా, ఇమేజిజం వున్నా, ఏ సరికొత్త సంవిధానం వున్నా అందులో పాఠకుడికి "చొరబాటు గుణం" కనిపించాలి. ఈ గుణం వుంటే ఆ కవితలో లోతు వున్నట్లే. ఈ గుణం లేకపోతే అది కృత్రిమ సంక్లిష్టత, మాయలమారి కవిత్వం. ఎన్నో ముడులున్న "దారపు ఉండ" మనకిచ్చి చిక్కుతీసి సరిచేయాలని అడిగితే తీయటానికి వీలైన దారపు ఉండ"లాగా వుండాలి కవిత్వం. ముడులు విప్పటానికి వీలుకాకుండా చేసి తెంపకపోతే తప్ప సరిచేయ లేని "దారపు ఉండ"లా వుండకూడదు కవిత్వం. సమాధానం తెలిసి వుండి అడిగే చిక్కుప్రశ్నలా కవిత్వం ఉండవచ్చు కాని సమాధానం లేని "దెయ్యపుప్రశ్న"లా వుండకూడదు. ఈ విషయాన్ని విప్లవ వచనకవులు మరిచిపోకూడదు.

*　　*　　*

ప్రచారరీత్యా మినీకవితను ఉద్యమ మనవచ్చునంటాను నేను. మరికొందరు మిత్రులు ఉద్యమమూ కాదన్నారు. ఈ వాదాన్ని కొత్తగా ప్రారంభించటం కాని, కొనసాగించటంకాని, కొత్త కారణాలు చూపటం కాని అవసరంలేదు. పూర్వం వచన కవిత్వాన్ని ఉద్యమం అనకూడదన్నారు కొందరు. అలా వివాదాస్పదమైనదని కుందుర్తి వచన కవితా ప్రచారం మానలేదు. ఉద్యమం అవునన్నా, కాదన్నా మినీకవితా ప్రచారం కూడా ఆగదు. కొత్త ప్రక్రియకు ప్రచారం ముఖ్యం. ఉద్యమమా కాదా అనేది ఆనుషంగికం. అందుకే మినీకవితా ప్రచారాన్ని ఉద్యమంగా నిర్వహించి తీరాలంటాను నేను.

1980 నుండి మినీకవిత ఓ ప్రత్యేక ప్రక్రియగా వెలుగొందటం ప్రారంభించింది. అప్పటినుంచి తెలుగు సాహిత్యంలో అది మన్నన పొందుతూనే వున్నది. మినీ కవితల్ని "కొటేషన్లు"గా వాడుకుంటున్న ప్రజల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. మినీకవిత చల్లారిపోయిందని ఇటీవల కొందరు విమర్శకులు అనుకొని సంతోషించటం శోచనీయం. దినపత్రికల అనుబంధాల్లో మినీకవిత గురించి చర్చలు, వ్యాసాలు కనిపించటం ఆగిపోయినంతమాత్రాన దాని ప్రత్యేకత, ప్రాధాన్యత పోయాయని భావించటం పొరపాటు. ప్రజలలో అది ప్రచలితమౌతు వున్న ఉధృతాన్ని గమనించలేకపోపటం వలన కాని, గమనించటానికి ఇష్టపడక పోవటం వలన కాని కావచ్చు. మినీకవిత చచ్చిపోయిందని ఎవరో ఒక విమర్శకుడంటే దానికి తందానా పలికే అలవాటున్న— డూప్లికేటు విమర్శ మాత్రమే చేతకావటంవలన కూడా అలా భ్రమించ వచ్చు ఆంధ్రదేశంలో ఇపుడు బతికున్న విమర్శకుల్లో "ఒరిజినల్" విమర్శకులు ముగ్గురో నలుగురో వున్నారు. మిగిలినవాళ్ళంత డూప్లికేటు విమర్శకులు. "ఒరిజినల్"గా వచ్చే ఏ కవినైనా, ఏ కవితనైనా, ఏ నూతనత్వాన్నయినా ముందుగా పసిగట్టగలిగినవా ఒరిజినల్ విమర్శకుడు. ఇది చేతకానివాళ్ళు డూప్లికేటు విమర్శకులు. వీళ్ళే ప్రస్తుతం ఎక్కువ. వీళ్ళల్లో కొంతమందికి ప్రభుత్వాన్ని అధికారుల్ని, పలుకుబడినీ అసహ్యించుకుంటామంటూ చెప్పుకోవట మీద బాగా మోజు పడుతుంటారు. కాని కొన్ని పత్రికలకు, కొందరి సంపాదకులకు, కొన్ని "మందు" సీసాలకు కట్టుబానిసలైపోయి ఇలాంటి కొందరు విమర్శకులు తమవాళ్ళ మెప్పుకోసం ఆయ రచనల్ని ఆకాశాని కెత్తాలన్నా ఎత్తగలరు, పాతాళానికి తొక్కాలన్నా తొక్కగలమన్నట్లు ప్రవర్తిస్తుంటారు. ఇలా అంటున్నానంటే పత్రి కల్ని, సంపాదకుల్ని, అందరినీ చిత్తశుద్ధి లేనివారని నా ఉద్దేశ కాదు, డూప్లికేటు విమర్శకుల ముసుగు వేషాల్ని, వాళ్ళ కక్కుర్తి గమనించాలనేదే నా భావన.

ఒకటి మాత్రం నిజం. పత్రికల్లో మినీకవితల గురించి చర్చలు వ్యాసాలు కనిపించకపోయినా మంచి మినీకవితలు అపుడపుడూ ప్రచ రిస్తూనే వున్నారు. కొన్ని ప్రముఖ దినపత్రికల్లో మినీకవితల రావటం దాదాపు లేదనే చెప్పాలి. అంతమాత్రాన పత్రికలకు మం మినీకవితలు రావటం లేదనుకోవటంలో ఔచిత్యం లేదు. మంచి మిని కవితలు వస్తున్నా ప్రచురించటానికి ఇష్టమూ, అవకాశం కూడా వుండాలి. ఎక్కువగా వచ్చే రచనల్లో మంచి మినీకవితల్ని వెతుక్కు సమయం లేకపోవచ్చు. మినీకవితల కంటె వచన కవిత్వంలో కవిత్వం వున్నదని భావిస్తూ వుండవచ్చు. అంతేకాని మంచి మి కవితలు రావటంలేదని సంపాదకులు అనలేరు. ఒకవేళ పత్రికల మంచి మినీ కవితలు రాకపోయినా అందుకు వాళ్ళే బాధ్యులు ఒకప్పుడు మినీ కవితలు ప్రచురిస్తున్నారంటే గొప్ప గొప్ప మి కవితలు యువకవులు పంపేవాళ్ళు, అవి సాహిత్య అనుబంధాల్లో చోటు చేసుకొనేవి. ఇపుడు మినీ కవితల్ని ప్రచురించటంలేదు కను

కవులు పంపటం మానేశారని ఎందుకనుకోగూడదు? నిజానికి జరిగింది ఇదే.

మినీ కవితకూ వచన కవితకూ కేవలం "సైజు"లోనే తేడా ఉందనుకోవటం సరికాదు. శిల్పరీత్యా పరిశీలించి చూస్తే చాలా తేడా వుంది. మినీకవిత రాసే కవి తన పదాల్ని ఎంత జాగ్రత్తగా ఎంచుకుంటాడో, ఎంత నవ్యబంధురశైలి"లో బిగిస్తాడో ఈ క్రింది వివరణ బాగా తెలియజేస్తుంది.

పదోతరగతి ప్రశ్నపత్రాలు పరీక్షలకు ముందే వెల్లడైనపుడు ఆవేదనతో నేనో 40 లైన్ల కవిత రాశాను, "పబ్లిగ్గా అమ్ముతున్న బుర్రలు" అనే పేరుతో. ఆ కవిత నాకు అంతగా తృప్తి కలిగించలేదు. సమయానికి వచ్చిన యువకవి కవితాప్రసాద్ కిచ్చి చూడమన్నాను. అందులో చివరి రెండు లైన్లు — "డిగ్రీల కన్నెల యౌవనం / డబ్బు వేశ్యమాతకు అర్పణం" అన్నాను. మిత్రుడికి నా కవిత చూచాక ఒక "ఫ్లాష్" తట్టింది. ప్రశ్నపత్రాల కన్నెపిల్లల్ని మానభంగం చేస్తున్న దృశ్యం అతనిలో మెరిసింది. మొదటిదశలో ఇలా రాశాడు.

"సీళ్ళు పగలగొట్టుకొని
పేపెర్లెగిరిపోయి
న్యూస్ పేపర్లమీద వాలినయ్
రహస్యంగా తప్పు చేసిన కన్నెపిల్లలా
రాజకీయం చిర్నవ్వు తప్పుకుంటుంది
నోళ్ళు వెళ్ళబెట్టుకు
పారిపోయిన పరీక్ష కేసి."

వచన కవితలాగా వుందికాని మినీకవితలోని "నవ్యబంధురశైలి" రాలేదని అతనికి తెలుసు. అందుకే రెండోదశలో "పరీక్ష పేపర్లొట్" అనే శీర్షికతో ఇలా రాశాడు.

"పెళ్ళికి ముందు రోజే
కన్యాత్వాన్ని కోల్పోయింది
పెళ్ళికూతురు—
అయితేనేం
ఫీలయ్యేది "హార్టు",
ఫెయిలయ్యేది
పెళ్ళికొడుకు."

సంగా రాలేదు. మూడో దశలో ఈ క్రింది విధంగా రాశాడు.

"పెళ్ళికి ముందురోజే
కన్యాత్వాన్ని
కోల్పోయింది
పెళ్ళికూతురు,
పెళ్ళికొడుకు 'ఫీ'లౌతున్నాడని
పెళ్ళి వాయిదా వేశారు".

ఇట్లా రాసి "పేపర్ బోట్" అని శీర్షికను నిర్ణయించాడు. అయినా ఇంకా తృప్తి కలగలేదు. మినీ కవితాశిల్పం ఇంకా పూర్తిగా రాలేదు. అందుకే చివరికి ఇలా రాశాడు, "పేపర్ బోట్" శీర్షికతోనే.

"పెళ్ళికి
ముందురోజే
కన్యాత్వాన్ని కోల్పోయింది
పదోతరగతి పెళ్ళికూతురు."

శభాష్! ఇదీ మినీకవిత అంటే. ఇదీ మినీ కవితా శిల్పానికి ముఖ్యమైన ఉదాహరణ. ఇంత వివరంగా ఈ కవిత ఉత్పత్తిని గురించి ఎందుకు చెప్పానంటే - వచన కవితకూ, మినీ కవితకూ సైజులో తప్ప ఇంకేమీ తేడా లేదని భావించే విమర్శకులు ఈ శిల్పంలోని తేడాను గమనిస్తారని. కవికి "ఫ్లాష్" తట్టాక ప్రతిసారీ ఇలాగే ఇన్నేసి దశలుగా రాస్తేనే తప్ప అవి మినీకవితలు కావని కాదు - "ఫ్లాష్" తట్టినా ఒకోసారి ఎంత కష్టపడితేనోగాని అది మంచి మినీకవిత కాదు. మినీ కవితల్లో ఇంత చక్కని బిగింపు ఉంటుంది కాబట్టి అవి పద్యాలు కాకపోయినా వేమన పద్యాల్లా ప్రజల నాలుకలమీద పదికాలాలపాటు నిలబడే అవకాశం కలిగివున్నాయని నేను అనుకుంటున్నాను. గొప్ప మినీకవితలు అలాంటివి. తయారుకావటానికి కవి తన కవిత్వాన్ని ఎంత జాగ్రత్తగా చెక్కుకుంటూ పోవాలో! అందుకే వచన కవిత రాయటంకన్న మినీకవిత రాయటం గొప్ప కళ అని కూడా నేనంటాను. ఇటీవల కొందరు మంచి వచనకవితలు రాసే కవులు పై తేడా తెలియక మంచి మినీ కవితలు రాయలేక బొక్కబోర్లాపడ్డ సంగతి మనకు తెలియనిది కాదు.

మరో సంగతి కూడా ఇక్కడ చెప్పాలి. ఈ మినీకవితను సాహిత్య అనుబంధాల్లో ప్రచురణ కోసం కొన్ని ప్రముఖ దినపత్రికలకు ఒక్కసారే, ఒక్కరోజే పంపించాము, ఏ పత్రికా సంపాదకుడు ఈ మినీకవితను గుర్తించి ప్రచురిస్తాడో ప్రయోగపూర్వకంగా చూద్దామని. ఒకే ఒక్క పత్రిక ప్రచురించింది, అదీ ఉత్తరాల శీర్షికలో. ఇదన్నమాట కొన్ని పత్రికలు మంచి మినీ కవితలకిస్తున్న అవకాశం!!!

"మినీ కవిత్వం రాస్తున్న యువకవులు చమత్కారమే కవిత్వమనుకుంటున్నారు. చమత్కారం వేరు, కవిత్వం వేరు" అన్నారు ఇస్మాయిల్. మినీ కవితల్ని పరిశీలిస్తే ఒక్క చమత్కారమే కాదు, వచన కవితకన్న మినీ కవితల్లోనే ఎక్కువ శిల్పవైవిధ్యాన్ని గమనించవచ్చు.

ఆర్. ఎస్. సుదర్శనం గారిది కొంతవరకు సబబైన అభిప్రాయమే. "రసాత్మకం కావ్యం" అన్నట్టు ఒక వాక్యమైనా అది కవిత్వమౌతుంది. అలాగని ఒకటి రెండు పంక్తులలోనే కుదిస్తే, మన ప్రతిభనీ ఊహాబలాన్ని చంపుకోవడం అవుతుంది. అప్పటికంతే అయితే, అంతే సరిపోతుంది. ఇంక రాయకూడదు అనుకోవడం అర్థరహితం." అన్నారు సుదర్శనంగారు. చెప్పాల్సిన భావం అవసరాన్ని బట్టి వచనకవిత లేదా మినీకవిత రాయవచ్చు. ఇక్కడ మరో విషయం కూడా అంగీకరించాలి. అది కవుల వ్యక్తిగత అభిరుచికి సంబంధించినది. ఒక కవి కేవలం మినీకవితలు మాత్రమే రాస్తానని పట్టుబట్టి అవే రాసుకుంటానంటే మనం కాదనలేము. నిలిచేవైతే అవైనా చాలు. వేమన ఆటవెలది పద్యాలు రాశాడు. కావ్యాలూ ఖండికలూ రాయలేదు. వేమనకు కావ్యాలు రాయటం చేతకాపసటానికి వీలులేదు. అలాగే మినీకవితలు రాస్తున్న వాళ్ళందరికీ వచన కవిత్వం, పద్యకవిత్వం మొదలైనవి చేతకావని అనుకోకూడదని నా మనవి. పద్యాలు, గేయాలు, వచన కవిత్వం బాగా రాయగలిగినవాళ్లు మినీకవితలు రాయలేకపోతున్న సంగతి ఇంతకుముందే అనుకున్నాము.

ఎన్నో కావ్యాలకు, ఖండికలకు లేని ప్రచారం జనం నాలుకల మీద - వేమన పద్యాలకే వుందనే వాస్తవం గ్రహించటం అవసరం. రామాయణ భారతాది గ్రంథాల్లోని పద్యాలకూ ప్రచారం ఉన్నా వేమన పద్యాలకే జన బాహుళ్యంలో ప్రచారం ఎక్కువ. ఈ వాస్తవం చాలు పదునైన మినీ కవితలు రాసే కవులు ఇంకా ముందుకు సాగిపోవటానికి. మినీకవిత చిరంజీవి - వేమన పద్యాల్లాగా.

---

# అముహూర్తం

## శ్రీ వేంకా సుధాకరరావు

అక్షరాల కందని అనుభవమేదో
మనసు పట్టుకు వ్రేలాడుతూంది
ఆకాశంలో చంద్రునిలా
గొంతులో కొట్టుమిట్టాడే గుండెలా!
తెలియని ఏ విషయం గురించయినా
అనర్గళంగా ఉపన్యసించి
జనబాహుళ్యాన్ని మెప్పించి
రాజకీయవాది చక్కా పోగలడు కాని—
పరిచితం కాని విషయాన్ని
పండని ఆలోచనల్ని
అలవోకగ్గా అక్షరపరచి
విమర్శను తప్పించుకు పోలేడు, కవి—
రసానుభూతిని రగిలించనూలేడు
చదువరిని మెప్పించనూలేడు!
అనుభవాన్ని పుటం వేసి వేసి
ఆలోచనల తపించి తపించి
జ్యోతిర్దర్శనం పొందిన తరువాత కాని
అనుభూతి
అవ్యయమైన అక్షరాకృతి పొందదు.
అందుకే తెరచిన కలం మూతవేసి
తెల్ల కాగితాన్నలానే విడిచాను
మరో ముహూర్తానికి వాయిదా వేసి.

---

## యదాయదాహి "మహ్యామ్"
## "గ్లాని"ర్భవతి!"

కుండలించిన శేషతల్పంపై
పవ్వళించిన కృష్ణమూర్తిలా
నీ - చికిలి చెక్కిలిపైని
నల్లని పుట్టుమచ్చ
పాలవెల్లిలా నీ చిరునవ్వులు
ప్రేయసీ!
నాకు
"గ్లాని" కలిగినప్పుడల్లా
వేడుకను కలిగిస్తుంటాయి!

## మధురఫలాలు

సత్కావ్య పఠనంలాగా
సజ్జన సాంగత్యంలాగా
పరవశింపజేసేవి
పగలూ-రాత్రి తనివిని కలుగజేసేవి
"ఊహాలు" - "కలలే!"
బల్బిదల - బక్కవారల
సంసార వృక్షానికి
మధుర ఫలాలవే!

## వేమన ఆటవెలది

"పగటి గ్రుడ్డి"
"రేచీకటి"
రోగాలు సోకని
"కలువ కన్నుల చాన"!
"కమల నయన"!
లోకంలోని
మంచిచెడ్డల్ని
ఒప్పుతప్పుల్ని
యధాతథంగా చాటిన
"నెఱజాణ"!
కలధ్వనిన చల్లగా
పలికిన
కనకపు వీణ!

## యతిప్రాసలు

"పద్యతరుణిని"
నతాయించు
"విండమ్ములవారు"!
చల్లకడవలవారు!
"................"

## ఆద్యంతమూ మధురమే!

"భార్య - నానారుచిరార్థసూక్తి"
భర్త - "స్ఫురదరుణాంశురాగరుచి"
"సంతానం" - "రసాభ్యుచిత బంధం"
అయితే ఆ
"దాంపత్య కావ్యం"
"ఆద్యంతమూ మధురమే"!

## వలపు

కుముదం
విషమం
పంకజాతం
చంపలం అయిన మనసుని
కలువగా
మన్మథబాణంగా
కమలంగా
మెరుపుతీగెగా మార్చి
రమణీయం చేస్తుంటుంది!
అది తెలిసిన మనసే
మధురం,
కోమలం
మహోన్నతం!

## టీకాకారులు

'గూఢమయ
జీవితకావ్యాన్ని
అత్యద్భుతంగా
వ్యాఖ్యానించే
"మల్లినాథులు"
"నవ్వు - ఏడ్పులు"!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

# బెబ్బులి జాలిగుండె

కన్నడ మూలం :
డా॥ యు. ఆర్. అనంతమూర్తి

తెనిగింపు :
శ్రీ శంకరగంటి రంగాచార్యులు

"బట్ మోస్ట్ ఫార్ దోజ్
హూమ్ యాక్సిడెంట్ మేడ్ గ్రేట్
యాజ్ ఎ రేడియంట్ అండ్ ఛాన్స్ ఎన్‌కౌంటర్
ఆఫ్ క్లౌడ్ అండ్ సన్‌లైట్ గ్రోస్
ఇమ్మార్టల్ ఆన్ ది హార్ట్:
హూజ్ గిఫ్ట్ వాజ్ ది సడన్ బౌంటీ
ఆఫ్ ఎ పాసింగ్ మొమెంట్, ఎన్‌రిచస్
ది ఫుల్‌ఫిల్డ్ ఐ ఫార్ ఎవర్.
దేర్ స్పిరిట్స్ ఫ్లోట్ సెరీన్
అబవ్ ట్రైమ్స్ రఫేస్ట్ రీచస్,
బట్ దేర్ సీడ్ ఈజ్ ఇన్ అజ్ అండ్ ఓవర్
అవర్ లైవ్స్ దే ఆర్ ఎవర్ గ్రీన్."

— సి. డేలెవిస్

"ఏం వానంటావ్? కడచిన నెల గుక్కతిప్పుకోవడానికి వీలు లేకుండా కురిసింది- మూడురోజులు. తలుచుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది."

"ఎంగిలాకులేరేందుకు కూడా ఇష్టపడక వీధికుక్కలు పడుకుని వుండేవి-చావట్లో- ఒకరకంగా గుర్రుమంటూ."

"మా యింట్లో అయితే కన్నెతాళ్ళను విప్పి బర్రెగొడ్లని బయటికి తోలలేదు."

"కాళ్ళూచేతులూ శరీరమంతా ఒకరకంగా తిమ్మిరెక్కినలా ఉండేదిరా. ఇల్లూ, నేలా, గోడలూ- అన్నీ నీళ్ళోడుస్తూ వుండేవి. బయటికి వెల్లడం అలా వుండనీ లోన కూచోడానిక్కూడా సాధ్యం కాకుండా వుండేది!"

"మైసూరువైపు ఈ విధంగా మలనాడు వాన పడటం ఎప్పుడైనా జరిగిందేమయ్యా?"

"ఊరికే తలా ఒక మాట మాట్లాడుతూ పొద్దుపుచ్చడం ఎందుకురా-మైసూరినుంచీ ఇక్కడి దాకా వచ్చాడు పాపం. ఆ పొద్దు జరిగిన ఆ కథ చెప్పండి అతడికి —"

"నాకు పూర్తీ విచిత్రం అనిపించేదేమిటంటే- ఆ శణై లేడేమయ్యా- 'దేవుడి తలమీద పూవు తప్పినా....'' అనే సామెత ఏదో చెబుతారుకదా అలాగ అంగడి తలుపు సగం తెరచుకుని ఆవులిస్తూ, ఒళ్ళు విరుచుకుంటూ కూచుని వుండేవాడు! అలాంటి వానలోనూ "

"అది వుండనీలేవయ్యా, ఆ రోజేమో జరిగెనటకదా నది దగ్గర. దాన్ని గురించి చెప్పు మహాశయా."

*　　*　　*

నా కిపుడు వయస్సు తొంభై .... ఈ ముసలిముండావాడి బదుకులోనే చూడలేదు అలాంటి వాన! ... నేను పుట్టేందుకు పదేళ్ళ క్రితం అక్షయసంవత్సరంలో కొట్టిన వాన ఇలా కురిసిందో లేదో దేవునికే ఎరుక ....ఇలాగే ఈ చావడిలో కూచుని మా నాన్న దాన్ని జ్ఞాపకం చేసుకుంటూండేవాడు .. కానాకాలం జరిగింది ... ఏమేమి విచిత్రాలున్నాయో ఈ లోకంలో? ... "

"అది కాదయ్యా ... మా తాత ఈ రకంగానే గొణుగుతూ కూచునివుండేవాడు. ఇంట్లోవుండిన పిల్లలందరూ భయపడి తాతయ్య ముసలితొడ నంటుకుని వుండేవాళ్ళు! ... "

"మా ఇంట్లోనూ అంతే— మీరూ ఆ వానలో ఏ గట్టుకు వచ్చారు కదేమమ్మా! అల్లుడొచ్చారు- ఆ రోజు జరిగింది ఆయనకు చెప్పాను! ఏమన్నారు తెలుసా?"

*　　*　　*

కొండకోనల అందచందాల కుడుమల్లిగె పేటపేటే కురిసే వానలో శత్రువులు ముట్టడి చిన నగరంలా దిక్కుదిక్కులకు జనశూన్యపు రస్తాలను చాచి, మౌఢ్యం నెలకొన్న ఇళ్ళవరసల మసక మసక ముఖాలనెత్తి, కదలక మెదలక నిదురలో వున్నట్టుంది.... ఆ వైపు పేట పక్కలో పరుగెత్తే తుంగానదీ ప్రవాహపు హోరుమనే పిలుపు- ఈ వైపు ఒక విధంగా 'జరో- జరో' 'జరో-జరో' అంటూ కురిసేవాన-చుట్టుపక్కల మసకచీకట్లో స్వప్నపు భయంకరస్మృతుల్లా అస్పష్టరూపం ధరించి, చెవులు చిల్లులు పడచేసే డోలు చప్పుడును ప్రతిధ్వనిస్తూ నుగ్గునూచమైన మలనాడు కొండలు

ప్రకృతియొక్క ఈ భైరవతాండవానికి జనుల హృదయం శరణంది.

బాహ్యశూన్యమైంది.

చివరికి భయంతో కిమ్మనక ముడుచుకుని వణకింది.

హోరుమంటూ కురుస్తూవున్న వాన గాలితోకూడి జల్లుగానై, ఎక్కువై, తక్కువై, తక్కువై, ఎక్కువై, ఈడ్చి, ఈడ్చి కొట్టింది- (మారెమ్మ గుడిదగ్గర మాలవాళ్ళగూడెం విరిగి పడిపోయిం దట. అయితే అదృష్టం- ఎవరూ చావలేదు!) మసకచీకటి పూసిన భీకర శూన్య గగన భూమ్యంతర కటాహాన్ని ఏకనాదంతో మూలు గుతూ మూల్గుతూ వాన 'జరో-జరో' 'జిరో-జిరో' నింపింది....

ఆ గందరగోళాన్ని చూడటానికి సాధ్యంకాని సూర్యుడు (పేడి మొగమోడయ్యా!) మూడు రోజులూ మొగం తప్పించుకుని తిరి గాడు.... అయితే హోరుమనే వాన తాలూకు అట్టహాసం మాత్రం బూడిదరంగు చీకటిని వెలిగించి, చీల్చి, ఉరిమి, మెరిమి పిడుగులు పడవేసి, తైతక్కలాడి, విజృంభించింది....

* * *

(ఇలాగని చెప్పేందుకు కాదమ్మా!) పైనుంచీ పెనుముబ్బులు కురిసే జలపాతం- కింద మోకాలిలోతును మీరి పరుగెత్తే ఎర్రనీరు- ఈ నీటి లోకంలో చేపలా ఒక ప్రాణి పాడు మసకచీకటి నీదుతూ (నల్ల కంబడి ముసుగు పెట్టుకుని.... దయ్యంపట్టినవాడిలా గావుకేకలు వేస్తూ....) ఇంటింటి ఎదుటా నిలిచి, ఏమో కేకేసి అరిచి, భయ విహ్వలంగా సంచరించింది....

ఒకటి తరువాత ఒకటి నల్లకంబళ్ళ కప్పుకున్న పలుమంది అస్పష్టరూపాలు గుంపులు గుంపులుగా పరుగెత్తసాగాయి...

వాన చీకటిని కురిసింది. చీకటి వానను కురిసింది మసక చీకటి ఊపిరి బిగబట్టి కిందికి వంగింది. అయినాకూడా జడత్వం విసిరిపారేసి, ఎదచరచి, ఇళ్ళు వదిలింది జనం.

"ఏడుస్తూవున్న పిల్లను చంకలో వేసుకుని వెళ్ళానమ్మా నేను!"

"మా అవ్వ ఏమైనా కానీ అంటూ కర్రపట్టుకుని బయల్దేరే బయల్దేరింది!"

"ఏమన్నా చెబితే విన్నాడా వాడు? నా పెద్దకొడుకు—— ఎద విరుచుకుంటూ ఉరకెత్తే ఎత్తాడు—— ఆరోజు జరిగిన సంగతే అలాంటి దనండి!"

చెవి చెవిలోనూ నిండిన వానహోరుతో, వేడివేడి దుఃఖవార్త ఒకటి మెరపులా మెరసి, లక్షకళ్ళు తెరుచుకున్నాయి; పెదవులు అదిరాయి. జీవశూన్యమై విసుగుచెందిన కందుమల్లిగెకు మీదమీద ఉత్సాహం పెరిగింది. వీధి వీధిలోనూ జీవనాడి గజిబిజిగా మ్రోగింది.

అయితే ధారలు ధారలుగా, ఓతప్రోతంగా, కురిసి, ఉప్పొంగి సందు సందులోనూ దాడిచేసి, 'ధిమి ధిమి' ధ్వనితో నురుగులు కక్కు కుంటూ తాండవించింది వాన....

* * *

గొడుగులు తట్టుకోని వానలో కంబళ్ళ ముసుగుల అస్పష్ట రూపాల నల్లని రాసులు; ఎదుట మసకచీకటిలో ఎర్రనీటి ప్రవాహం- రుద్రరూపం ధరించిన తుంగానది...

వేయికళ్ళు వికసించి, మసకచీకటిని ఛేదిస్తూ, ప్రవాహాన్ని భేదిస్తూ ఈదినాయి...

కోటి బెబ్బులుల గర్జనలలాంటి తుంగానదియొక్క మసలే ఎర్రనీళ్ళు, దాని నడుమ తలమాత్రం కనిపించే 'పిడుగుబండ'యొక్క అస్పష్టపు నల్లని కాంతి, దానిమీద ఒక కదలాడే, మెదలాడే వస్తువు...

పడిన చెట్టెక్కి, ఇంటి పైకప్పులు చేరి, పచ్చి చీకటిని చీల్చి, నానా అవస్థలూ పడి చూసింది జనసముద్రపు దృష్టి-

బండనెత్తిమీద మెదలాడే ఆ ప్రాణి...(కాదు - కాదు - అవి చేతులయ్యా...) మరగేనూనెలో పడ్డ పాములా విలవిల తన్నుకునే... (ఆ...అయ్యో!) ఆ...

* * *

...ఆ బదుకు మునిగిపోవడానికిక మోకాటిలోతు నీళ్ళు చాలు.

తుంగానది భయంకర ప్రవాహం నిదాన...ని..దా..నం..గా పైకి ఎక్కుతూనే వుంది.

"అయ్యో! అయ్యో! అయ్యో!" ("ఎలాంటి వాళ్ళకైనా గుండెలు కరిగిపోవేమయ్యా?") జనుల హృదయాలనుండీ ఘోష లేచింది...

చూస్తూ చూస్తూ వుండగానే గట్లు ఒరసుకుని ఒరసుకుని ఎక్కుతూ నిదాన ని...దా...నం...గా పైకి ఎక్కుతూనే వుంది... నీరు...

తీరం మీద గుమిగూడిన జనం - (అలాంటి సమయంలో ఊరికే నిల్చుకునేందుకు ఎవరికైనా సిగ్గు కాదేమయ్యా?) ఒకరికొకరు ముఖాలు చూపించుకోవడానికి కాక మొగాలు వ్రేలాడవేశారు.

బండమీద వున్న నీడలాంటి ప్రాణి - వణికి, వంగి, ఎదుట తలలు వంచుకుని నిల్చున్న ప్రాణిలోకాన్ని సైగచేసి వేడుకుంటోంది. ఇక్కడ వున్న ప్రతివాడి హృదయమూ తల్లడిల్లి అల్లాడుతోంది... అయితే రెంటి నడుమా ప్రళయాట్టహాసం 'హో' అంటూ పొంగిపొరలి పోతూంది...

అస్పష్ట హస్తాల విచిత్రమైన మసక మసక సంకేతం యమ భీకర శబ్దాన్ని అధిగమించి, కరుణతో మొరపెట్టుకుని ప్రాణభిక్ష యాచించింది. వాన భీకర స్వరూపం ఊపిరి తిప్పుకోవడానికి కూడా

పీలు లేకుండేపట్టు ప్రతి చెవిని అరపులతో నింపింది. మనుష్యుల కంఠాల నిరుపయుక్త అభయధ్వని సిగ్గుచెంది ప్రవాహపు మ్రోతల మడుగులో దూకి ప్రాణాలు వదిలింది.

భయమూ, కరుణా, ప్రేమా, మనస్సులోని పందలాది వ్యధలూ మూకభీత హృదయ హృదయ కవాటాన్నీ తట్టి, తట్టి, గోడుగోడున ఏడ్చి బాధించింది...

అయితే ప్రకృతియొక్క క్రూరపుటలక్ష్యం, అట్టహాసం, వానను కురిపిస్తూనే వుంది.

* * *

"ఇంతకూ చివరికి ఆ మహానుభావుడు - మునిసిపాలిటీ అధ్యక్షుడు కదయ్యా - దేవుడు వచ్చినలా వచ్చాడు కారులో"

"మేమంతా అతడి చుట్టూరా మూగాము, తెలుసా"-అందరిదీ తలా ఒకమాట!"

"ఎవరికీ తోచనిది అతడికెలా తోచిందో! తనతోపాటు ఒక మైకూ, బ్యాటరీ తెచ్చాడు!"

"మొదట్లోనే జాగ్రత్తలు తీసుకుంది ఆశ్చర్యమే కదా! లేకుంటేనో?"

"ఛీ! అదుండనీలేవయ్యా! - మైకు కట్టారో లేదో, మా ఎదలకు నోరు వచ్చినట్లయింది; ఆ తర్వాత..."

* * *

ఎత్తైన, రెమ్మలు వ్యాపించిన చెట్లకు డబ్బారేకుల నోళ్ళు బండమీది ప్రాణికి 'అభయ' నాదాల్ని చేశాయి — ప్రవాహపు హోరుకు ప్రతిద్వంద్వులుగా కిర్రుమని అరచుకున్నాయి!

"భయపడవద్దు. ఎవరినైనా తెప్పలో పంపుతాము-(అయితే వెళ్ళేందుకు ఎవడు సిద్ధమై వున్నాడు??) నీళ్ళలోకి దూకవద్దు— జాగ్రత్తగా బండమీద ఇంకా కొంచెంసేపు నిలబడు-భయపడవద్దు"

వర్షపు పంజరంలో చిక్కుకుని తన్నులాడుతూ వుండే ప్రాణికి వినబడిందో లేదో! చేయిసైగ, నోటిసైగ, ఒంటి పెనుగులాట, తన్నులాట - అన్నీ మసకచీకట్లో వేదనాధ్వనిని వర్ణిల్లచేస్తూన్నాయి. బాణల్లోవేసి వేగిస్తూన్నట్టు బండమీద కొట్టుకుంటూ వుంది.

అయితే జనులు ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకున్నారు. (కేసరిని చెనకి నీవెదిరించగలవా?) మసలే నీటికడలిలో ప్రాణంమీద ఆశవదిలి ఎవరు దూకగలరు? ఎవరికి? ఎవరికుంది - తెగువ??

డిప్పలో ప్రవేశించి కూర్చుంది తాబేలు.

(అయ్యో, మా నాయన ముసలాడు - ఆయన్ని వదిలి ఎలా? నా ప్రాణమొకటి ఎక్కువని కాదు - అయినా..."

"చేయిపట్టిన ఇల్లాలి గతి ఏమయ్యా, తరువాత? - నేనేమో తెగించి వేయొచ్చు..."

"పాపం, దురదృష్టవంతుడయ్యా! అయితే, ఏం చేసేందు కవుతుంది?"

"ఎవరి జవాబ్దారీని ఎవరు మోసుకోవడానికవుతుందయ్యా?"

"ఎవరెవరి నొసట ఏమేమి రాసిందో — తప్పించటానికి సాధ్యమా?"

"దే ఆల్సో సర్వ్ హూ ఓన్లీ స్టాండ్ అండ్ వెయిట్?)

* * *

నిదాన ని...దా...నం...గా తుంగానది నీళ్ళు పైకెక్కుతూన్నాయి...

డబ్బారేకుల బోలునోళ్ళు 'అభయ' నాదాలు చేస్తూన్నాయి...

బండమీది ప్రాణి కుతకుత ఉడుకుతోంది...

వాన హోరులో వర కీటకాలు గిజగిజమంటూన్నాయి...

("వాన వేగం పుంజుకుంటోంది — పోదామేమయ్యా?"; "ఏమవుతుందో చూద్దాం వుండవోయ్!"; "మీరిద్దరూ ఇక్కడే వుండండి - నా కాదృశ్యం చూచేందుకు చేతకాదయ్యా"; "అయ్యో, పిచ్చివాడా, మొగ గుండె కావాలిరా!")

ధగధగలాడుతూన్న కళ్ళు - నల్లటి కంబడిలో కంపిస్తూన్న దేహం - నీళ్ళను చిమ్ముకుంటూ పరుగెత్తుకుంటూ వస్తూన్నాడు. ఆ తొందర...

(ఎవరయ్యా, వీడు? - ఏం తొందరయ్యా వీడికి?")

"కొంచెమూరకుండ్రా-అధ్యక్షుడి కదేమో చెప్తూన్నాడురా!"

మునిసిపల్ అధ్యక్షుడు గొంతు ముందుకు చాచి చకితుడయ్యాడు.

"ఏమయ్యా, నీ సొంత జవాబ్దారీ మీదే వెళ్ళుతావా? నీ పేరు?"

"సిద్ధుడు" - (అమ్మ పెట్టిన పేరుకెంత విలువ ఇప్పుడు)

డిప్పను వదిలి బయటికి వచ్చింది తాబేలు.

("మహానుభావుడయ్యా, నిజంగా, ఆ సిద్ధుడు."; "ఏ వూరి వాడు, మహాశయా, వాడు?"; "ఒకడే అదెలా తెప్ప నడుపుతాడంట?"; "ఆ బ్రదుకును కాపాడితే గొప్ప పుణ్యమొస్తుందయ్యా వాడికి"; "చూచి పోదాం నిలవ్వోయ్!")

* * *

"వాడికి ప్రాణంమీద విసుగుపుట్టి వుంటుందయ్యా, నిజంగా!"

"ఈ వానకు పాములు పుట్టల్లోనించీ లేచివస్తాయయ్యా. కాలి దగ్గర భద్రం! ఈ పక్కకు రా. వాడి కథ చెప్తాను. నాకు వాడి సంగతి తెలుసు!"

"ఏమి? తెప్ప ఇంకా బయల్దేరలేదు-త్వరగా చెప్పేయ్!"

"ప్రాణంమీద విసుగు పుట్టకుంటే ఈ జడివానలో బయల్దేరే వాడా? వాడి పెండ్లాం బలు బజారులంజయ్యా. మేస్త్రీ సీనసెట్టిని పెట్టుకుని వుంది!"

"ఎవరు? ఏ సీనసెట్టి?"

"వాడొకడున్నాడురా! పచ్చిపోకిరీ - తాగుబోతు! - కోర మీసాలూ, ఎర్ర తలపాగా, కాల్కడియాలూ —— చూడలేదేమిరా? హూఁ. వాడే. ఈ మధ్య సిద్ధుడు పిచ్చివాడిలా తిరుగుతూన్నాడు... రాళ్ళు కొట్టే పనికి కూడా వెళ్ళటం లేదు —— ఇంటివైపూ పోవడం లేదు!"

"ఎంత కండలు తిరిగివున్నాదీ సిద్ధుడు! ఆ పూచికపుల్లలాంటి సీనసెట్టిని వీడు చంపక వదిలిపెట్టి ఉండటమే ఆశ్చర్యం: కదేమిరా?"

"పాపం! ఏం చేసేందుకవుతుంది చెప్పు? ఒక్కొక్కరి గ్రహచారమే అంత - రే, తెప్పనెక్కాడురా! చూద్దాం, రారా!"

"ఈ పని చేసి ముగించితే పాపం - వాడికేమైనా ఇవ్వాలి; అయితే మునిసిపల్ ప్రెసిడెంటు చెయ్యి విప్పుతాడేమయ్యా? మనకి దాపురిస్తాడు..."

జనుల మాటలు ఒక్కసారిగా తటాల్ని నిలిచాయి. వాన కురుస్తూనే వుంది. సిద్ధుడు తెప్పనెక్కి, తెడ్డు పట్టుకుని, నిటారుగా నిలిచాడు - ప్రవాహానికొకసారి వినయంగా చేయి మోడ్చాడు. తీరం మీద గుమిగూడిన జనాన్ని ఒకసారి చూశాడు..."వర్షపు పంజరంలోని చెలరేగిన సింహం' నింగివైపు కళ్ళుతిప్పి, తీరంమీద ఒంటికాలు పెట్టి, మీటాడు, హోరుమనే వర్షమూ, చీకటిగొడ్డు గట్టూ ప్రసవించిన కాంతిపిండం - సిద్ధుడు - తెడ్డుతో నీటిని చీల్చాడు...

ఒక చుట్టు తిరిగి తెప్ప బయల్దేరింది...

* * *

మసక చీకట్ల వర్షమే తల విరబోసుకుని నిలుచున్నట్టు కరిమబ్బు పరుచుకునివుంది రెచ్చిపోయి. ముగ్గురు తెడ్డువేసినా సాధ్యం కాని వేగంతో నీళ్ళు దూకుతూ, దూకుతూ ఆవేశంతో పరుగెత్తు తున్నాయి.

నిదానంగా, నిదానంగా నీళ్ళమట్టం పెరుగుతోంది.

జనులు పెదవులు బిగించి, ప్రాణాల్ని కళ్ళలోకి తెచ్చుకొని చూస్తూన్నారు.

డబ్బానోళ్ళు ఉత్సాహాన్ని నింపే మాటల్ని ధ్వనిస్తున్నాయి.

ప్రవాహం తెప్పను పైనికెక్కడానికి వీలుకాకుండా క్రింది క్రిందికి తోస్తోంది. పొరపాటున ఒక త్రోపుకు చిక్కినాసరే, ఏదైనా జలసమాధిలో కూర్చున్న బండను ఢీకొని తెప్ప పొడి పొడి అయ్యే పరిస్థితి వుంది. మూరకొక సుడిగుండం ఆవులిస్తోంది; మునుముందుకు పరుగెత్తుతూన్న ఈ సుడిగుండాలు తెప్పను గిర్రున తిప్పి, లోనికి ఈడ్చుకుంటూన్నాయి.

ఇనుప గుదియల్లాంటి చేతులు - ఒకసారి ఎడమకూ, ఒకసారి కుడికీ తెడ్డునేస్తూన్నాయి తెప్పను ఎగమీదే విషయంలో ఆ ప్రాంతంలో వాడికి సాటి మరొకడు లేడు. (అయితే బదుకు తెప్ప?) ప్రవాహానికి అభిముఖంగా ఎవరికీ లేని తెంపూ, తెగువా ఉత్సాహం ఉప్పొంగుతున్నాయి! (బదికి ఏం ప్రయోజనం?)

సిద్ధుడు దైత్యశక్తితో తెప్పను పైకి ఎగదోస్తూన్నాడు. ("సిద్ధా, ఒక దురదృష్టజీవిని బదికిస్తే ఎంతటి పుణ్యమో చూడు!"- పుణ్యం లేకుంటే పోనీ, చేసిన పాపం నశిస్తుందా?) బయట వానదీ, ఏటిదీ మ్రోత. (దాన్ని మించిన మ్రోత లోపల:) తెప్పను పైనికీడ్చుకోవడానికి ఊపిరి బిగబట్టి తెడ్డువేశాడు. కాని తెప్పకన్నా వేగంగా హృదయ ప్రవాహంలోని ఆలోచన పై కెగురుతోంది. (తెడ్డు వేశాడా, అక్కడ?)

కేకలేస్తూ ప్రవాహంతో పోరాడడం మొదలుపెట్టాడు.

(అంతరాళానికి దిగి కెలికె ప్రజ్ఞ - బెదరి వెనక్కు వెనక్కు చూస్తూ చీకట్లో నిచ్చెనవెంట దిగే దొంగ - పట్టుకో! పట్టుకో!!)

పట్టుకుని తెడ్డును బలంగా మీటాడు. తెప్ప ఇంకొంచెం పైకి ఎక్కింది. తుంగానది పెనుమారిలా తరంగాలతో తాడిస్తూ వుంది. చేతిలోని తెడ్డు అల్లాడుతోంది. (చేతిలోని కత్తి ఝుళిపింపబడుతోంది! అలలు అలలుగా కొట్టింది — పెండ్లాన్ని - ఆహ్! పెండ్లామా? —— 'ఛూ, సీనసెట్టి లంజ!' - పెనుమారి మాట - "నీదేం - నా యిష్టం- "నీవే ఇల్లు వదిరి పో, ఊఁ పద," "అబ్బా!")

రోషంతో మైమరచి తెడ్డువేశాడు. ఆడదాని మెత్తని దేహం పదునైన కత్తియొక్క ఒకే దెబ్బకు - కచక్! 'ఆయ్యో, కళ్ళలో రక్తం లేదేమయ్యా, నీకు?') అయ్యయ్యో! ఏమి భయంకరమైన నది ఇది? (అయ్యో! ఇంటినిండా రక్తం! ఊరక కూర్చుండేందుకు షండుడేమి?' - నడుమును చేరింది నెత్తురు పూసిన కత్తి.)

చేయి తెడ్డు వదిలే పరిస్థితిలో వుంది. తటాలున చైతన్యం పుంజుకుని జారే పిడిని బలంగా అదిమి పట్టుకుని ఈడ్చాడు...

అంగుళం అంగుళం నిదానంగా, ని...దా...నం...గా ప్రవాహం హెచ్చుతూ వుంది.

పైకి వస్తూవున్న నీళ్ళనుచూసి బండమీది ప్రాణి కాళ్ళు కాలిన పిల్లిలా పెనుగులాడుతూ వుంది.

(అయ్యో! పాపం!) సిద్ధుడు ప్రవాహాన్ని బొమముడివేసి చూసి, పళ్ళు గదించి, తెడ్డును ఇంకింత బలంగా వేశాడు. (ఒక

ప్రాణిని చంపినందుకు ఇంకొక ప్రాణిని బదికించినట్టయింది కదా? అయితే, సీనసెట్టి? - పొడుగానీ - వాడి పాపానికి తగ్గ శిక్ష దేవుడు వేయనీ.)

యాంత్రికంగా చేతులు తెడ్డు వేస్తున్నాయి. పరధ్యానంగా వున్నపుడు ఒకసారి ఛోరుమని మ్రోత పెడుతూన్న ప్రవాహంలో, సుడిగాలిలో చిక్కిన ఎండుటాకులా, తెప్ప గడగడ వణికింది. తల తిరిగి కళ్ళను చీకటి మ్రింగుతూన్నట్టు అనిపించింది.

(అయ్యో! గొత్తెను నా ఎదుట సంకొద్దమ్మా, తల తిరుగుతుంది!"

"అయ్యో, నా నాయనా! బలంలో బెబ్బులి! అయితే, గొత్తెని కూడా నరకలేని కమణాకు-మా సిద్ధుడిది శుద్ధ ఆడపేగికయ్యా")

తన శక్తికి మించి తెప్ప సుడికి చిక్కి, చుట్టుతూండడం చూసి. సిద్ధుడు ("జట్టిలా నిలబడకపోయివుంటే, మారిని చంపడానికి చేయి వస్తూండేదేమమ్మా?) ఊపిరి బిగబట్టి తెడ్డును తెప్ప ముక్కుకింద వేసి ఈడ్చాడు. తెప్ప పైకెక్కింది. ('సిద్ధుడు శక్తిలో పులి'.) తీరంమీది జనులు ఆశ్చర్యంగా 'హో' అన్నారు. బండమీది ప్రాణి నిటారుగా నిలిచిచూసింది. సిద్ధుడు ఒకసారి ఆవైపూ, ఒకసారి ఈవైపూ - రెండువైపులా చూశాడు. కొత్త ధైర్యం వచ్చి, తన శక్తి నూరురెట్లు పెరిగినట్లయింది. ('బెబ్బులి ఆడపేగు!') ఒకసారి నిట్టూర్చాడు. (సీనసెట్టి? వాడి పాపానికి శిక్ష దేవుడు వేయనీ!) తన శక్తియొక్క అల్పతను మరచిపోయి, తెడ్డును మళ్ళీ ఇంకొకసారి, తెప్ప ముక్కు కిందికి ఆనించి ఈడ్చాడు-

తెప్ప పైకెక్కింది!...

• • •

వాన కొట్టడంలోని జోరు నిముష నిముషమూ ఎక్కువవుతోంది.

నీటి నడుమ వర్షపు పంజరంలో చిక్కుకున్న తెప్ప జనుల కనులకు కరిగిపోయినలా అయి, అస్పష్టమైపోతూ వుంది....

గట్టున నిలుచున్నవాళ్ళందరూ ఉద్విగ్నులై, తామే తెప్ప నడుపుతూన్నామన్న భావనతో ఆవేశం చెంది, పట్టి చేతుల్ని, ఆవైపునుంచీ ఈవైపుకూ ఈవైపునుంచీ ఆవైపుకూ ఆడిస్తున్నాడు. అన్ని కళ్ళూ తెప్పయొక్క క్షణ క్షణ గమనాన్నీ కుతూహలంతోనూ, ఆత్రంతోనూ గుడ్లప్పగించి చూస్తున్నాయి.

("పోవటమే ఇంత కష్టమైతే ఇక తిరిగిరావటం ఎలానయ్యా?"

"చెడు తలవకు మహాశయా ...నీ నాల్కమీద నల్లమచ్చ వుండొచ్చు"

"కాదయ్యా, ఈ భారీవానలో తెప్పనిండా నీళ్ళు నిండుకుంటే ఎలా అంటూ ఆలోచించా. అంతే!"

"ఇక్కడుండే పాయంటింతే చూడు. 'పిడుగుబండ'కు ఈ ప్రవాహంలో నేరుగా తెప్ప నడిపించేందుకు కాదు. సిద్ధుడేమైనా కొంచెం పైకిపోయి, పక్కకు తిప్పుకుని తెప్ప నడిపించాడో-అపుడు బదుకొంటారు ఇద్దరూ కూడా!"

"అయ్యయ్యో! చూడు - ఒక మూర పైకి పోతే, రెండు మూరలు కిందికొస్తోంది! అరరే! ఆ సుడిలో....అక్కడొక బండ వుంది - కదేమయ్యా?"

"ఇంకేం? ఒక మడమెత్తు నీళ్ళు పైకొస్తే చాలు, ఆ ప్రాణి తేలిపోతుంది. ఇంతచేసీ వ్యర్థం! పాపం!")

• • •

తెడ్డువేస్తున్న సిద్ధుడు క్షణకాలంపాటు 'పిడుగుబండ'వైపు చూశాడు. (సీనసెట్టికి తగినశిక్ష దేవుడు విధించనీ!) ఎడమకు తిరిగితే జనసాగరం - చుట్టూరా ఎర్రనీటి ప్రవాహం. (అయ్యో! కళ్ళలో రక్తం లేదేమయ్యా, నీకు?") తెప్పలో నీళ్ళు నిండుతూండడం చూసి గాభరా పడ్డాడు (చస్తే ఏం పోతుంది? ఎందుకు బదకాలి ఇంక?... అయితే చంపిన పాపానికి దురదృష్టజీవిని బదికించి....")

"ఓహ్-హో-ఓహ్; ఓహ్-హో-ఓహ్"

కేకేస్తూ, కేకేస్తూ తెడ్డు వేశాడు.

తెప్ప నిదానంగా, ని....దా....నంగా.... పైకెక్క మొదలెట్టింది. (దేవుడి దయ!)

సిద్ధుడికి చేతిలోని శక్తి అంతా ఉడిగిపోతూన్నట్టు అనుభవమైంది. ఒక క్షణం విశ్రాంతి తీసుకోవాలంటూ తెడ్డును పైకెత్తి, ఉసూరుమంటూ దీర్ఘనిశ్వాసాన్ని వదిలి, మరొకసారి తీరంవైపు చూశాడు.

అందరూ అతని వెనకాల చేతులుచాపి ఏమో అస్పష్టంగా కేకలేయ మొదలెట్టారు. రేకుడబ్బాల నోళ్ళేమో గొర్ గొర్‌మంటూ అరిచాయి. హోరుమని కురుస్తూన్న వానలో చెవులు దిమ్మెక్కి ఏమీ వినిపించదు.

జనులు చేస్తున్న చేసిన దిక్కు సిద్ధుడు మెల్లగా తిరిగి చూశాడు. గుండె జల్లుమంది. క్షణంలో ఇంతసేపూ చేసిన సాహసమంతా నీళ్ళపాలైపోయేలా వుంది.

తెప్పకు మిక్కిలి సమీపంలోనే తేలివస్తూన్న భీమాకారపు ఒక వృక్షం!- చరాలున శక్తిని మించి తెడ్డువేసి, తెప్పను ఒక పక్కకు నెట్టుకున్నాడు. తెప్ప ప్రక్కకు వచ్చిన వెంటనే-ప్రవాహం మీద వచ్చిన వృక్షం తెప్ప ముక్కుకు తగిలింది. అయితే తగిలిన రభసానికి తెప్ప అంతదూరం ప్రక్కగా 'పిడుగుబండ'వైపుకు తేలాడుతూ పోయింది....

రాను రాను బండనీళ్ళతో మూసుకుపోతూ వుంది. బండమీది ప్రాణి పెనుగులాట మితిమీరిపోయింది. (ఛీ! పాపజంతువు!)

"ఓహ్. హో ఓహ్; ఓహ్ హో ఓహ్"

సిద్ధుడు చర చర చర తెడ్డువేశాడు.

తెప్ప 'పిడుగుబండ' దగ్గరికి వచ్చి, దబ్బున రాతికి తగిలి నిలబడింది. రేకు డబ్బాలనోళ్ళు కేకలు పెట్టాయి.

"ఇది ఒక మహా పుణ్యకార్యం! మానవజీవిని బదికించిన మహోన్నత కార్యం"

జనం 'హో' అంటూ తామే గెలిచినవారిలా తీరంమీద వానలో నృత్యం చేశారు.

సిద్ధుడు తెడ్డును తెప్పలో పెట్టి తలఎత్తాడు.

ప్రవాహ రోషానికన్నా అధికమైన రోషం ఎదలో ఉప్పొంగింది. (దేవుడే శిక్ష విధించినా కాపాడేందుకు! తాను!) పెదవులు అదిరాయి. పెండ్లాన్ని నరికేసి వచ్చి తెడ్డు పట్టిన చేయి, నడుములోని ఒరనుంచి కత్తిని లాగింది. (పెండ్లాన్ని ఎవరికోసం చంపి? ఇపుడు....ఎవరి కోసం....ఈ ప్రవాహం!)

ఆయాసంతో సిద్ధుడు ప్రేలాడు.

"అహ్! సీ....న సెట్టి!"

బండమీది జీవి - జంతువు....(ఇస్సీ! బదుక!!) గొర్రెలా - (ధూ) మెదలాడింది - (అమ్మా! చూడలేనమ్మా!!)

"ఆ....ఆ....వావావా!!....(వా....వా....)..."

దురదృష్టజీవి ప్రతి అవయవమూ ప్రాణభిక్ష యాచించింది.

(అయ్యో! అమ్మా!! అమ్మా!....గొత్తును చంపొద్దు..."వా.. వా...." అయ్యో!"

క్షణంలోనే సిద్ధుడికి కళ్ళు చీకట్లు క్రమ్మి చతికిలబడ్డాడు.

పెండ్లాం ప్రాణాన్ని ఆహుతిగా గొన్న చేతనున్న కత్తి జారి పడి ప్రవాహపు నీళ్ళలో మునిగిపోయింది!

సిద్ధుడు మళ్ళీ తెడ్డుకు చేయివేశాడు.

---

# !!!!!

## శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్

చిట్లిన - ఈ పాత్రను గురించి - కవిత్వం నీకు చెప్పినపుడు
ఆనందం లాంటి విచారం కలిగింది కదూ........
అవును-! ఆ బ్రద్దలైన పాత్రిక - నా హృదయం!
తెగిన - ఈ వీణ తీగనుమీటి - నాదంగా నీకు వినిపించినపుడు-
ఝల్లుమన్న స్పందనలాంటి సంగీతం వినుపించింది కదూ........
అవును-! ఆ తెగిన తీగలు - నా లేత నరాలు!
చినిగిన - ఈ కాన్వాసుముక్కల్ని అతికి బొమ్మలా నీ ముందుంచినపుడు
ఉబికిన కన్నీళ్ళు -నీ కనుకొలకుల్లో నిలిచాయి కదూ....
అవును-! ఆ అతుకులబొమ్మ - నా పిచ్చిమనస్సు!
మరణించిన - సీతాకోకచిలుకల రంగుల రెక్కల్ని గాలిలో నాట్యం చేయిస్తున్నపుడు
వేదాంతిలా నీ శిరస్సు నిట్టూర్చింది కదూ........
అవును-! ఆ విరిగిన రంగుల రెక్కలు - నా ఫలించని ఆశలు!
పగిలిన - ఈ శిలను కన్నీళ్ళతో కడిగి శిల్పంగా ప్రదర్శించినపుడు
ఆశ్చర్యంతో నీ నొసలు ముడుతలు పడ్డాయి కదూ........
అవును-! ఆ ఛిన్నశిల్పం - నా శిథిల శరీరం!

## డా॥ కొల్లూరు సూర్యనారాయణ

# కాటమరాజు కథలు - చారిత్రకత!

"రామాండ కతలంటె మీ మెరుంగనివా
కాటమరాజుకు కర్ణువోడె
భారత కతలోన బాల రాజొక్కడు
కుంబకర్ణునిబట్టి గుద్ది జంపె
బాగోతకత కంట పాటమె అందులో
యిగినేశుధర్ణున్ను నిరగ బొడిచె
కందపురాండంబు కతపిల్ల కాటేరి
యూరబ్రదుని యిసియించి చంపె...."[1]

• • •

తెలుగునాట జానపదుల్లో కాటమరాజు స్థానం పురాణ పురుషులతో పెనవేసుకొని, ఏ మేరకు స్థిరపడిందో చాటి చెప్పటానికి పై పద్యమో చిన్న ఉదాహరణ. వేర్వేరు కారణాలవలన, వినసొంపు కలిగించే జానపదుల గీతాలకు దీర్ఘకాలం పాటు సాహితీగౌరవం లభించక పోయినప్పటికీ, యీనాడు జరిగే పలు అధ్యయనాల్లో, పరిశోధనల్లో, దానికే పెద్ద పీట వేయటం జరుగుతోంది. ఒక జాతి సంస్కృతిలో జానపద విజ్ఞానపు పాత్ర నిస్సందేహంగా గణనీయమైనదే. ఈ విషయాన్ని గుర్తించే బహుళసంఖ్యలో పండితులు, పరిశోధకులు, శ్రమదమాలను సరకుచేయక గత కొద్ది దశాబ్దాలుగా అపారకృషి సలిపి యీ జానపద సాహిత్య పరిశోధనని ఒక ఉద్యమంగా నిర్వహిస్తున్నారు. వారి కృషి సర్వదా అభినందనీయమైనది. అయితే పరిశోధనోత్సాహంలోనో, ప్రమేయపరిధిని విస్తరించుకొనే ఉబలాటంలోనో, యీ పరిశోధనల వేగం కొన్ని సందర్భాల్లో మూల విషయాన్ని మితులు తప్పిస్తోంది. జానపద సాహిత్యంలోని వివిధాలైన అంశాల్ని చరిత్రకు అన్వయింపచేయబూనే ప్రక్రియని ఆ విధంగానే అనుకోవలసి వస్తోంది. చరిత్ర నిర్మాణానికి అవసరమయ్యే ఆధారాల్లో, సాహిత్యం విలువను ఏ విధంగాను ఎవ్వరమూ తక్కువగా అంచనా వెయ్యలేం. దానికి కారణం ఆ చారిత్రకాధారం ఏ కాలానికి, ఏ ప్రాంతానికి సంబంధించినదో వివరంగా తెలియటమే. అవి తెలుపబడని సాహిత్యం యావత్తూ చారిత్రక దృష్టిలో నిష్ప్రయోజనకరమే. అనంత చరిత్ర గమనంలో ఒక అంశం, (అది సాంఘిక, మత, రాజకీయ, సామాజిక రంగాల్లో దేనికి సంబంధించినదైనా కావచ్చు.) ఎప్పుడు, ఎక్కడ జరిగిందో స్పష్టంగా తెలియజేయబడనప్పుడు, ఆ ఆధారపు చారిత్రక విలువే పూజ్యం. అలాంటిది ఏ కాలంలో, ఏ ప్రాంతంలో, ఏ వ్యవస్థలో రూపొందించబడిందో స్పష్టంగా తెలియలేని జానపదుల పదాల్ని, చరిత్ర నిర్మాణాని కుపయోగించటూనటం సాహసమే కాదు, పంటస కూడ. ఒక్కరిచే కూర్పబడక, నియమిత స్వరూపం లేక, రచనాకాలం తెలియక, ఒక ప్రాంతానికని నిర్ధారణకాక, కాలానుగుణ్యంగా పరిస్థితులను అభిరుచులనుబట్టి ప్రతిముఖ యంత్రంలోనూ వికారం పొంది, పెనుమార్పులతో తొలినాటి ఆకారమే మిగలక, మన దాకా సాగివచ్చిన యీ సాహితీ విభాగాన్ని గుర్తించి, గౌరవింపగలమేమోగాని ఒక చారిత్రకాధారంగా మాత్రం పరిగణించలేం. చరిత్రకు ప్రాథమికంగా కావలసిన కాల్ల, ప్రాంతాల నిర్ధారణ వీటికి లేకపోవటం దీనికి కారణం. కాని అర్వాచీన కాలంలో ప్రకటింపబడి జానపదుల వీరగాథలుగా ప్రసిద్ధికెక్కిన పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథలు, మొదలైనవి చారిత్రకాధారాలుగా పరిగణింపబడి చరిత్ర పుటల్లో చోటు చేసుకొంటున్నాయి. విభిన్న కథనాలు, సందిగ్ధత, అర్వాచీన అనిశ్చిత కథాంశాలు, ఎంత ఆసక్తిదాయకమైనవైనప్పటికీ చరిత్ర రచనలో అవశ్యం పరిహరింప యోగ్యాలు.

కాటమరాజు కథల చారిత్రకతను పునఃపరిశీలించటం ప్రస్తుతాంశం. పండిత, పామరులందరికీ విదితమైన యీ జానపద వీర గాథల్లో ఏమేరకు చరిత్ర వుందనే సంశయం యీనాటిది కాదు. దశాబ్దాల క్రితంనుండి ప్రముఖ విద్వాంసులు, చరిత్రకారులు పరిశ్రమించి యీ విషయమై విపులమైన పరిశోధనలు, చర్చలు చాలా చేశారు. అవన్నీ సాహిత్య, చరిత్ర పరిశీలకు తెలిగినవే. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల మొదలు, నేటివరకు యీ విషయంలో జరిగిన, జరుగుతున్న చర్చలు వ్యాస విస్తరభీతిచే పేర్కొనటంలేదు. జిజ్ఞాసువులైన పరిశోధకులు ఆయా తావుల సాగిన చర్చలు పరిశీలింప ప్రార్థన. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు 1976, 1978లలో, "కాటమరాజు కథలు" పేరిట వెలువరించిన గ్రంథపు రెండు భాగాలలో ఆ అంశాలు చాలవరకు ప్రస్తావనలకొచ్చాయి. వీటన్నింటినీ సేకరించి ప్రకటించిన

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు, డా॥ చెన్నాప్రెగ్గడ తిరుపతి రావుగార్ల కృషి ఎంతైనా ప్రశంసనీయమే!

యాదవ వీరుడైన కాటమరాజునకు, నెల్లూరు నల్లసిద్ధితో పుల్లరి కారణంగా ఏర్పడిందని చెపుతున్న యుద్ధం, యీ గాథలలోని అసలు కథ. కాలం గడిచినకొద్దీ బయటపడ్డ అనేకానేక గాథల్లో కాటమరాజు పూర్వీకుల వివరాలు, వారి వారి వీరకృత్యాలు మనంగా అభివర్ణించబడ్డాయి. దొరికినంతలో యిప్పటికి యీ గాథలసంఖ్య ముప్పైరెండుకి పెరిగింది. మల్లయ్య, ఘట్టయ్య, ఎల్లయ్య, చెన్నయ్య మొదలైనవాళ్ళు కొన్ని గాథల రచయితలుగా తెలుస్తున్నారు. వీరి కాలంగాని యితర వివరాలుగాని తెలీవు. కాని వీరిలో హెచ్చుమంది పద్దెనిమిది, పందొమ్మిదో శతాబ్దుల తర్వాతివారుగానే భావింపబడుతున్నారు. తెలుగునాటి యాదవులకు పురాణంలాంటిదని వర్ణింపబడే యీ వీరగాథలు చాలవరకు యాదవ సంఘాలనుండే లభ్యం కావటం, వాటిలో కొన్నింటి రచయితలు యాదవులే కావటం కూడ యీ సందర్భంలో ప్రత్యేకించి గమనించాలి తమ కులప్రశస్తిని ఉగ్గడించే ఉత్సాహంలో కల్పనలు, అతిశయోక్తులు మెండుగా పుట్టుకొచ్చే అవకాశం ఇందులో వుంది. కథాకాలమని చెప్పబడుతున్న నాటినుండి ఆరువందల సంవత్సరముల పైబడి గ్రంథస్థంకాక జనుల రసనల పై వచ్చిన గాథల కేవిధమైన మార్పు లేకుండా వుండటం అసంభవం. నల్లసిద్ధిరాజు సైన్యంలో "తుపాకి ఎలుమూక, తొమ్మిది లక్ష" లున్నట్లు వర్ణించబడటం; పదిహేడో శతాబ్ది ద్వితీయార్థంలో వచ్చి, పోర్చుగీసువారి కలహాలమధ్య దామెర్ల అయ్యరాజు తన తండ్రి చెన్నరాజు పేరిట నిర్మించిన 'చెన్నపట్టణ'పు రాజొకడు కూడ యుద్ధంలో పాల్గొన్నట్లు చెప్పబడటం, లాంటివి మధ్యమధ్య వచ్చిన మార్పుచేర్పుల కుదాహరణలు.[2] ఇలాంటి మార్పు చేర్పుల పరిమితి యీమేర వరకే వుంటుందని గుర్తించగలగటం కూడ సాధ్యంకాని పని. నిరంతర మార్పులకు గురయ్యే యిలాంటి ఏ కథనం చారిత్రకాధారంగా పరిగణనకు పనికిరాదు. సమకాలీన చారిత్రకాధారాల్లో కాటమరాజు ప్రస్తావన లేదు; ఉందని అంటున్న యీ వీరగాథాతరంగాల పుట్టుక, ప్రవాహం, యావత్తూ సందేహ సాగర క్షుభితం. అప్రామాణికం.

ఎన్నో కులపురాణాలకు మధ్యాంధ్రయుగం పుట్టిల్లు. చరిత్ర నడకల్లో ఏవేవో కారణాలవల్ల వెనుకపడ్డామనుకొన్న ప్రతి కులం, వర్గం, తమ తమ ఆత్మోన్నతిని ప్రదర్శించుకొందికి, తద్వారా ప్రభావితం చెందటానికి ఎన్నో కులపురాణాల్ని యీ శతాబ్దాల్లో పుట్టించుకున్నాయి. ఒళ్ళు గగుర్పొడిచేలా తమ గతాన్ని వర్ణించుకొని, తమ వంశీయుల పూర్వవైభవాన్ని అత్యున్నతంగా చిత్రించుకొని, ఉత్తేజాన్ని పొందారు. కోమటి, కంసాలి, సాలె, తెలుకలి, గొల్ల మొదలైన కులాలు, కులవిభాగాలు యీ విధమైన సామాజికోన్నతిని అభిలషించి యత్నించినవే. భూసురులమని విర్రవీగిన బ్రాహ్మణులే తాము ఋషులనుండి జన్మించినట్లు చెప్పుకొంటే. పై కులాల్లోని కొందరు నేరుగా అంతకన్న అధికమైన దైవంనుండే తమ ఆవిర్భావాన్ని వర్ణించుకొన్నారు. పెనుగొండ పురవరాధీశులమనీ, పెందోట పురవరాధీశులమనీ, అయ్యవోలు పురవరాధీశులమనీ చెప్పుకొంటూ, తమ తమ పూర్వీకులు గొప్ప గొప్ప రాజ్యాధినేతలుగా ఎలా వెలుగొందేరో చాటుకొన్నారు. ఈ ప్రయత్నాలన్నీ సామాజికోన్నతిని బడయటం కోసం వేర్వేరు కులాలు మధ్యయుగాల్లో పడిన పాట్లని స్పష్టంగా తెలుస్తుంది.[3] 'యాదవ పురాణం'గా చెప్పబడే కాటమరాజు కథల్లో యీ తీరే కన్పిస్తుంది. కాటమరాజు సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారమని యాదవుల విశ్వాసం!

కవిసార్వభౌముడైన శ్రీనాథుని ప్రస్తావన ఈ సందర్భంలో వస్తుంది. మనకు తెలిసినరీతిలో కాక, 'కులపురాణాల' రచయితగా క్రొత్తరూపంలో యీయన్ని సాక్షాత్కరింపజేసారు. అర్వాచీనమైన కొన్ని యీ కులపురాణాల కథనాలకి ప్రాచుర్యాన్ని, ప్రామాణికతని తెచ్చిపెట్టటానికి యిది చాల అవసరమైంది.[4] పదకవితని న్యూనత పంచి రకరకాలుగా తిట్టిన మహాకవిని పట్టుకొని వీటిలో కొన్నింటి కర్తృత్వాన్ని ఆయనకే అంటగట్టారు. కాటమరాజు కథలు, పల్నాటి వీరచరిత్ర, విశ్వకర్మ పురాణం, యిలా ఎన్నింటినో ఆయనపేర చెలామణీ చేస్తున్నారు. ఆయన పేరు చెప్పి ప్రామాణిక మనేస్తున్నారు. సాక్ష్యం కావలిస్తే, యాదవు లాశచూపిన తూమెడు వరహాల కోసం శ్రీనాథుడీ గ్రంథం వ్రాసాడన్న పామర జనరంజకమైన కథల్నో[5]; 'శ్రీనాథ వచన పద్ధతిని' చెప్పేనన్న ఏ ఎల్లయ్య మాటల్నో,[6] పేర్కొంటారు! ఇంకా మన సందేహం తీరకపోతే, సాక్షాత్తూ శ్రీనివాసుడే కలలో కనబడి గుత్తుంకొండ భక్తవత్సల కవికి యీ విషయం సెలవిచ్చాడంటారు.[7] ఇతి, భగవద్వాక్యం అనేస్తే, కాదనగలమా:

కాటమరాజు కథల చారిత్రకతను యోచించే సందర్భంలో ఇది శ్రీనాథకృతమా, కాదా అనే సందిగ్ధం అప్రస్తుతం. కవిసార్వభౌముడైన శ్రీనాథుడు మాత్రం దీనిని వ్రాసినట్లు ఆధారం లేదు. ఆయన వ్రాసి ఉండకపోడని ఒకవేళ ఎవరైనా ఊహించినప్పటికీ, ఆ కృతి నేడలభ్యం అని అంగీకరించి తీరాలి. ప్రస్తుతం మనదాకా వచ్చిన ఏ కథనం ఆ శ్రీనాథ కవి కృతం కాదు. చాలా అర్వాచీనకాలపు కవులో, కాలనిర్ణయం తెలియరాని కవులో వ్రాసిన గాథలే ప్రస్తుతం లభ్యం, వీటన్నింటినీ చారిత్రకాధారాలుగా గుర్తించగలిగే అవకాశం లేదు. ఎప్పుడో పదమూడో శతాబ్దంలో జరిగిందనుకొనే యీ ఉదంతం పూర్తి వివరాలు యథాతథా వీటిల్లో రూపుకట్టవు. సాంఘిక, సామాజిక పరిస్థితుల్ని మదింపు చేసుకొనే వివరాలేవీ వాస్తవంగా వీటిలో ద్యోతకం కావు. కనుకనే కాటమరాజు కథలనబడే యీ జానపద వీర గాథలు చరిత్ర జిజ్ఞాసువుల కేమాత్రం ఉపయుక్తం కావు. యాదవుల



యలమంచిలి కొండపై పాపనూక మేడ శిథిలమని భ్రమింపబడుతున్న శిథిలాలయ ద్వార తోరణము.

కులప్రశస్తిని ఘనంగా వర్ణించిన యాదవరాజైన ఎల్లణదేవుని (రుద్రమదేవి అల్లుడు) క్రీ॥శ॥ 1264 నాటి ఆలపాడు తామ్ర పట్టికలలో[8] యీ గాథాంశాల చాయలే లేకపోవటం గమనించాలి. సరిగ్గా అవే దశాబ్దాల్లో యివ్వబడిన ఆంధ్ర యాదవుల్ని గూర్చిన ప్రశస్తి అది!

'కాటమరాజు' జానపదుల హృదయాల నుజ్జ్వూత లూగించే దైవాంశ సంభూతుడైన అద్భుతయోధుడు. వందలాది సంవత్సరాలుగా ఆ ప్రాచుర్యం అలానే వుంది. తరువాత దశల్లో ఈతడు యాదవుల ఆరాధ్య వీరుడుగా పరివర్తనం చెందినప్పటికీ, తొలిదశలో ఆయుధోపజీవులైన వేటగాళ్ళు ఆరాధించే ప్రాచీనదైవమైన 'క్రాటేడు' కావచ్చునని ఓ వాదం ఉంది.[9] కాటమరాజు పేర్లలో క్రాటేడు కూడ ఒకటి కావటం దీనికి బలం కూరుస్తుంది. క్రాటేడు అనేది ప్రాచీన ద్రావిడ దైవం. ఆటవిక జాతుల ముఖ్యదైవం. 'మనుచరిత్ర'లోని వేట వర్ణననిబట్టి ఆటవికుల్లో క్రాటేని స్థానం తెలుస్తుంది[10]. అయితే కాలక్రమేణా యీ స్థానం కొంత విపులమై, కొంత క్రమ పరిణామం చెందినట్లుంది. కోనేటి దీక్షితచంద్రుని ''విజయరాఘవ కళ్యాణం''లో క్రాటేడు, కాటమరాజులకు అభేదం పాటించబడింది.[11] వేటగాళ్ళు, క్రాటేడుసామి లీలల్లో కాటమరాజు పదాలు కూడ పాడతారు. వర్షాభావమేర్పడ్డప్పుడు యీ కథలు పాడిస్తే వర్షాలు కురుస్తాయట![12] అలాగే, సంతానప్రాప్తికోసం కాటమరాజు కథలు చెప్పించే ఆచారం ఉండేదని 'హంసవిశతి'లో నారాయణామాత్యుడు పేర్కొంటాడు.[13] ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో పశుక్షేమం కోసం కాటమరాజుకు పొంగళ్ళు నివేదన చేస్తారట.[14] ఇవన్నీ కాటమరాజును ఒక మానవాతీత శక్తిగా పరిగణించి ఆరాధించినట్లు తెల్పుతాయి. కాటమరాజు వీర గాథల్లో కూడ యీ దైవీయశక్తికి స్థానముంది, 'అవులమేపుగాథ'లో యాదవ వినాశం సంభవింపజెయ్యటానికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు బలిజ వేషంలో వచ్చి కాటమరాజును శ్రీశైలప్రాంతాలనుంచి నెల్లూరు సీమకు మరలించేరనటం, 'ఎఱ్ఱయ్య తరకవాదం' గాథలో గంగ యాదవుల్ని "సరివీరకల్లుగా సంపితు నేను" అని ప్రతిన బూనిందనటం, 'భక్తిరన్నగాథ'లో భక్తిరన్న మేఘరథం సంపాదించి ఎగురుతుండటం, ఇతరాలైన పల్లికొండ పుట్టుకలాంటి అసంఖ్యాకమైన చిత్రవిచిత్రాలు కాటమరాజు కథలకి పౌరాణిక ప్రశస్తిని కల్గించి, పామరజన రంజకం కావించటానికి బహుదా తోడ్పడ్డాయి.

ఇంతవరకు యీ అంశంలో పరిశోధనలు చేసినవారందరూ యీ గాథల్లో నల్లసిద్ధి - కాటమరాజులకు పుల్లరి కారణంగా ఒనగూడిందన్న యుద్ధానికే ప్రాముఖ్యతనిచ్చి దాని వివరాలరయటానికే తీవ్రకృషి చేసారు. కాని యుద్ధకాలంగాని, యితర వివరాలుగాని సమర్థవంతంగా నిరూపించి పరిష్కరించటానికి ఆధారాలు లేవని నిర్ధారితమైంది. అర్వాచీనాలు, 'తప్పులతడిక'లు అయిన శాసనాలు ప్రామాణిక విషయాల నందీయలేవు.[15] కనుకనే సోమశేఖర శర్మగారు దీని చారిత్రకతను సందేహించటం జరిగింది.[16] కాని ఆయన నిష్పాక్షిక పరిశోధనా ధోరణి కొందరికి హితమైనట్లు లేదు. అందువల్లనే ఆంధ్ర దేశంలోని చిన్ని రాజవంశాల చరిత్ర పరిశోధన అసలు జరుగలేదనీ, అలాంటి సూక్ష్మచారిత్రకాంశాల పరిశోధన జరిగేవరకు "కాటమరాజు కథల చారిత్రక ప్రామాణ్యాన్ని శంకించటానికి ఏ చరిత్రకారునకు అధికారము లేదు!"[17] అంటూ ఉత్సాహంలో కొద్దిగా తొందరపడటం జరిగింది. మన జానపద సాహిత్యంమీద వల్లమాలినంత అభిమానం ఉండటం హర్షదాయక విషయమే అయినప్పటికీ పనిగట్టుకుని దానిని చరిత్రకు మిళితం చేయవలసిన అవసరం ఎవరికీ లేదు. వీరగాథాచక్రాలే కావు సిద్ధేశ్వర చరిత్ర, రాయవాచకంలాంటి గ్రంథాల్లోని అంశాలే చాల సందర్భాల్లో చరిత్ర నిరూపణకి నిలవటం లేదు, అవి ఎక్కడ, ఎందుకు నిలవటంలేదో ఆయా అంశాలు తడివినవారికే తెలుస్తుంది. ప్రామాణికాధారాలు లభించేవరకు ప్రతీ కథనాన్ని చరిత్రగా చెప్పబూనటం విజ్ఞుల పద్ధతి కాదు.

మన పరిశోధక పండితుల కృషి ఫలితంగా, కాటమరాజు కథలపై యిప్పటివరకు ముప్పైరెండింటికి పైగా గాథలు వెలుగు చూసాయి.[18] వీటిలో వేర్వేరుచోట్ల కాటమరాజు తాత అయిన అవుల వలురాజునుండి, కాటమరాజు ఎఱ్ఱగడ్డపాటి పొట్లాటవరకు వివరంగా

కథనం వుంది. ఈ వ్యాసభాగంలో కాటమరాజు కథలలోని అతని పూర్వీకుల చరిత్ర వివరాల్ని సూక్ష్మంగా పరిశీలిద్దాం.

వీరి గాథల్లో కొన్నింట కాటమరాజు పూర్వీకుల వివరా లున్నాయి. తొలినుండీ వీరు ఎలమంచి ప్రభువులు కవులావుల గంగరాజు జ్యేష్టపుత్రుడైన ఆవుల వలురాజు పాలనతో యీ వీరగాథా కథనం ప్రారంభమౌతుంది. హరిపాల, నందగోపాల, గోవర్ధనులనే సోదరుల సహాయంతో యితడు ఎలమంచి పట్టణం ఏలుతుంటాడు. అదేకాలంలో వారి ఎలమంచి నగరాని కుత్తరంగా ఉన్న 'ఖండ మొండముల కోట'ను కలభూత గంగురాజు పాలిస్తాడు. ఈతని కొలువులో ధన మపహరించిన ఐదుగురు కరణాలకు, వారు శరణు కోరిన కారణంగా, ఎలమంచిలో ఆవులవలురాజు రక్షణ కల్పించిన కారణంగా, వీరిమధ్య యుద్ధమేర్పడింది. ఈ యుద్ధంలో కలభూత గంగురాజును సంహరించి, వలురాజు కూడ 'శ్రీవీరకల్లు'గా వెల్లి పోయాడు. ఈతనికి సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు అనే ఐదుగురు పుత్రులు, కొమరక్క అనే పుత్రిక ఉన్నారు.

జ్యోతిషుల హెచ్చరిక మేరకు వలురాజు అనంతరం జ్యేష్టుడైన సింహాద్రిరాజు కాక, ద్వితీయుడైన పెద్దిరాజు సింహాసన మెక్కుతాడు. వేర్వేరు గాథల్లో యీ అంశం వేరుగా చెప్పబడింది. 'పంపాద్రికథ'లో సింహాద్రిరాజే సింహాసన మధిష్టించినట్లుంది. ఈతని కాలంలోనే శ్రీకూర్మంలోని శ్రీవైష్ణవులు సింధుభళ్ళాని రాజుచే యిడుమలకుందింపబడి ఈతనిని శరణువేడ రాగా, సింహాద్రిరాజు శ్రీకూర్మముపై ఎత్తిపోయి సింధుభళ్ళానితో పోరాడి అతనిని చంపి, తాను వీరస్వర్గ మలంకరించెను.

ఆవుల వలురాజు ద్వితీయ పుత్రుడైన పెద్దిరాజు ఎలమంచి సింహాసన మధిష్టించి పదకొండు సంవత్సరాలు పాలిస్తాడు. కాని చివరకు ఎంచేతనో తమ తండ్రులు గతించిన ఎలమంచిలో ఉండటానికి యిష్టపడక, "ఏడికి యలమంచి? ఏమి నిత్య"మని పంపాద్రికి తరలి పోయారు. అక్కడ ఈతని పాలన ఏడేళ్ళు సాగింది. సంతానం కోసం పరితపిస్తున్న పెద్దిరాజు భార్య పెద్దమ్మకు కల్యాణ సోమేశ్వరుడు కలలో కనిపించి, తన నగరానికి వస్తే సంతానం కలుగుతుందని చెబుతాడు. పెద్దిరాజు భార్యను తీసుకొని ఓరుగల్లు, రేపల్లె, భద్రాచలం రాజులందరి సన్మానం పొందుతూ కల్యాణపట్టణం చేరుకుంటాడు. అక్కడే కాటకోటేశ్వరుని వరం వలన 'కాటమరాజు' పుడతాడు. తర్వాత 'పాపసంహారి' అనే నోము ఫలంగా 'పాపనూక' అనే పుత్రిక కూడ కలుగుతుంది. ఈమె ఎందరికో గండం కల్గించే దుష్టనక్షత్రంలో జన్మించిందట. ఈమె పుట్టిన ఏడోనాడే పెద్దిరాజు ఎవరి పగో తీర్చటంకోసం యుద్ధానికి పోయి మరణిస్తాడు. తరువాత ఈతని తమ్ముని పుత్రుడైన భక్తిరన్న వచ్చి కాటమరాజును, పాపనూకను చూచి గుర్తించి తిరిగి ఎలమంచి చేరుస్తాడు. అప్పటికే ఎలమంచి రాజ్యాన్ని కాటమరాజు పినతల్లి పుత్రులైన 'చల్ల'వారి నుండి, పినతండ్రి పోలురాజు పుత్రులకోసం పల్లికొండ స్వాధీన పరుస్తాడు.

కాటమరాజు పూర్వీకుల వృత్తాంతం యావత్తూ ఈవిధంగానే కొనసాగుతుంది. అతని పినతండ్రులందరూ వారి అన్న అయిన పెద్దిరాజు పద్ధతిలోనే వివిధ స్థలాల్లో, పరోపకారార్థం యుద్ధాలుచేసి మరణిస్తారు. పెద్దవాడైన సింహాద్రిరాజు శ్రీకూర్మ యుద్ధంలో వీరస్వర్గమలంకరిస్తే, ఎరనూకరాజు ఏనుగనాథుని కొండదగ్గర ఎఱ్ఱ భూపతితో చేసిన యుద్ధంలో చనిపోయాడు. నలనూకరాజు ఎందుకో బెజవాడపోయి అక్కడి రాజైన 'నున్నభూపతి'తో పోరాడి మరణిస్తాడు. ఆఖరివాడు, భక్తిరన్న తండ్రి ఐన పోలురాజు చెరకూరు దగ్గర జంగాలను రక్షించే యత్నంలో, శ్రీరంగపట్టణమేలే రాజు సైన్యంలోని ముక్కంటితో యుద్ధంచేసి ప్రాణాలర్పిస్తాడు.

వేర్వేరు గాథల్లో ఎలాంటి అస్తవ్యస్త కథనాలు చోటుచేసు కొన్నప్పటికీ, తమపూర్వీకుల స్వస్థానంగా వీరు ఎలమంచిని చెప్పుకోవటం చాలా గాథల్లో వుంది. "ఏడు తరముల కాణాచి ఎలమంచి పట్నము"! ఆవుల వలురాజు కాలంలో, పెద్దిరాజుకాలంలో, కాటమరాజు పినతల్లి పుత్రులైన చల్లవారి కాలంలో, పోలురాజు పుత్రులైన అయితమరాజాది బాలరాజుల కాలంలో, సింహాద్రిరాజు పుత్రుల కాలంలో ఎలమంచి సింహాసనం వీరి ఆధిపత్యంలోవున్నట్లు చెప్పబడింది. ఈగాథల్లోనే ఒక సందర్భంలో "మరియునదిగాక యలమంచి పట్నంబు, అనయంగ మీదోట అందరెరుగుదురు" అనిపల్లికొండ అంటాడు. వీరిగాథలు కొన్నింటిలో ఎలమంచిని గూర్చి వచ్చిన ప్రస్తావనం కుదాహరణలు చూడండి :

(వేర్వేరు వాక్యాలు)

పన్నుగ యలమంచి పాలింపు మనుచు,
యలమంచి మొగసాల యదుపల వరుడు,
యలమంచి పట్టణం బేలు చున్నాడు,
కరణాలు ఎలమంచి కడజేరిరనుచు,
పాయక యలమంచి పట్టణం జేరి,
యెలమంచి పురిబైట వేయిగుర్రములు,
ఎలమంచి కోటపై నెక్కింతులగ్గ,
యలమంచిలో నున్న యాదవరాజు,
యలమంచి పరగణ మంతయుచుట్టి,
ఎలమంచి పురిచేర నేతెంచిరంత,
యలమంచి నాకేల? వెలదియునేల,
యెలమంచి సభయంత ఏకరంతులుగ,
ఎలమంచి పురిబైట ఎత్తెదేరాలు,
నతనికి యలమంచి అధికారమిచ్చి,
ఎలమంచి పురమందు వెలయుచునుండు;
అర్పించు యలమంచి అతనిపేరిటను,
వేడ్కతో యలమంచి నేలుమని సిన్ను,

ఆవులవలు రాజు కథ లోనివి

| | |
|---|---|
| యెలమంచి నీ సుతుల నేలించవమ్మ,<br>ఎలమంచి పట్నము కేగుచున్నారు,<br>యెలమంచి పట్టణము కేగుచున్నాము,<br>యింపైన యెలమంచి నేలు పిన్నయకు,<br>మన మెలమంచి నెమ్మది నేలుచుండ,<br>ఘనమైన యలమంచి కందకముకోట,<br>యాదవ సింహులు యలమంచి బయలు,<br>పరికించి యలమంచి పట్టణము గట్టి, | బల్లికురవ పోట్లాట కథ లోనివి |
| పరగంగ యలమంచి పట్టణము జూచి,<br>యాదవ బలముతో యలమంచి పట్నమున,<br>యలమంచి ఏలేటి యాదవులము మేము,<br>(ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలుగా ఉన్నాయి.) | కరియావుల రాజు కథ లోనివి |

——కనుక రూఢిగా వీరివంశ చరిత్ర ఎలమంచి నగరంతో ముడిపడి వున్నట్లు భావించాలి.

ఈ సందర్భంలో యీ కధాకాలంనాటి ఎలమంచిలి చరిత్ర కొద్దిగా పరిశీలించటం చాల అవసరం. కాటమరాజు కాలాన్ని నిర్ధారించటంలోవున్న వివాదాల్ని ప్రక్కనపెట్టి, యీ వీరగాథలపై పరిశోధనలు చేసిన వారి అభిప్రాయాన్నే ప్రామాణికంగా తీసుకొన్నట్లయితే 'యెఱ్ఱగడ్డపాటిపోట్లాట' క్రీ॥శ॥ 1282 నాటిదిగా పరిగణించాలి. అందువల్ల కాటమరాజు రూఢిగా క్రీ॥శ॥ 1282 నాటివాడు కావాలి. ఈతనికి, ఈతని పినతల్లి కుమారులకు, తండ్రికి, పినతండ్రులకు, రాతకు ఎలమంచి ఆధిపత్యం వున్నట్లు యీ వీరగాథా వాఙ్మయం పేర్కొంటోంది, కనుక సుమారుగా క్రీ॥శ॥ 1200 నుండి ఎలమంచి సీమలో వీరిపాలన సాగివుండాలి. కాని చరిత్ర అందుకు అంగీకరించేస్థితిలో లేదు.

ఆ కాలంలో ఎలమంచిలి ప్రాంతమంతా ఒక మాండలిక చాళుక్య వంశం ఆధిపత్యంలో వుండి. అప్పుడుక్షే మొదలై పద్నాలుగు



కొండమైనున్న శిథిలాలయ చిహ్నాలు

తరాలపాటు, నాలుగువందలేళ్ళు ఆ వంశీయులపాలన ఆప్రాంతంలో అవిచ్ఛిన్నంగా సాగింది. ఆశతాబ్దంలో విజయాదిత్య (క్రీ॥శ॥ 1205-28), మొదటి మల్లప (క్రీ॥శ॥ 1228-53), మొదటి ఉపేంద్ర దేవ (క్రీ॥శ॥ 1253-66), రెండవ మల్లప (క్రీ॥శ॥ 1266-83), రెండవ ఉపేంద్ర (క్రీ॥శ॥ 1283-1316) లు ఎలమంచిలి ప్రాంతపు పాలకులు.[19] వీరి వంశపు పూర్తివివరాలు స్పష్టంగా సింహాచల,[20] పంచదారల శాసనాల్లోనూ,[21] విన్నకోట పెద్దయ 'కావ్యాలంకార చూడామణి'[22]లోనూ ఉన్నాయి. ఇవన్నీ నిర్ధారితాలైన చారిత్రక వాస్తవాలు. వీరెవ్వరూ కాటమరాజు పూర్వీకులుగాని, పూర్వీకులతో సంబంధమున్నవారుగానికాదు. వీళ్ళల్లో ఓ పదితరాల తరువాతవాడైన పదిహేనో శతాబ్దికి చెందిన నరసింహదేవుడొకడు 'వీరాంబిక' అనే యాదవస్త్రీని, ఉంపుడుకత్తెగా ఉంచుకొన్నాడు[23] తప్ప, వీరెవరికీ యితరత్రా యాదవులెవరితో ఎలాంటి సంబంధాలులేవు. అంతే కుకుండా గాథలు పేర్కొంటున్నట్లు ఎలమంచిలికి ఉత్తరాన కాదుకదా, ఏదిశలోనూ 'ఖండమొండెములకోట' అనేది అప్పుడు ఇప్పుడు ఎప్పుడూలేదు. కనుక కాటమరాజు వీరగాథల్లో పేర్కొబడ్డ విషయాలేవీ నిర్ధారిత చారిత్రకాంశాలతో సరిపడటంలేదు.

ఇలా సరిపడటం లేదుకనుక ప్రస్తుత విశాఖపట్నం జిల్లాలోని యీ యలమంచిలివేరు, వీరగాథలలో పేర్కొనబడ్డ ఎలమంగిలివేరు, అగునేమోనని సందేహించి సంతృప్తిపడటానికి కూడ వీలుకాదు. 'కాటమరాజుకు పట్నం కట్టినకథ'లో పల్లికొండ బాలరాజాదుల్ని తీసుకొని ఎలమంచిలి వస్తూ, దానికి దాపునేవున్న 'సర్వసిద్ధి'లో విడిదిచేసి, ఎలమంచిలిలోనున్న చల్లపిన్నమనాయనికి తమరాక గురించి ముందుగా కబురుచేస్తారు. "చేరి యిప్పుడు సర్వసిద్ధిలో నిలిచి, ఎలిమి తమరాక మీకెరిగించుమనుచు తెలియజేస్తారు. ఈ సర్వసిద్ధి అనేది విశాఖజిల్లాలోని ఎలమంచిలికి పదికిలోమీటర్ల దూరంలోనున్న గ్రామం. క్రీ॥శ॥ ఏడో శతాబ్దిలో తొలివేంగీ చాళుక్యరాజైన విష్ణువర్ధనుడి పేరిట, అతనిపుత్రుడైన జయసింహునిచే నిర్మించబడినట్లు భావింపబడుతున్న పురాతన బిరుదాంకిత దుర్గం.[24] కనుక కాటమరాజు వీరగాథలలోని 'ఎలమంచి' మరొకటేమో అనుకొనే అవకాశం కూడలేదు. అంచేత పై గాథలలోని విషయాలేవీ చారిత్రకాంశాలు కావని గుర్తించాలి.

వేడుక బొంగరాలకథలోను, అగు మంచికథలోను, భక్తిరన్న కథలోను కాటమరాజు పెదతండ్రి సింహాద్రిరాజు విషయం ప్రస్తావించబడింది. శ్రీకూర్మపట్టణాన్ని పాలించే సింధుభళ్ళాని రాజు అక్కడి శ్రీవైష్ణవులపై దొంగతనాలు మోపి బాధిస్తుంటే, వారిప్రార్థనమేరకు సింహాద్రిరాజు శ్రీకూర్మముపై దండెత్తిపోయి సింధుభళ్ళాని సంహరించి, తానుకూడ ఆ యుద్ధములో మరణిస్తాడు. సంస్కృతాంధ్ర ఓఢ్ర భాషల్లో లభ్యమౌతున్న శ్రీకూర్మ ఆలయంలోని సుమారు రెండువందల ఎనిమిది శాసనాల్లో దీనిని రూఢిపరిచే విషయంలేదు.[25]

వీరగాథా పరిశీలకుల కాలనిర్ణయాన్నిబట్టి కాటమరాజు క్రీ॥శ॥ 1282 ప్రాంతంవాడే అనుకుంటే,[26] కాటమరాజు పెద్దిరాజుకు అరవయ్యో ఏట జన్మించాడు కనుక, సింహాద్రిరాజు సుమారు క్రీ॥ శ॥ 1200 ప్రాంతంవాడు కావాలి. ఈతనిచే ఘోరయుద్ధంలో కూల్చబడ్డ శ్రీకూర్మ పట్టణాధిపతియైన సింధుభళ్ళానిరాజుకూడ యీ కాలానికి ముందువెనుకలవాడై వుండాలి. కాని చరిత్ర 'ననుసరించి ' చూస్తే శ్రీకూర్మ ప్రాంతాలు యీసమయంలో తూర్పుగంగరాజులైన మూడవరాజరాజ (క్రీ॥శ॥ 1198-1211), మూడవ అనియంక భీముల (క్రీ॥శ॥ 1211-1238) ఏలుబడిలో వున్నాయి.[27] అంతేకాదు, సింధుభళాని రాజనేవాడెవడూ ఆ కాలంలోనేకాదు సరికదా, ఏకాలంలోనూ శ్రీకూర్మప్రాంతాల్ని పాలించలేదు. అతని ఉదంతమే చరిత్రకు తెలియదు. [అయితే శ్రీకూర్మక్షేత్రంపై వరుసగా కొన్నిసార్లు తురకల, మరాఠీల దాడులు జరిగాయి. వాటిలో ప్రముఖమైంది మహమ్మద్ కూలీ కుతుబ్‌షా కాలంలో అంటే క్రీ॥ శ॥ 1599లో అమీనుముల్క్ జరిపినదాడి. అతడే "కళింగసీమలో కూర్మానకువచ్చి కూర్మనాథుడనెడి దేవరగుడి ఉండంగా ఆగుడి కొట్టించి మసీదు కట్టించెను." తిరిగి కొన్ని సంవత్సరాల తర్వాత పద్మనాయక అశ్వరాయడు ఆలయాన్ని పునరుద్ధరించేదాకా, ఆలయస్థితిగతులు దానిని ఆశ్రయించుకొన్న శ్రీవైష్ణవుల పరిస్థితి అర్థార్ణంగానే వుండి వుండటానికి అవకాశం వుంది. ఈ సమయంలో ఓ ఘర్షణలో సింహాద్రి రాజెవడైనా పైఘనకార్యం నిర్వహించే దనుకున్నా అది రూఢిగా పదిహేడో శతాబ్ది తొలిదశకంలోదే కావల్సివస్తుంది.]

వీరగాథలలోని ఇలాంటి అంశాలన్నీ సోమశేఖరశర్మ గారు పేర్కొన్నట్లు "పుక్కిటి పురాణా"లై పామర జనరంజకాలు కావచ్చుగాని, ప్రామాణిక చరిత్రపట్ల ఆసక్తికలవారి కుపయోగపడే విషయాలు కావని రూఢిగా స్పష్టమౌతోంది. అర్వాచీన విషయాలను ప్రాచీన విషయాలుగా చెప్పటం, కాలక్రమాలు మార్చటం మొదలైనవి జానపద వీరగాథల నిర్మాణంలో సర్వసామాన్యం. ఇవి యదార్థ సంఘటనలు కనుకనే వీటి చారిత్రక అవశేషాలు దేశంలో అక్కడక్కడ కానవస్తున్నాయను కోవటం కూడ పొరపాటే. ఉదాహరణకి నేటికీ రాజమండ్రిలోని స్థానికులు రత్నాంగి మేడను, చిత్రాంగి మేడను, సారంగధరుని మెట్టను చూపెడతారు. అందువలన జనశ్రుతిలో బలంగానున్న 'సారంగధరుని కథ'ను చారిత్రక సత్యంగా భావించటం పొరపాటు.

రవంత వాస్తవిక విషయం మీద కొండంత ఊహ సాధ్యం కావటానికి ఆస్కారం వుంది. ఇలాంటి ఊహలకు నిర్ధారిత చరిత్రల్లోను, ప్రామాణిక చరిత్రల్లోనూ స్థానంలేదు తెలిసిన చరిత్రను నిర్ధారించటానికి జనశ్రుతి ఉపయోగపడుతుంది తప్ప, జనశ్రుతికి వస్తుతః చారిత్రక గౌరవం లభించదు. అయితే అది సూచిస్తుంది. ఆసూచన



యలమంచిలి కొండపై నుండెడి శివాలయము నుండి దొర్లి పడిన శిలాశాసనము

లేమేరకు పరిగణించాల్సి వుందో అన్నది పరిశీలకులు తేల్చుకోవాలి. ఇలాంటి జనశ్రుతుల్ని ఆధారంగా చేసుకొనే విశాఖపట్నం జిల్లా గెజిటీరులోను, జిల్లామాన్యువల్ లోనుకూడ, కాటమరాజు సోదరి పాపనూక (నూకిపాప)ను ఎలమంచిలిలో వుంచినమేడ విషయం పేర్కొన్నారు. చూడండి :

ఎల్లమంచిలి : క్లోస్ టు దిస్ విలేజ్ ఈస్ ఎ రాక్ విత్ ఎ టెంపుల్ ఆన్ ది టాప్ ఆఫ్ ఇట్. ఇట్ ఈస్ ది టెంపుల్ ఆఫ్ వీరభద్రస్వామి, ఎ ఫార్మ్ ఆఫ్ శివ. ఎల్లమంచిలి వాస్ ది సీట్ ఆఫ్ సర్టన్ షేప్‌హెర్డ్ కింగ్స్ హూ వర్ ఆఫ్ సమ్ నోట్ దే బిల్డ్ ది అబౌవ్ పగోడా నోట్. అండ్ సమ్ ఆదర్స్ ఆఫ్ విచ్ ది రిమైన్స్ ఆర్ విసిబుల్ విత్ దోస్ ఆఫ్ ఎబిల్డింగ్ కాల్డ్ "నూక పాప మేడ."

ఈ విషయమే జిల్లా మాన్యువల్‌లో కూడ విపులీకరించబడింది.

ఎల్లమంచిలి : డామినేటింగ్ ది హోల్ ప్లేస్ రైసెస్ ఎ హిల్ ఆన్ ది టాప్ ఆఫ్ విచ్ ఆర్ మెనీ బ్రోకెన్ స్టోన్స్ అండ్ బ్రిక్స్ ఆఫ్ ది ఏన్సియెంట్ పాటర్న్ అండ్ ఎ లాండ్ మార్క్ ఫాక్ మైల్స్ అరవుండ్, ది టు స్టోన్ పోస్ట్స్ అండ్ ఎ లిన్‌టెల్ ఆఫ్ ఎ డోర్ వే. దోస్ ఆర్ లోకలీ డిక్లేర్డ్ టు బి ది రిమైన్స్ ఆఫ్ ఎ పాలెస్ అండ్ ఎ ఫోర్ట్ ఆఫ్ ది గొల్ల కింగ్స్ అండ్ ది హిల్ ఈస్ కాల్డ్ నూకిపాపాస్ హిల్లాక్ ఆఫ్టర్, యిట్ యీస్ సెడ్, ది సిస్టర్ ఆఫ్ ఒన్ ఆఫ్ ది రూలర్స్.

పాపనూక దుష్టజాతకం కారణంగా సంభవించబోయే అరిష్టాలు వారించటానికి ఆమెను ఒక ఒంటి స్తంభం మేడకట్టించి అందులో వుంచినట్టు కాటమరాజు కథలు తెల్పుతున్నాయి. 'పాపనూక కథ లో కాటమరాజే తన 'ఎలమంచిచెల్లెల్ని' మేడలో పెట్టించే కట్టడికి వగుస్తూ

"కరుణతో భక్తిరన్న మమ్ముకాపాడు కొరకు
విశ్వనాథుడు ఎలమంచిని విడిచె సంపదలు
బసువ వాహనుండు ప్రజలరు నాయకుండు
పల్లికొండ అయితన్న బాలరాజులును
మాతల్లి సిరిదేవి యలమంచివారు"

—అంటూ భక్తిరన్న తనను, పాపనూకను కల్యాణపట్టణం నుండి తీసుకువచ్చి ఎలమంచి నగరంలో వుంచిన వైనాన్ని పద్మరాఘవునికి వివరిస్తాడు. కనుక యీ యాదవ గాథలు వీరికి ఎలమంచిలితో సంబంధం వున్నట్లు భావిస్తున్నాయి. ఎలమంచిలి కొండమీద నేటికీ నిలుచున్న ఓ కట్టడాన్ని పాపనూకమ్మ మేడ శిథిలాలుగా చెప్తారని పైజనశ్రుతులు తెల్పుతాయి. కాని యిది వాస్తవానికి విరుద్ధం. ఏ ఆధారం లేని ఊహ.[28] ఇది ఒక శివాలయ ముఖద్వారమని అక్కడ చిన్నాభిన్నంగా పడివున్న ఆలయ చిహ్నాల్ని, నందివిగ్రహపు శిథిలాల్ని బట్టి రూఢిగా తెలుస్తోంది. క్రీ॥ శ॥ పదకొండవ శతాబ్దిలోని చాళుక్య విజయాదిత్యుని కాలంలో యీ శివాలయానికి సమర్పించబడ్డ దానాన్ని సూచించే ఒక గుండ్రాతిపై చెక్కబడిన శాసనం, కొండపైనుండి దొర్లిపడి స్థానికులచే పరిరక్షింపబడగా యీ మధ్యనే దానిని విశాఖపట్నంలోని రాష్ట్రప్రభుత్వ పురావస్తు శాఖవారి కార్యాలయానికి చేర్పించటం జరిగింది. కనుక ఆ కొండపైనున్న ముఖద్వారం ఒక శివాలయ ముఖద్వార మేతప్ప, కొందరనుకొనే 'పాపనూక మేడ' శిథిలం కానేకాదు.

వీటన్నింటినిబట్టి కాటమరాజు కథలలో పేర్కొనబడ్డ వీరి పూర్వీకుల వివరాలు ఆయాప్రదేశాల్లో, ఆయా కాలాల్లోని చరిత్రకు, సంఘటనలకు పొత్తుకుదరని రీతిలో వున్నట్లు తెలుస్తోంది. కనుక చరిత్ర పరిశోధనాదృష్టిలో నిస్సందేహంగా యీ వీరగాథలలోని అంశాలు ఏమాత్రం ఉపయోగకరం కావు.

## అధోజ్ఞాపికలు :

1) ఆంధ్రపత్రిక, 1953-54, పే. 33.
2) ఎఱ్ఱగడ్డపాటి పొట్లాట.
3) భారతి (ఆంధ్రపత్రిక అనుబంధం), 20-5-1987; 3-6-1987; 17-6-1987.
4) ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు, 12వ సమావేశాలు, 1988లో అనకాపల్లిలో సమర్పించిన వ్యాసం.
5) కాటమరాజు కథలు, మొదటి సంపుటము, పీఠిక II, పే. CXXXXVI.
6) ఎఱ్ఱగడ్డపాటి పొట్లాట.
7) కాటమరాజు కథలు, మొదటి సంపుటము, పీఠిక II, పే. CXXXXVII.
8) కాపరుప్లేటు యిన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియం, మొదటి సంపుటము, పే. 109.
9) భారతి, 1961, ఏప్రియల్, పే. 89.
10) మనుచరిత్ర, చతుర్థాశ్వాసం, ప. 60.
11) భారతి. 1961, ఏప్రియల్, పే. 89.
12) ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు, పే. 137.
13) హంసవింశతి, ద్వితీయా శ్వాసము, పే. 91.
14) కాటమరాజుకథలు, మొదటి సంపుటము, పీఠిక, II, పే. CCIXV
15) నెల్లూరుజిల్లా గుండ్లపాలెపు శిలాశాసన విషయాన్ని దృష్టిలో నుంచుకొని ఈమాట చెప్పటం జరుగుతోంది.
16) కాటమరాజుకథ, ఆంగ్ల పీఠిక, పే. XI.
17) కాటమరాజు కథలు, మొదటి సంపుటము, పీఠిక, II, పే. IXXV
18) కాటమరాజుకథలు, మొదటి సంపుటము, పీఠిక, I, పే. XXXII
19) హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ యిన్ మిడీవలు ఆంధ్రదేశ ఢిల్లీ, 1986.
20) సౌతిండియన్ యిన్స్క్రిప్షన్స్, సంపుటి, VI, నెం. 692, 934, 910, 921, 840, 916, 705, 919, 698.
21) సౌతిండియన్ యిన్స్క్రిప్షన్స్, సంపుటి. VI, నెం. 665, 656, 667, 662, 663, 668, 661, 669, 671.
22) భారతి. 1981, డిసెంబరు, పే. 60.
23) సౌతిండియన్ యిన్స్క్రిప్షన్స్, సంపుటి, VI, నెం. 662, 668.
24) హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి (బి.వి. కృష్ణారావు), పే. 103.
25) టెంపులు యిన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, సంపుటము I, శ్రీకాకుళం జిల్లా, 1980.
26) కాటమరాజు కథలు, మొదటి సంపుటము, పీఠిక, II, పే. CVIII.
27) ఎడ్మినిష్ట్రేషన్ అండ్ సొసైటీ యిన్ మిడీవలు ఆంధ్ర అండరు ది లేటరు యీస్టర్న్ గంగాస్ అండ్ ది సూర్యవంశీ గజపతీస్, పే. 33-34.
28) భారతి (ఆంధ్ర పత్రిక అనుబంధం) 28-1-1987.

# సూర్యుని జన్మదినం

## డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

భూమికి జన్మదినం విరగపండిన పంటచేను
సముద్రానికి జన్మదినం నిండు పున్నమివెన్నెల
అగ్నికి జన్మదినం మెరుపులుమిసే పిడుగు
గాలికి జన్మదినం అడవిచెట్లను కరకర నమిలే తుఫాను
ఆకాశానికి జన్మదినం అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడు.
మరి ఆ బాలభానుని జన్మదినం?
అరుణకిరణాల అక్షరాల్ని జల్లే
కైపెక్కిన తరుణ లోకం కన్నుల కెందామరలు!

ఓ మంటల భాస్కరుడా!
నువ్వు పంటలు కోసే కొడవళ్ళ కన్నీళ్ళు తుడిచావు
వెన్నెల త్రాగే చకోరాల కిలకిలలు విని పులకించావు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగుల గర్జనలు ప్రతిధ్వనించావు
నిట్టూర్పుల తుఫానుల్ని ఓదార్చావు
నీ ఒడిలో సేదతీర్చావు
శిఖరాలమీద సూర్యుడు నాటిన ఎర్రజెండాలముందు
మానవతా జాతీయగీతాలు ఆలపించావు
ప్రభవనుంచి అక్షయంలోకి ప్రవహించే కాల ఋతు
చక్రంలో!

పిట్టల పాటలు వెలిగించిన
చెట్లమీది వసంతాలు తిలకించావు!

ఓ కావ్యఫణీంద్రా!
నిత్యం నీ నాలుక గున్నమామిడిమీద వాలే వాల్మీకి
కోకిలగానం

మెట్లు మెట్లుగా పైకి ఆనందశిఖరాలకు....
విషాద ధూమంగా క్రమ్ముతూ
నీ గుండెను పట్టి పిండుతూ
అశోకవనాన్ని చీల్చుకొని వచ్చే జానకీ శోకం
బొట్లు బొట్లుగా క్రిందికి
తమస్సుల అఖాతంలోకి....
ఎడతెగా
నిష్ఠుర విషాదగీతాల్ని ఆలపించే
కన్నుల మిరుమిట్లు గొలిపే సౌందర్యకాంతి!
మనసుకు మయూరనృత్యాల శాంతి!
రంగు రంగుల కలలద్రష్ట
నీ ప్రతిభా రక్తంలో ముంచి
ఈ జనతా హృదయ చిత్రాలకు
మెరుగులు దిద్దుతావు
మామీద ఇంద్రధనుస్సుల పందిళ్ళు పరుస్తావు
ఇంద్రజాల మహేంద్రజాలాలతో
మెస్మరైజ్ చేస్తావు....

కవితాగ్న ధునిలో పడి
కరిగిపోయిన ఓ వెండిజాబిల్లీ!
ఒకే సమయంలో
నీలో చూస్తాను ద్వంద్వాలు....
అమృతం - విషం
అగ్ని - హిమం
షాంపేన్ - నాటుసారా
సుఖ దుఃఖాలు
మరుజవానా - స్పెషల్ చ్యవనప్రాస
హెరాయిన్ - మహాకనక సిందూర భస్మం!
క్లోరోఫిల్ చచ్చిన ఎండుగడ్డి కవితకు
కాయకల్ప చికిత్స చేసిన అపర ధన్వంతరివి!
మూర్ఛపోయిన లక్ష్మన్నపాలిటి
సంజీవరాయడివి!!
విస్కీ చెప్పింది వేదం
అది వెర్రిక్!
నీ గొంతుకకు
నేను ఎడిక్ట్!!

రాముడు, కృష్ణుడు, రామకృష్ణుడు-
గురు గౌరీశంకర శిఖరాలు....
హనుమంతుడు, అర్జునుడు, నరేంద్రుడు-
శిష్యత్రిశూలాలు....
విశ్వనాథకు
జువ్వాడి గౌతమ్!

ఓ మండే సూర్యుడా:
నీ వెలుగు ముందు
నేనూ నా చీకటీ
ఖతమ్!!
ఇది
నీకు
అంకితమ్!!!

(1986 అక్టోబరు 20వ తేదీని యుగకవి శేషేంద్ర 60వ శరత్తులో అడుగుపెట్టిన సందర్భంలో....)

# వెన్నెలలో వడగాడ్పులు

## శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

పులకిస్తోంది ధరిత్రి
అంతలో స్పృహ తప్పుతోంది ధరిత్రి
ఆలోచనల్లో లేతపువ్వులూ
ఈతముళ్లూ కురుస్తున్నాయనీ
సంక్షోభం, సంగీతం కలగలిసి
వరదలై తనను ముంచేస్తున్నాయనీ
ఏడుస్తోంది ధరిత్రి
పాడుతూ లేడిలా గెంతుతోంది ధరిత్రి!
అమృత స్రవంతిలో
హాలాహలం ఒక ఉపనది
పర్జన్య ఘోషకు
పల్లవి ఒక అష్టపది!

దీపమై తాను వెలిగితే
పాపంలా తనచుట్టూ చీకటి!
తన చూపు ఆనంద విహంగమైతే
దాన్ని అణగద్రొక్కుతూ కుటిలభ్రూకుటి!
చిగురేస్తోంది ధరిత్రి
అంతలో చివికిపోతోంది ధరిత్రి
అంతరంగ రంగస్థలం మీద ఒకేసారి
వినోదాలూ, విషాదాలూ గజ్జె కడుతున్నాయనీ
ఒక ఎలిజీ, ఒక వెండి బిజిలీ
తనకు పదబంధాలవుతున్నాయనీ
కూలబడుతోంది ధరిత్రి-
కులుకుతూ నడుస్తోంది ధరిత్రి!

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

# సాహిత్యము అఖండము, అవిభాజ్యము

"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు! నదులు ప్రవహిస్తాయి. కవితల్లా- పశుపులకోసం పక్షులకోసం మనుష్యులకోసం! నదులు కంటున్న కలలు పొలాల్లో ఫలిస్తాయి! కవులు కంటున్న కలలు మనుష్యుల్లో ఫలిస్తాయి" (ఆధునిక మహాభారతము) నదిలా కవి అనేక దేశాల్లో అనేక భాషల్లో అనేక నాగరకతల్లో అనేక మానవీయ సుఖదుఃఖాల్లోపడి ప్రవహిస్తాడు. కవి ప్రయాణంలో భాష వెనకబడిపోతుంది.

భాష నాలుగయిదు వందల మైళ్ళకంటే ఎక్కువ దూరం పరుగెత్తలేదు. భాష పరుగెత్తి పరుగెత్తి ఎక్కడ కూలబడిపోతుందో ఆ సీమనుంచీ మరో భాషలేచి పరుగెత్తుతుంది. ఇది దూరం చేస్తున్న అద్భుత తంత్రం. అక్కడ్నించీ మరో మట్టి మరో చెట్టు మరో నది మరో ఆకారం మరో పువ్వు మరో పండు మరో పక్షి మరో పాట! అక్కడ్నించీ మనిషి సుఖదుఃఖాలు మనిషి కథలు మనిషి కన్నీళ్ళు మనిషి పురాణాలు మనిషి చరిత్ర అన్నీ భిన్నంగా కనిపిస్తాయి. అంటే ఒకచోట మామిడిపండు ఉండి మరోచోట లేదనీ ఒకచోట కోకిలఉండి మరోచోట లేదనీ ఒకచోట కన్నీరుఉండి మరోచోట లేదనీ కాదు దీని అర్థం. అన్నీ యథాతథంగానే ఉంటాయి. కానీ వాటి రంగులో రుచిలో వాసనలో ఏదో అనిర్వచనీయమైన ఒక విశేషం ఉంటుంది. అర్థాత్ అది వస్తువుల్లో ఉన్న భిన్నతకాదు. అది వస్తువుల్లో ఉన్న విశేషం. అదంతా ఒక వేరే జీవితపు అగ్నిముద్ర. ఆ అగ్నిముద్రనంతా మోసుకునిపస్తుంది, ఆ మట్టిలో పుట్టిన అలంకారం! ఆ అలంకారాల్ని ఆ అలంకార సంకేతిత సాహిత్యాన్ని మనం ఆర్జించుకుంటే ఆ ప్రజల జీవన సారాంశాన్ని మన జీవన సారాంశంలో మిశ్రితం చేసుకున్నా మన్నమాటే! ఇలా ఎన్ని సాహిత్యాల్ని మనం స్వాధీనం చేసుకుంటామో అన్ని మానవీయ అనుభూతి విశేషాల్ని నాగరకతల్నికాలాల్ని దూరాల్ని, అవి, మనకు స్వాధీనం చేస్తాయి. మన ఆత్మగతం చేస్తాయి, మన చైతన్య దిగంతాల్ని విస్తృతం చేస్తాయి. ఒక అలంకారం ఇంత పని చేస్తుంది. కనకనే ప్రసిద్ధకవి విమర్శకుడు ఆర్చిబాల్డ్ మెక్లీషు అంటాడు. "ఇఫ్ ఎ మెటాఫర్ డయిస్ ఎ హోల్ సివిలిజేషన్ డయిస్" ఈ తాత్త్విక కాంతిలో తులనాత్మక సాహిత్యం అంటే ఏమిటో చూడాలి —

కాలదూరాల కరిష్మానుంచి మనిషి తప్పించుకోలేడు. ఒకే ఇంగ్లీషుభాష అట్లాంటిక్ మహాసముద్రంచేత రెండు భాషలయిందట! వ్యాలేస్ స్టీవెన్స్ అంటాడు "అమెరికన్స్ ఆర్ నాట్ బ్రిటిష్ ఇన్ సెన్సిబిలిటీ నార్ కాన్ దే యురోపియన్" కాలదూరాలను జయించడానికి తులనాత్మక సాహిత్యం అమోఘమైన అస్త్రం. తులనాత్మక సాహిత్యం అంటే కంపారెటివ్ లిటరేచర్; కంపారెటివ్ లిటరేచర్ అంటే ఒకటి కంటే ఎక్కువ భాషల సాహిత్యాల్ని కలిపి పోలుస్తూ పరిశీలించే సాహిత్య విమర్శ ప్రక్రియ. అన్యభాషాసాహిత్యాల్ని మూలభాషల ద్వారా లేక అను వాదాలద్వారా పాఠకులు చదివి తులనాత్మక ఫల స్వరూప విశిష్టాను భవసిద్ధి పొందుతారు. ఆ విశిష్టానుభవాన్ని తులనాత్మక సాహిత్యం విమర్శరూపంలో అందజేస్తుంది. భిన్న భిన్న జీవసంఘటనల్లో భిన్న భిన్న మానవీయ భావాత్మక స్థితులు, అన్యదేశాల జనవన నదీ పర్వతాది ప్రాకృతిక వస్తుజాల స్థాన ప్రభావాది సంవేదనాత్మక బాంధవ్యాలు చరిత్ర ఉద్యమము యుద్ధము ఆది సంఘటనల ముద్ర అనే స్థూల అంశాలూ, సాహిత్యప్రక్రియలు అలంకార బింబప్రతీకాదుల ప్రయోగ విశేషాలు సంగీతాది మృదుల విద్యలు వాటికి ఆ నేలతో ఆగలితో ఆనదీనద వనపర్వతాదులతో ఉన్న బాంధవ్యం ఇత్యాది సూక్ష్మ అంశాలు తులనాత్మక సాహిత్యంలో పరిశీలింపబడాలి.

ఒక భాషలో ఉన్న మూలాన్ని మరో భాషలో ఉన్నదాని అనువాదాన్ని పోల్చడం తులనాత్మక సాహిత్యంకాదు. ఒక భాషలో ఒక రచనలోఉన్న ప్రసిద్ధ భావజాలాన్ని తీసుకొని మరొక భాషలో మరొక ప్రక్రియలో వేసిన రచనకూడా తులనాత్మక సాహిత్యానికి యోగ్యవస్తువుకాదు. కారణం, ఆ క్రమంలోనుంచి వెనక చెప్పిన ఏ

ఫలమూ పుట్టదు కనుక. ఉదా॥ గ్రీకు వేదాంతి ఎపిక్యూరస్ తాత్త్విక సిద్ధాంతాల్ని క్రీ. పూ. 1వ శ. కి చెందిన ల్యూక్రీషియస్ అనే రోమన్ కవి ఒక కావ్యకృతిగా రచించాడు. దాన్ని ఎపిక్యూరస్‌తో పోల్చి చేసే విమర్శ విమర్శ అవుతుందేగానీ తులనాత్మక సాహిత్యం కాదు.

తులనాత్మకసాహిత్యానికి స్వతంత్ర రచనలే యోగ్యమైన సామగ్రి. ఆ రచనలు, సృష్టిలో చెట్లు నదులు కొండలు మృగములు పక్షులు మనుషులు పుట్టినట్లు, సహజ జాతములై ఉండాలి. అప్పుడే అవి తులనాత్మక సాహిత్యానికి లాభదాయకమవుతాయి. తులనాత్మక సాహిత్యంలో ప్రధానతః సిద్ధమయ్యే సత్యమేమిటంటే- మనుషులు ఈ భూగోళంమీద ఎక్కడున్నాసరే వారి జీవన సంఘటనలు సుఖ దుఃఖాలు సామాజికస్థితిగతులు చరిత్ర ఇతిహాసం పురాణావళి ఇత్యాది మానవీయతాలోఁన్య విషయాలు, సూక్ష్మభేదాలున్నప్పటికీ, సాధారణతః సమానంగా ఉంటాయి. ఆ సమాన లక్షణాల్ని ఆ సూక్ష్మభేదాల్ని అన్వేషించడంలోనూ ఆవిష్కరించడంలోనూ ఉంటుంది. సాహిత్యపరమైన ఆనందము జ్ఞానపరమైన సాఫల్యము. తులనాత్మక సాహిత్యంతో మనిషిపొందే ఉత్కృష్టప్రయోజనం ఇదే.

ఇలియడ్‌లో- ఒకనాటి యుద్ధానంతరం గ్రీకు వీరుడు అగమెమ్నన్ విజయకారణంగా మిత్రులకు ఒక పెద్ద విందు ఇచ్చాడు. అందులో ఆనాటి యుద్ధంలో చంపబడిన శత్రువుల మాంసం వండి వడ్డించబడింది; సంతోషపూర్వకంగా ఆరగించబడింది, కానీ రామాయణం చదివితే, రావణవధానంతరం, రావణభ్రాత విభీషణుడు అన్నకు దహనసంస్కారం చెయ్యడానికి రాముడ్ని అనుజ్ఞ ఇమ్మంటాడు. అప్పుడు రాముడంటాడు, "మరణాంతానివైరాణి నివృత్తం నః ప్రయోజనం! క్రియాతాం అస్య సంస్కారః మమా ప్యేష-యథా తవ"! మానవ నాగరకతా తారతమ్యంలో ఉన్న ఈ విశేషం ఆశ్చర్య జనకం! గ్రీకు యోద్ధ అఖిలిస్ ట్రోజన్ వీరుడైన హెక్టర్ను ద్వంద్వ యుద్ధంలో చంపినప్పుడు చూపించిన ఉగ్రక్రౌర్యం భీముడు దుశ్శాసనుడ్ని చంపినప్పుడు అంత సంపూర్ణంగా మహాభారతంలో దర్శనమిస్తుంది! / అమీర్‌ఖుసో విఖ్యాతకవి, (15 శతాబ్దం) దోహా:- "సజన సకారే జావేంగే ఔర్[1] నయన మరేంగే రోయే! బధ్నా ఐసీ రయిన కరో కె భోర్ కథిన హోయే॥" (తెల్లవారితే ప్రియుడు వెళ్ళిపోతాడు ఏడ్చి ఏడ్చి కళ్ళు చచ్చిపోతాయి 12[1] విధీ ఏ రాత్రి ఎప్పటికీ తెల్లవారదో అలాంటి రాత్రిని చెయ్యి!) 11వ శతాబ్దపు ఒక ఫ్రెంచి కవి ఆర్నాడ్ డేనియల్ అంటాడు" ప్లీస్ గాడ్ దట్ నయిట్ డియర్ నయిట్ షుడ్ నెవర్ సీస్, నార్ దట్ మయి లవ్ పార్టెడ్ ఫ్రమ్ మి" ఆశ్చర్యం! ఎప్పటివాడో వాల్మీకి; రామాయణంలో దశరథుడు. తెల్లవారితే రాముడు అరణ్యవాసం వెళ్ళిపోతాడని దుఃఖభారంతో రాత్రి నుద్దేశించి ప్రార్థిస్తాడు. "న ప్రభాతం త్వయేచ్ఛామి నిశే నక్షత్రశాలిని! క్రియతాం మే దయా భద్రే మయాఽయం రచితోఽంజలిః॥ (ఓ నక్షత్ర శోభాను యారాత్రీ నీవు ప్రభాతంగా మారవద్దు నామీద దయచూపించు నీకు చేతులు జోడిస్తున్నాను) మానవ ప్రేమ ఆర్తి కలిగి మానవ ముఖమండలంలో ఎలాంటి అలంకార బింబోదయం కలిగిస్తాయో చూస్తే మనం అద్భుతరస నిమజ్జనం చేస్తాం.

భారతదేశంలో వాల్మీకి అంటాడు, "స్తిమితం గంతు మారేభే భయాద్గోదావరీ నదీ" (భయంకరుడైన రావణుడ్ని చూచి) వేగంగా ప్రవహించే గోదావరీనది మెల్లె మెల్లగా ప్రవహింపసాగింది!) వాల్మీకి ఎప్పటివాడో, ఆంగ్ల మహాకవి ఎడ్మండ్ స్పెన్సర్ (1552) థేమ్సు నది నుద్దేశించి అంటాడు, "స్వీట్ థేమ్స్ రన్ సాఫ్ట్‌లీ టిల్ ఐ ఎండ్ మయి సాంగ్" దేశకాలాలను అధిగమించి భిన్న భిన్న భాషల భిన్న భిన్న ప్రజల సంవేదనావళి జన్యకావ్యాభి వ్యక్తులు ఎలా ఉంటాయో చూస్తే ఆశ్చర్యాఘాతం తగులుతుంది.

షేక్స్పియర్ అలంకారాభి వ్యక్తికి వాల్మీకి అలంకారాభి వ్యక్తికి ఎంతో బాంధవ్యముంది. ఉన్నదాన్ని అప్రస్తుతం చేసి చెప్పడం తద్వారా అది చమత్కార పర్యవసితం కావడం వారి అభివ్యక్తుల్లో ఉన్న ఒక శిల్పం. "నదీం పుష్పోడుపవహాం" అంటే పూల పడవల్ని మోస్తున్న నది. మన దృష్టిలో నదీప్రవాహంమీద రాలి తేలుతున్న పూలని వాల్మీకి నదిమోస్తున్న పూలు అంటున్నాడు. ఇది ఆ శిల్ప విధానం. షేక్స్పియర్ నాటకం. మేక్బెత్‌లో మేక్బెత్, రాజైన డంకన్‌ను హత్య చేసిన తర్వాత మేక్బెత్ అంటాడు (స్వగతం) "వాట్ హాండ్స్ ఆర్ హియర్? హా! దే ప్లక్ అవుట్ మయిన్ అయిస్ విల్ ఆల్ గ్రేట్ నెప్ట్యూన్స్ ఓషన్ వాష్ దిస్ బ్లడ్ క్లీన్ ఫ్రమ్ మయి హాండ్? నో దిస్ మయి హాండ్ విల్ రాదర్ ది మల్టిట్యూడినస్ సీ ఇన్‌కార్నడయిన్ మేకింగ్ ది గ్రీన్ వన్ రెడ్" (యాక్ట్ II సీన్ II) నా రక్తసిక్త హస్తాలు నా కళ్ళను పేకేస్తున్నాయి అంటాడు. వాస్తవ భౌతికానుభూతి ఏమిటంటే- హంతకుడైన మేక్బెత్ అంతరాత్మ అతడ్ని హింసిస్తోంది. కనక తన రక్తసిక్త హస్తాల్ని తను పునః పునః తీవ్రంగా చూచుకుంటున్నాడు. అంతరాత్మ తనని పొడిచే కొద్దీ, కళ్ళు చేతుల్ని చూచే తీవ్రత పెరుగుతోంది. అప్పుడు అనిపిస్తుంది- కళ్ళు చేతుల్ని చూడటంకాదు, అది ఆ రక్తాంకిత హస్తాలు కళ్ళని పీకడం! ఈ మాట చెప్పినప్పుడు అది అ స్తవ్యస్తం చేసి చెప్పిన అభివ్యక్తి అవుతోంది.

వాల్మీకిలో రాముడు రాజ్యభ్రంశము, అరణ్యవాసము, భార్యాపహరణము, మిత్ర సంహారము ఇలాంటి తన దుర్భర దౌర్భాగ్యం అగ్నినికూడా దహిస్తుందంటాడు," ఈ దృశీయం మమాలక్ష్మీః నిర్దహే దపి పావకం." అగ్ని అన్నిటినీ దహించేది, ఇక్కడ రాముడి

దౌర్భాగ్యం. అగ్నినికూడా దహిస్తుందట! వెనకటి మేక్బెత్ తైలాంతరో ఇలా ఉంది." నెప్ట్యూన్ గ్రహంలో ఉన్న అగాధమైన జలసముద్ర మంతా పెట్టి నా రక్తసిక్త హస్తాన్ని కడిగినప్పటికీ నా హస్తం శుభ్రం కాదు. పైగా ఆ సముద్రపు ఆకుపచ్చ వర్ణం కూడా నా హస్తపు రక్తం మూలంగా, రక్తవర్ణంగా మారిపోతుంది. వాల్మీకిలో మళ్ళీ ఇలాంటిదే ఒక అస్తవ్యస్త అభివ్యక్తి శిల్పం కనిపిస్తుంది." సంపూర్ణమని చేదద్భి ప్రవిశేయం మహోదధిం సోపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యేత్ సరితాం పతిః" (నేను ప్రాణత్యాగం చేసుకుందామని మహాసముద్రంలో దూకినా, ఆ సముద్రముకూడా ఎంత సంపూర్ణంగా ఉన్నా, నా దౌర్భాగ్యపు తీవ్రతచేత ఎండిపోతుంది.) వాల్మీకిలోనూ షేక్స్పియర్‌లోనూ ఉదాత్త అలంకారాభివ్యక్తితో ఒకే శిల్ప విశేషం దర్శన మిస్తోందనడానికే ఈ దృష్టాంతాలు చూపించబడ్డాయి.

మరో చిత్రము- పైన వర్ణించినట్లు తన రక్తసిక్త హస్తం చూచుకుని హంతకుడు మేక్బెత్ దుఃఖచింతాగ్రస్తుడవుతాడు ఆట్లాగే ఉర్దూ మహాకవి మీర్ తకీమీర్‌లో ఇదే కనిపిస్తుంది! "జమ్ గయా ఖూఁ కఫె కాతిల్ పె తేరా మీరాజె బస్! ఉన్ నె రోరోదియా కల్ హాత్‌కో ధోతే ధోతే" - (చాలా రక్తం నీ హంతకుని చేతికి అంటుకుంది. ఓ మీర్! దాన్ని వాడు మాటిమాటికి కడుక్కుంటూ వెక్కి వెక్కి ఏడ్చాడు) మేక్బెత్ అవస్థకు మీర్ హంతకుడి అవస్థకు ఉన్న సంపూర్ణ సారూప్యం తులనాత్మక సాహిత్య పరిశీలనా పరులకు ఆశ్చర్య ఆహ్లాదదాయకం కావాలి

హోమర్ నుంచి వాల్మీకి వరకు, మీర్ నుంచి షేక్స్పియర్ వరకు ఎంత విశాల సాహిత్య ప్రపంచ దృశ్యం కనిపిస్తుందో ఎలా ఆ వైవిధ్య విశేష విద్యుత్తులచేత మనం రోమాంచిత గాత్రులమవుతామో అది కేవలం అనుభవైక వేద్యం. మనిషి ఈ విశాల ప్రక్రియలో ఒక కాంతి మండలంగా మారుతాడు. బెజవాడ విశాఖపట్నాల చంక్రల్లో ఇరుక్కుని అవతలి సముద్రాల హోరు వినిపించని ఒక మండూక మాత్ర పురుషుడు కూడా దేశాలు కాలాలు ప్రజలు ఆకాశాలు అరణ్యాలు అని మహత్పదార్థాల్ని హస్తగతం చేసుకుంటాడు, ఆత్మగతం చేసుకుంటాడు. ఆధునిక మానవుడు ఒక అంతర్జాతీయ సాహిత్య చైతన్యం సాధించాలి; నవమానవుడుగా జన్మ ఎత్తాలి; లేకపోతే అర్ధమానవుడుగా అమానవుడుగా మిగిలిపోతాడు.

స్వభాషా వలయంలో అణువు పర్వతంలా ఉంటుంది. "ఈగల సామ్రాజ్యంలో దోమలు డిక్టేటర్లు! ఒంటెల సౌందర్యానికి వంతపాడు గాడిదలు! ఇక్కడ ప్రాకే చీమలు హిమాలయ శ్రేణులు" (ఆ. మ. భా) ఈ వ్యర్థ స్వభాషా కూప జలాల్లో ఈదుతూ అదే మహా సముద్రమని పోషిస్తూ ఉప్పొంగిపోయే తమోమయ మూర్ఖత్వంలోనుంచి మనిషి విముక్తుడవుతాడు. నాకిది తులనాత్మక సాహిత్య ధన్వంతరి బోధవం.

అన్యభాషా సాహిత్యాధ్యయనంచేత మన భాషలో సాహిత్యకారుల స్థాయి ఏమిటో మనకు తెలుస్తుంది. మన అల్పత్వాన్ని చూచి వీడే మహానుభావుడనే మూర్ఖత్వానికి లొంగే అవసరం ఉండదు. ఇదే వైకుంఠం ఇదే కైలాసం అని భజన చేసే అంధత్వం మనల్ని ఆక్రమించదు. ఎంత శ్రేయస్కరం ఈ తులనాత్మక సాహిత్యం!

అభిజ్ఞులకు తెలుస్తుంది ఏ ఒక్క భాషా సాహిత్యమూ సమగ్రం కాదని, ఆ ప్రజల సంప్రదాయం, సంస్కృతి, చరిత్ర, అనుభూతి ఆర్ద్రాదుల్లో ప్రవేశించే వైవిధ్యాలమూలంగా అసమగ్రత సంభవిస్తుంది. ఒక్కో భాషలో ఒక్కో సాహిత్య ప్రక్రియ ఉజ్జ్వలంగా ఉంటుంది. ఒక్కో జీవనానుభూతి ఒక్కో భాషా సాహిత్యంలో హృదయ చుంబక సంపూర్ణత పొందుతుంది. అన్నీ అలా పొందవు. తులనాత్మక సాహిత్యవేత్త హ్యారీ లెవిన్ అంటాడు, "దిస్ ఎస్ నౌ లిటరేచర్ ఇనఫ్ టు ది ఎండ్ ఆఫ్ ప్రొవైడింగ్ ఇన్ ఇట్ సెల్ఫ్ ఎ ట్రూ ఎడ్యుకేషన్? ఫ్రమ్ ఆర్ బియాండ్ టు ఎక్స్‌ట్రీమ్ డర్ మెయిన్ పార్ట్ ఆఫ్ యూరోపియన్ ఎక్స్‌పీరియన్స్ హార్డ్‌లీ ఎంటర్డ్ ఇంటు ఇంగ్లీష్ లిటరేచర్; సర్టెన్ రియామ్స్ ఆఫ్ రయిటింగ్ హేవ్ బెటర్ డన్ ఎల్స్‌వేర్" కనక బహుభాషా సాహిత్యాల అధ్యయనం ఆధునిక మానవునికి అనివార్య కర్తవ్యం.

2

భూగోళం మీద నాగరకత అంకురించిన నాటినుంచి జ్ఞాన విజ్ఞానాలు గాలుల్లా మేఘాల్లా నానాదేశాలుదాటి భూగోళమంతటా వ్యాపిస్తూ ఉండడం చరిత్ర పేజీలు చూపిస్తాయి. ఆ సందర్భాల్లో భిన్న భిన్న భాషల్లో మానవులు సాధించిన విజయాలతో సంపర్కం కలిగినప్పుడల్లా మనిషి కుతూహలి అవుతున్నాడు. ప్రభావితుడవుతున్నాడు అంతేకాక పరస్పర సంతులన శీలి కూడా అవుతున్నాడు. ఇది సహజ ప్రక్రియ. అదంతా రికార్డు అయ్యే ఉంది. అయితే వికీర్ణంగా ఉంది. ఇది సాహిత్యంలోనే కాదు, శాస్త్రం, పురాణం, రాజకీయం వాస్తువు, యుద్ధతంత్రము, సంగీతము ఇలా అనేక మానవీయ కార్యరంగాల్లో ఇలాగే జరిగింది. అందుచేత ఈ సమస్త మానవ క్రియా కలాపాల్లో ప్రపంచమంతటా పోలికలు కనిపిస్తాయి. అవన్నీ తులనాత్మక అధ్యయనానికి యోగ్యవస్తువులే. ఉదాహరణకి, సి. జె యుంగ్ సి. కరేన్యి రచిత ఎస్సేస్ ఆన్ ఎ సయిన్స్ ఆఫ్ మిథాలజీ చదివితే మన పురాణాల్లో ఉన్న వామనావతార కథ, ఫిన్లాండు దేశపు పురాణం కాలెవెలాలో, కుల్లెర్వో అనే అంగుష్ఠమాత్ర పురుషుడి కథగ కనిపిస్తుంది. హంగేరీ దేశపు వోగల్స్ అనే ఆదిమ జాతివారి కథల్లో ఉండే ఒక అద్భుత శిశువుకీ మన మహాయాన బౌద్ధ అవలోకితేశ్వర

డికీ సంపూర్ణ పోలికలున్నాయని తెలుస్తుంది అలాగే మన వేదోపనిషత్తుల్లో ఉన్న హిరణ్యగర్భుడికీ ఫిన్లాండు పురాణం చెప్పే గ్రుడ్డులో నుంచి పుట్టిన వాలుడికీ సాదృశం చూపబడింది. ఈ విషయాల్ని గురించి ఒక గ్రంథం రాయవచ్చును. ఇవన్నీ ఒకచోటినుంచి ఒకచోటికి ప్రయాణం చేశాయా లేక ఎక్కడిది అక్కడే ఆ పోలికల్తో పుట్టాయా, చెట్లు పశువులు మృగాలు నదులులా, చెప్పలేము. కానీ వీటిని జతచేసి చూస్తే తులనాత్మక పరిశీలన వుడుతుంది.

సాహిత్యంలో ప్రాచీన పాశ్చాత్య దేశాల్లో తులనాత్మక పరిశీలన శాస్త్ర రూపంలో జరిగిన సందర్భాలు కనిపించలేదు. ఇప్పుడు పాశ్చాత్య దేశాల్లో శాస్త్రరూపంతో ఇంకా ఉదయిస్తున్న తులనాత్మక సాహిత్యం భారతదేశంలో ప్రాచీనకావ్య శాస్త్రంలో ఒక భాగంగా ఉండేదనీ అందులోనూ ప్రథమ భాగ గా ఉండేదనీ దండి, వామన, రాజశేఖరాదుల గ్రంథాలు చదివితే తెలుస్తుంది

తులనాత్మక సాహిత్యం భారతీయ కావ్యశాస్త్రంలో ఎలా ఒక అంతర్భాగం అయిందంటే అసలు సంస్కృత సాహిత్యమే ఒకే ఒక భాషకు సంబంధించిన సాహిత్యం కాదు, మన తెలుగులా, బెంగాలీలా, గుజరాతీలా దేశంలో ఉన్న అనేక భాషల మిశ్రమ ప్రయోగం జరిగిన ఒక విచిత్ర సాహిత్యం సంస్కృత సాహిత్యం ! ఈ భాషల ప్రయోగం కూడా సృజనాత్మక సాహిత్య ప్రక్రియలో జరిగింది. అదీ విశేషం-ఇలా ప్రపంచంలో మరో సాహిత్యం లేదు. అభిజ్ఞాన శాకుంతలంలో సంస్కృతము ప్రాకృతము అనే రెండు భాషలున్నాయి. అదొక మిశ్రకృతి. శకుంతలాది స్త్రీలు ప్రాకృతంలో మాట్లాడుతారు, దుష్యంతాదులు సంస్కృతంలో సగానికి సగం ప్రాకృత భాష అయినప్పుడు దాన్ని సంస్కృత నాటకమనే అనవలసిన అవసరంలేదు. ఇలాగే అనేక నాటకాల్లో ఒకటికంటె ఎక్కువ ప్రాకృత భాషలు శౌరసేని మాగధి అవంతికా అర్ధమాగధి ఆదులు అపభ్రంశ పైశాచికాదులు వాడబడ్డాయి. మృచ్ఛకటికంలో సుమారు ఏడు భాషలు వాడబడ్డాయి. పైగా నాటకం ఆ కాలంలో సాహిత్యంలో ప్రధాన కావ్యప్రక్రియ "కావ్యేషు నాటకం రమ్యం". అసలు నాట్య శాస్త్రప్రకారం అన్ని పాత్రలు ఒకేభాష మాట్లాడకూడదు. పాత్రౌచిత్యాన్నిబట్టి నిత్యజీవితంలో ఏభాషలు మాట్లాడుతారో నాటకంలో అవే మాట్లాడాలి "పురుషాణాం అనీచానాం సంస్కృతం స్యాత్ కృతాత్మనామ్। శౌరసేనీ ప్రయోక్తవ్యా తాదృశానాంచ యోషితాం... ఆభిరోక్తా మాగధీభాషా రాజాంతః పురచారిణాం। చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధ మాగధీ." ఇలా (సాహిత్యదర్పణం) - అంటే అలాంటి నాటకాలు రాయబడేవి ఆడబడేవి, కనక వాటి లక్షణం ఈ విధంగా చెప్పబడింది. ఆనాటి దేశపు సామాజిక స్థితులు అలా ఉండేవన్నమాట.

పైగా దండి ప్రథమ పరిచ్ఛేదంలో. మాగధ్యాది ఏడుప్రాకృత భాషలు అపభ్రంశ పైశాచిక భాషలు అన్నింటిని కలిపి, సర్గబంధ ఆఖ్యాయిక కథ నాటకాముల కావ్యవిభజనచేసి తర్వాత అంటాడు, "తదేత ద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా। అపభ్రంశ మిశ్రంచేత్యాహురార్యాశ్చతు ర్విధం" అని. కనక సంస్కృత సాహిత్యం అనగా దేశంలో ఉన్న అన్ని భాషల మిశ్రమ సాహిత్యం, అని ఆనాటి భావన. ఈ భాషలన్నిటినీ సమాన గౌరవంతో చూడటం చేతనే వాటినన్నిటినీ సమ్మిశ్రితంగా సాహిత్యంలో ప్రయోగించటం చేతనే సంస్కృతం మిశ్రమ సాహిత్యం అయింది. కనకనే కొన్ని కావ్య విశేషాలు కొన్నిభాషల్లోనే రాస్తే ఒప్పిదంగా ఉంటుందని లక్షణం చెప్పారు. "సంస్కృతం సర్గబంధాది ప్రాకృతం స్కంధకాదియత్। ఓసరాది రపభ్రంశో నాటకాదితు మిశ్రమం" (దండి)

ఈ విధంగా నానా భాషా సాహిత్య సమైక్యదృష్టి మనదేశంలో మూలగతంగా ఉండడం చేతనే అన్నిభాషల సాహిత్యాల అన్యోన్య పరిశీలన సహజంగానే సంభవించింది.

రీతులు, గుణాలు, మార్గాలు ఇత్యాదులు ఆదిమ కావ్యశాస్త్ర కర్తలైన దండి భామహవామనాదుల్లో విశిష్ట భావాలుగా ప్రప్రథమం కలయిత్తడం బహుభాషా సాహిత్యాల తులనాత్మక పరిశీలన మూలంగానే అని స్పష్టమవుతుంది. దండి అంటాడు "అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరం। తత్రవైదర్భ గౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ॥. ప్రదేశంలో అనేక సాహిత్య మార్గాలున్నాయి. అందులో ప్రస్ఫుటంగా భేదం కనుపించేవి వైదర్భ గౌడమార్గాలు రెండే, అంటే దండి, దేశంలో ఉన్న భిన్న సాహిత్యాల తులనాత్మక సాహిత్య పరిశీలనలో కనిపించినవి, దండి చర్చించాడు.

అట్లాగే వామనుడు మార్గాన్నే రీతి అని అంటూ ఆ రీతులు ఆయా దేశాల్లో ఉద్భవించినవనీ "సాచేయం రీతిస్త్రేధా - వైదర్భీ గౌడీయా పాంచాలీ చేతి" - ఈ మూడు రీతులు ఆ దేశాలవి అని చెప్పాడు. "కిం పునర్దేశవశాత్ ద్రవ్యగుణోత్పత్తిః కావ్యానాం యేనాయం దేశ విశేష వ్యపదేశః ? నైవం తదాహ - విదర్భాదిషు దృష్టత్వాత్ తత్సమాఖ్యా-"

అసలు అలంకారాలు కూడా ఆయా దేశాల్లో పుట్టిన సాహిత్య లక్షణ విశేషాలనుబట్టి పరిశీలించారు. దండి అదే అంటాడు, "కాశ్చిన్మార్గ విభాగార్థ ముక్తాః ప్రాగప్యలంక్రియాః", అంటే కొన్ని దేశ సాహిత్యాల్లో, కొన్ని రీతుల అలంకారాలు విశేషతః ప్రయోగించే స్వభావం ఉంటుంది అని ఫలితార్థం; అది ఆదేశ మార్గలక్షణం.

కావ్య మీమాంస తృతీయాధ్యాయం చదివితే ఇదే ఇంకా స్పష్టమవుతుంది. అందులో కావ్యపురుషుడి ఉత్పత్తి అతడి అవయవములు వర్ణింపబడ్డాయి. "శబ్దార్థౌతే శరీరం, సంస్కృతం ముఖం; ప్రాకృతం బాహుః, జఘన మపభ్రంశః, పైశాచం పాదౌ ఉరో మిశ్రమం"

ఐరోపీయ మనస్సు అనేభావన, తులనాత్మక సాహిత్యము ఆధునిక కాలంలో అన్యోన్య పోషక హేతువులుగా అభివృద్ధి చెందాయి. ఈ భావారోహణ క్రమంలో జార్జి శాంటాయనా రాసిన దేర్ ఫిలసాఫికల్ పొయట్స్ అనే వ్యాసం ఒక ముఖ్య సంఘటనగా భావించవచ్చు. క్రీ. పూ. 1వ శతాబ్ది రోమన్ కవి ల్యూక్రీషియస్, మధ్యకాలీన ఇటాలియన్ కవి దాంతే, ఆధునిక జర్మన్ కవి గెటే లని తీసుకుని తులనాత్మకంగా వాళ్ళ సాహిత్యాల్ని పరిశీలిస్తూ ఐరోపీయ తాత్త్వికతలో మూడు దశల్ని ఆవిష్కరించాడు. ఆర్నాల్డు ఐరోపాను ఒన్ ఇంటలెక్ట్యువల్ ఎండ్ స్పిరిట్యువల్ కాన్ఫెడరేషన్ అంటే, శాంటాయనా శిష్యుడు టి. యస్. ఇలియట్ యూరోపియన్ మైండ్ అనే భావనకు జన్మ ఇచ్చాడు. దాంతే మహాకవి రచించిన డివైన్ కామెడీ మీద ఆయన రాసిన "దాంతే" అనే లఘువిమర్శ గ్రంథంలో ఐరోపీయ సాహిత్య చక్రమంతా దాంతే అనే ఇరుసుమీద పరిభ్రమిస్తోందని చెబుతూ తనకు పూర్వం ఉన్న ఐరోపీయతని చాలా సూక్ష్మంగా పరిశీలించి బహుధా వికసితం చేశాడు. (చదవ వలసిన గ్రంథం.) ఇలియట్ అంటాడు, " ఎ పొయట్ షుడ్ రయిట్ నాట్ మియర్లీ విత్ హిస్ ఓన్ జనరేషన్ ఇన హిస్ బోన్స్ బట్ విత ఎ ఫీలింగ్ దట్ ది హోల్ ఆఫ్ లిటరేచర్ ఆఫ్ యూరోప్ ఫ్రమ్ హోమర్ అండ్ విత్ ఇన్ ఇట్. ది లిటరేచర్ ఆఫ్ హిజ్ ఓన్ కన్ట్రీ హాస్ సయిమల్ టేనియస్ ఎక్సిస్టెన్స్ ఎండ్ కంపోజ్ ఎ సయిమల్ టేనియస్ ఆర్డర్.

ఈ ఆధునికతా ప్రస్థానంలో ఆర్నాల్డ్‌ది ఆదిమ స్థానమైతే ఇలియట్‌ది ప్రధానస్థానం; ఆ తర్వాత ఎజ్రాపౌండు ఒక గొప్ప మజిలీ. ఎజ్రాపౌండు అంటాడు, "ఐ యామ్ నాట్ కన్సర్న్డ్ విత్ వన్ లిటరేచర్ బట్ విత్ లిటరేచర్ ఇన్ ఆల్ ప్లేసెస్" క్రిటిసిసమ్ ఆఫ్ పొయట్రీ బేస్డ్ ఆన్ వరల్డ్ పొయట్రీ అన్ ది వర్క్ ఆఫ్ మాక్సిమమ్ ఎక్సలెన్స్" అనేది ఆయన నినాదం. ఆధునికతా స్రష్టల్లో పౌండుకు అగ్రగణ్య స్థానముంది. కొండవాగు నది చేయ బడితే నదిని సముద్రీకరించాడు ఎజ్రాపౌండు. ఆయన చేసిన చైనీస్ జపనీస్ స్వేచ్ఛానువాద సాహిత్యం ఒకనవీన అంతర్జాతీయ సాహిత్య నాగరకత అనాలి.

ఇక్కడ జె. బి ప్రీస్ట్లీ రచిత లిటరేచర్ అండ్ ది వెస్ట్రెన్ మాన్ అనే గ్రంథం కూడా స్మరణీయం. ఐరోపీయత సరిహద్దుల్ని విస్తరించి ఆయన పాశ్చాత్యతా దిగంతాలు చూచాడు.

ప్రసిద్ధ అమెరికన్ కవి విమర్శకుడు హార్వర్డ్ యూనివర్సిటీలో కవిత్వం బోధించిన ప్రొఫెసరు ఆర్చిబాల్డ్ మెక్లీష చెప్పిన ఒకమాట తులనాత్మక సాహిత్య సందర్భంలో అతి బలిష్ఠ మయింది; "ఎ పోయమ్ ఈజ్ ఎ పోయమ్ ఇన్ ఎనీ లాంగ్వేజ్" అంటే ఏభాషలోనైనా రచిత కవితే. పొయట్రీ అండ్ ఎక్స్‌పీరియన్స్ అంటే కవిత వేరు భాష వేరు అన్నట్లయింది. భాష ఏమిటో తెలుసు మరి భాషకంటే అన్యమైన ఈ కవిత ఏమిటి? కవిత అలంకారబింబ ప్రతీకాత్మక; దాన్ని భాషమోస్తుంది. ఇదంతా మెక్లీష తన గ్రంథంలో వర్ణించాడు. (చదవ వలసిన గ్రంథం. అనువదిస్తే తెలుగు సాహిత్య దృక్పథాన్ని విప్లవీకరిస్తుంది.) లోకంలో అందరూ కవితని గురించి ఇదే చెప్పారు. ప్రసిద్ధ రష్యన్ సాహిత్య నేతగా నాస్పార్కీ– లిటరేచర్ ఈస్ ఆర్ట్ ఆఫ్ ఇమేజెస్ అండ్ ఎవ్వెరి ఇన్వేషన్ ఆఫ్ మేక్‌డ్ ఐడియాస్ ఆర్ ప్రోపగాన్డా ఈస్ ఆల్‌వేస్ డెట్రిమెంటల్ టు ది గివెన్ వర్క్." మన వామనాచార్యుడు "కావ్యం గ్రాహ్య మలంకారాత్" అని తన కావ్యాలంకార సూత్రవృత్తి రచన ప్రారంభించాడు. అట్టి అలంకారబింబ ప్రతీకాత్మక ద్రవ్యం ప్రపంచంలో మనుషులందరూ తెలుసుకోగలగినదే అవగాహన చేసుకోగలిగినదే ఆహ్లాదించబడ గలిగినదే. కనక సాహిత్యము కళ విశ్వ జనీనము. అర్థాత్, సృజనాత్మక కళ అయిన సాహిత్యము ఏ భాషలోకయినా ప్రవేశించగలదు. ఆ భాషా ప్రజల సంపదగా ప్రతిష్ఠితం కాగలదు, లేకపోతే కేవలం అనువాదమాత్రం అయిన ఆంధ్ర మహాభారతం ఎలా తెలుగు సాహిత్యంలో ఆది కావ్యం అయింది. అలాగే హోమర్, వాల్మీకి, షేక్‌స్పియర్, బోడిలేర్, ఇబ్సెన్, పుష్కిన్, టాల్‌స్టాయ్, ఓ హెన్రీ, ఛెకోవ్, నెరూడా, మొపాసా, వాల్ట్ విట్మన్, పిరెండెల్లో, టెన్నెసీ విలియమ్స్, జేమ్స్‌జాయ్స్ ప్రభృతి అసంఖ్యాక ప్రపంచ సాహిత్య మహాపురుషులు మనవాళ్ళని మనమెలా అనుకోగలుగుతున్నాము, ప్రపంచంలో సాహిత్యం ఎక్కడున్నా అది మనదే. సాహిత్యం ఏకము అవిభాజ్యము. తులనాత్మక సాహిత్య కాములకు మొదట ఈ విశ్వాసం ఉండాలి. ఇది ప్రప్రథమ సూత్రం.

ఆధునిక ప్రపంచానికి తులనాత్మక సాహిత్యం అనివార్యం. హింసాపీడితమైన వర్తమాన ప్రపంచానికి తులనాత్మక సాహిత్యం ఒక సాహిత్యం కాదు ఒక మతం! ఆధునిక మానవుడు అన్నిమతాలు విడిచి, రాజకీయ మతాలతో సహా అన్నిటినీ విడిచి, ఈ సాహిత్య మతాన్ని స్వీకరించి ప్రజల్లో విశ్వవిద్యాలయాల్లో ప్రచారం చెయ్యాలి. ఒక నూతన అంతర్జాతీయ సాహిత్య చైతన్యాన్ని ఉత్పన్నం చెయ్యాలి. ఒక నూతన శకారంభానికి కృషిచెయ్యాలి.

ఇప్పుడు లేచే ప్రశ్న ఏమిటంటే – అన్ని భాషలవాళ్ళు అన్య భాషల సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యడం ఎలా? ఏభాషాసాహిత్యం ఆ భాషలోనే ఉంటే అన్యభాషాప్రజలకు అది అలభ్యం అవుతుంది గనక తులనాత్మక సాహిత్య ప్రక్రియ వికసించి ఫలించాలంటే, నానా భాషల్లో ఖైదీలుగా పడివున్న సాహిత్యాల్ని ఆభాషా శృంఖల బద్దలు కొట్టి విడుదల చెయ్యాలి. దానికి ఏకైక మార్గం అనువాదం.

అనువాదం గత 50, 60 ఏళ్ళనుంచీ యూరోపులో భారీఎత్తున జరుగుతోంది. కనకనే యూరోపీయ మనస్సు, యూరోపు ఒక ఐక్యబౌద్ధిక సమితి, పాశ్చాత్య మానవుడు అనే భావనలు పాశ్చాత్య దేశాల్లో ఉదయించి ఒక నవీన మానవ సాహిత్య నాగరికతకు మార్గం వేశాయి. మన దేశంలో కూడా పూర్వకాలం అనువాదం భారీ ఎత్తున జరిగింది. ఇప్పుడు నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా వారు పాతికేళ్ళనుంచీ అన్నిభాషల సాహిత్యాల్నీ అన్యభారతీయ భాషలన్నిటిలోకీ అనువాదం చేస్తున్నారు. ఆ అనువాదాల్నీ, ఇప్పటికే ఉపలబ్ధంగా ఉన్న ఆంగ్లానువాదాల్నీ ఆధారం చేసుకుని విశ్వవిద్యాలయాలు తులనాత్మక సాహిత్య అధ్యయన విభాగాన్ని ప్రారంభించవచ్చును. దానికి ఒక విస్తారమైన లైబ్రరీ సుశిక్షితులైన వ్యక్తులు కొందరు కావాలి.

అనువాదం మీద ఈనాడు ఇండియాలో ఉన్న అపనమ్మకం అత్యంత గర్హనీయం. అనువాదాల మీదనే ఇన్ని శతాబ్దాలు బతికిన మానవ నాగరకత మీదనే అవిశ్వాసం ప్రకటించడమే అవుతుందది.- ఇంకా ఆశ్చర్యం తులనాత్మక సాహిత్యంలో కృషిచేస్తున్న వాళ్ళలో కూడా కొందరు ఇలా అనువాదం మీద అవిశ్వాసం చూపించడం ఆశ్చర్యం- హెన్రీ జిఫ్ఫర్డ్ ఇలా అంటాడు "ఎ ట్రాన్స్లేషన్ ఈజ్ యాన్ ఆయిల్ పెయింటింగ్ రిప్రొడ్యూస్డ్ ఇన్ బ్లాక్ అండ్ వైట్ ది ఒరిజినల్ ఈజ్ ఇమ్పాసిబుల్ ఇన్ ట్రాన్స్లేషన్." అయితే ఆయనే తులనాత్మక సాహిత్యం మీద రాసిన గ్రంథంలో అనువాద ప్రకరణంలో చివరకు అనువాదం అనివార్యం అని [illegible] అంగీకరించాడు. ఇంకా ఆశ్చర్యమేమిటంటే "పొయెట్రి ఈజ్ కమ్యూనికేటెడ్ బిఫోర్ ఇట్ ఈజ్ అండర్స్టుడ్" అనే ప్రసిద్ధ వాక్యం చెప్పిన టి.యస్. ఇలియట్ దాంతే భాషను గురించి "దాంతే" అనే తన గ్రంథంలో చర్చిస్తూ అంటాడు "ఐ డు మెయిన్టైన్ దట్ మోర్ ఈజ్ లాస్ట్ ఇన్ ట్రాన్స్లేటింగ్ షేక్స్పియర్ ఇన్టు ఇటాలియన్ దాన్ ఇన్ ట్రాన్స్లేటింగ్ దాంతే ఇన్టు ఇంగ్లిష్." అంటే ఇక్కడ ఆయన భావం. అనువాదం చేత మూలం కొంత నష్టమవుతుందనే గదా - కానీ ఇది ఆయన తన సంపూర్ణ కావ్యాత్మక స్పృహతో చెప్పినమాటగా తోచదు. ఏదో చర్చాగత వాదవశంగా అన్నమాట కావచ్చు. కారణం, ఆయనే "దాంతే"లో, టెన్నిసన్ కవిత్వాన్ని గురించి చర్చిస్తూ అంటాడు, "టెనిజన్స్ పోయెమ్ ఈజ్ ఫ్లాట్; ఇట్ హాజ్ వోన్లీ టూ డైమన్షన్స్. దేర్ ఈజ్ నథింగ్ మోర్ ఇన్ ఇట్ దాన్ వాట్ యాన్ యావరేజ్ ఇంగ్లిష్ మెన్ విత్ ఎ ఫీలింగ్ ఫర్ వెర్బల్ బ్యూటీ కెన్ సీ" అంటే ఆయన తాత్పర్యం, సువికసిత సాహిత్య స్పృహలేని సగటు ఆంగ్లేయుడు టెన్నిసన్లో ఏదో ఒక భ్రాంతి జన్యభాషా సౌందర్యాన్ని చూచి ఆనందిస్తాడనీ, అలాంటి భాషాసౌందర్యం కంటే అసలులో ఏమీ లేదనీ, ఆ ఫ్లాట్ అంటే ఎండుగడ్డిలాంటి నేలబారు వచనం అని అంటే భాషా సౌందర్య మున్నప్పటికీ కవిత్వం లేదనీ.... ఆ భాషా సౌందర్యం కూడా సాహిత్య పరిణతి లేని సగటు ఆంగ్లేయుడు చూచి తల ఊపేదేగానీ సాహిత్య పరిణతి ఉన్నవాడు ఆనందించేది కాదని - ఆయన అర్థం — కనక కవిత్వమూ భాషా విభిన్నవస్తువులని ఆయన అంతర్గత స్పృహలో ఉన్నదని మనకు విశదమవుతున్నది.

ఇలియట్లాగే ఈ భాషా సౌందర్య వాదాన్ని మెక్లీష కూడా అపహాస్యం చేశాడు. "ఇమేజెస్ కన్వె ది ఇమోషనల్ మీనింగ్ ఆఫ్ పొయెట్రి అండ్ దట్ రీడర్స్ ఆఫ్ పొయమ్స్ ఇన్ ఇంగ్లిష్ స్పీకింగ్ కంట్రీస్ సఫర్ ఫ్రమ్ ఎ ప్రిడిస్పొజిషన్ కామన్ యాస్ ఈ మన్ కేలీడ్, టు ఎస్యూమ్ దట్ ఇమేజెస్ ఇన్ పొయమ్స్ ఆర్ డెకొరేషన్స్. దె ఆర్ ఇన్ ఫాక్ట్ ద ఎలిమెన్ట్స్ ఆఫ్ ది స్ట్రక్చర్ ఆఫ్ ద పోయమ్ !

కనక, భాష వేరు కవిత్వం వేరు అయితే, కవిత్వం అలంకార బింబ ప్రతీకలైతే, అట్టి అలంకారబింబ ప్రతీకలను ఒకభాషలోనుంచి మరో భాషలోకి తీసుకుపోవడమే అనువాదం. అనువాదంలో మన మనసుకు భాషాపరమైన సమస్యలు మనలో పారంపరికంగా గతానుగతికంగా వస్తున్న భ్రాంతులు — అవి సత్యమైనా కవిత్వానికి నష్టం లేదు కానీ మూలంలో ఉన్న భాషావిశేషాల్ని కూడా అనువాదంలో తీసుకురావడం కృషిబద్ధులైన జాగరూకులైన [illegible] అనువాదకుడికి అసాధ్యం [illegible] అనువాద [illegible] నడిచిన అనుభవాన్నిబట్టి తెలుసుకున్నాను. మూలంలో ఉన్న కోమల స్వరాలు నాజూకు ప్రతిధ్వనులు [illegible] గానీ అవి అనువాద భాషలోకూడా దొరుకుతాయి. కారణం, సాధారణంగా మానవ సన్నివేశాలన్నీ ఏదేశంలోనైనా సమానంగానే ఉంటాయి. ఆ సన్నివేశాల్లో ఉత్పన్నమయ్యే సంవేదనాత్మక అభివ్యక్తులు కూడా సమానంగానే ఉంటాయి. ఆ అభివ్యక్తుల భంగిమ భిన్నంగా కనిపించవచ్చు. అభిన్నతే అనువాదకుడ్ని అలాంటి అభివ్యక్తి అనువాద భాషలో లేదనే భ్రాంతికి గురిచేయవచ్చు. కానీ జాగ్రత్తగా భాషా ప్రవర్తన భాషా శీలము గ్రహించగలిగిన మర్మజ్ఞులకు సమానాంతర అభివ్యక్తులు అన్నిభాషల్లోనూ దొరుకుతాయి. ఆమర్మజ్ఞతయొక్క ఆవశ్యకతే అనువాదాన్ని అనువాదకళగా మారుస్తుంది.

అనువాదం ఆధునిక ప్రపంచ సాహిత్య నాగరకత అని తులనాత్మక సాహిత్య శ్రేయోభిలాషులు గ్రహించాలి.

(ఆంధ్ర విశ్వ విద్యాలయ "తులనాత్మక సాహిత్య గోష్ఠి"లో సమర్పించిన ప్రధానోపన్యాసము అక్టోబరు 1986)

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## అక్టోబరు - 1988

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి నెలంతా మంచి అనుకూలమైన కాలము. నలత, శ్రమ, ధనవ్యయం కలిగినను, ఉద్యోగ వ్యవహారములలో మంచి అభివృద్ధికలుగును. నెలమధ్యనుండి కొన్ని కుటుంబ చిక్కులవల్ల మనఃఖేదం కలుగును. ఆర్థికంగా లోపం లేకపోయినా, అన్నినిశ్చయమై, ఫలించిన శుభకార్యాలన్నీ చివరలో వాయిదాపడును. ఉద్యోగులకు ప్రమోషను కల్గును. గతంలో తప్పిన విద్యార్థులకు ఇప్పుడు ఉత్తీర్ణత కవకాశంకల్గును. ఆశాభంగంపొందిన రైతులకు అనుకూలత కలుగును.

భరణి వారికి గతంకంటె పరిస్థితులు కొంచెము కొంచెము క్రమ క్రమంగా అనుకూలంగాఉన్నా, కుటుంబంలోని ఒడుదొడుకులు అప్పుడప్పుడు శ్రమను కలిగించును. ధనవ్యయంకూడా అవసరములేని పనికిమాలిన వాటికవుతుంది. కుటుంబ సంసార సౌఖ్యం బాగుగా నుండును. శుభకార్యములు నెరవేరును. స్వల్పంగా అసంతృప్తి అప్పుడప్పుడు కలుగుచుండును.

కృత్తిక 1పా వారికి అనుకూలంగా నుండును. ధనవ్యయం కలుగును బంధుసౌఖ్యం కలుగును. ఉద్యోగ వ్యవహారాదుల్లో మంచి అభివృద్ధి కలుగును. కుటుంబంలోని చిక్కులు తగ్గుముఖం పట్టును. ఉద్యోగులకు, వర్తకులకు, కార్మిక, కర్షకులకు విద్యార్థులకు మొదలగు వారికి వారి వారి రంగములలో యోగదాయకంగా నుండును. కాని శ్రమ హెచ్చుగా నుండును.

**వృషభం** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా వారికి గతంలోని చిక్కులన్నీ తొలగిపోయి, సుఖసంతోషములు కలుగును. తలచిన పనులు నిరాటంకంగా నెరవేరును. సంతానమునకు అన్ని విధముల అభివృద్ధి కలుగును. భూగృహాది సంపాదనము జరుగును. కాని వ్యవహార సంబంధమైన చిక్కులవలన, ధనవ్యయం, త్రిప్పట జరుగును. వర్తకులకు విశేషలాభం కలుగును. మొత్తంమీద మంచి హెచ్చుగాను. చెడు తక్కువగాను జరుగును.

రోహిణి వారికి మొదటి వారంలో భార్యకు నలత చేయును. మానసికశ్రమ ఆందోళనము, శరీరంలో నలత హెచ్చుగా నుండును. ధనవిషయమై లోపంలేకపోయినను అప్పుడప్పుడు తొట్రుపాటుతప్పదు. ఈ రాశివారందరికి ముఖ్యంగా విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు శ్రమమీద ఫలితం కలసివచ్చును.అధిక ధనవ్యయం కలుగును. మొత్తం మీద శ్రమహెచ్చు. ఫలితం తక్కువగా నుండును.

మృగశిర 1, 2పా వారికి ఇప్పుడిప్పుడే యోగము కలసి వచ్చుచున్నది. కాని 10-20 తేల మధ్య శ్రమ హెచ్చుగానుండును. చివరి వరకు క్రమ క్రమముగా సమస్యలన్నీ విడిపోయి అన్ని విషయములలోను అనుకూలత ఏర్పడుతుంది. అయితే ఈ నెలదాటేవరకు పెద్ద ప్రయత్నాలకు తలపెట్టవద్దు. అనుకూల ఫలములు వాటంతటవే ఒకదాని కొకటితోడయి కలసివచ్చును. భార్యామూలకంగా ధన వ్యయం జరుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును.

**మిథునం** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా)

మృగశిర 3, 4పా వారికి 10 - 20 తే.ల మధ్య శరీరశ్రమ, అలసట, త్రిప్పట, మనోవైకల్యం హెచ్చుగానుండును. ఏదోవిధంగా పనుమాత్రం కొనసాగిపోవును. అనుకోకుండా కుటుంబంలో అశాంతి కలుగును. దైవభక్తి పరమార్థ చింతనము హెచ్చును. విద్యార్థులకు, ఉద్యోగులకు, కర్షక, కార్మికులకు, వైద్యులకు కంట్రాక్టర్లకు, మొదలగు వారికి శ్రమతోకూడిన ఫలితము కలుగును.

ఆర్ద్ర వారికి నెలంతా మానసికవ్యథ, కుటుంబంలో కలతలు, నలతలు ఏర్పడును. అన్ని విషయములు అనుకూలంగాఉన్నా, ఏదో ఒక కారణముచే మనస్సు బాధ కలుగుచుండును. చివరి వారంలో భార్యకు అనారోగ్యంచేసి నిమ్మళించును. కుటుంబంలో అశాంతికలుగును. ఉద్యోగ విద్యా - వ్యాపార వ్యవసాయ రంగాలలో వారికి అధికశ్రమ, అల్పఫలం కలుగును. పదుగురిలో మాటగౌరవము, సంఘంలో పలుకుబడి పెరుగును.

పునర్వసు 1, 2, 3పా వారికి 11తే. నుండి నలత, శ్రమ, వ్యయప్రయాసలు కలుగును. మానసిక వ్యథకల్గును. సోదరులతో విరోధము కలుగును. శుభకార్యములకై ధనవ్యయం జరుగును. కుటుంబంలో మనఃస్పర్థలు కలుగును. ఆదాయమునకు మించిన వ్యయం జరుగును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. ఈ

నక్షత్రంగల వారందరికి శుభాశుభ మిశ్రమఫలం కలుగును. విద్యార్థులకు కొంతమేలుగా నుండును.

## కర్కాటకం (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా వారికి శరీరశ్రమ, నలత, త్రిప్పట మొదలగునవి కలిగినను, కార్యవిజయం, ధనలాభం కలుగును. ఇదివరకు నెరవేరని పనులు నెరవేరుట. బంధు మిత్రాముల ఆదరణము, కుటుంబంలో సుఖసంతోషములు కలుగును. ఉద్యోగములో మంచి అభివృద్ధి. విద్యార్థులకు అనుకూలత కలుగును. పత్రకులకు - కార్మిక, కర్షకులకు మొదలగు వారందరికి లాభదాయకముగా ఉండును. స్థిరవస్తు సంపాదనము కలుగును.

పుష్యమి వారికి 11 - 25తేల మధ్య శరీరంలో నలత, శ్రమ వేడిమి హెచ్చుగా ఉండును. అయినను ఇకపైనుండి అన్ని వ్యవహారములు మరుగ్గానే నెరవేరుచుండును. ఆత్మీయులయిన వారితో విరోధము కలుగును. దైవపుణ్య కార్యములలో పాల్గొనుట జరుగును. దైవభక్తి పరమార్థ చింతనము కలుగును. విద్యార్థులకు కొంతమేలుగా నుండును.

ఆశ్లేష వారికి ఇంకను కొన్నాళ్ళపాటు శరీరశ్రమా, త్రిప్పటా తప్పదు. ఆర్థికంగా వ్యయంహెచ్చుగా నుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలిగి వాయిదా పడును విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ప్లీడర్లకు మొదలగు వారందరికి మేలు కలుగును. కాని శ్రమహెచ్చుగా నుండును. నెలచివరలో కార్యవిఘ్నము, ఆన్నిచోట్ల వ్యతిరేకత, ఆర్థికపు చిక్కులు ఏర్పడి. మానసిక వ్యధ కలుగును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘ నక్షత్రం వారికి 9తే. వరకు శ్రమహెచ్చు. కుటుంబ వ్యవహారములు చక్కబడి, సమృద్ధిగా ధనము చేకూరును. పెద్దలతో స్నేహము, పరిచయముఏర్పడును సుఖభోగ విలాసములకై ఖర్చులు అధికంగా జరుగుచుండును. రాజకీయ వేత్తలకు, వైద్యవృత్తి వారికి మంచి అనుకూలమైన కాలము. గృహాది వ్యవహారములలో క్రయ విక్రయాదులలో మచింలాభము, విజయము, కలిగించును.

పుబ్బవారికి నెలంతా శరీరశ్రమ, ఉష్ణాధిక్యము, కార్యవిఘ్నము కలుగును భార్యకు అనారోగ్యం చేసి నిమ్మళించును. తలకుమించిన బాధ్యతలు, శక్తికిమించిన పనులు తలపెట్టుట వలన కొన్ని చిక్కుల నెదుర్కొన వలసి వచ్చును. చేసిన ప్రయత్నములకు అనుకొనని విఘ్నములు, తెలియకుండా వచ్చి, తెలియకుండానే తొలగిపోవును. శుభకార్య ప్రయత్నములు వాయిదా పడును, పత్రకులకు, వ్యవసాయ దారులకు మంచి అనుకూలముగానుండును. చిన్నచిన్న ఏక్సిడెంట్లు కూడా జరుగును.

ఉత్తర 1పా వారికి 28తే. వరకు శరీరశ్రమ, నలత మరింత హెచ్చు. ప్రతి పనిలోను విఘ్నములు కలిగినా, విజయము సిద్ధించును. బంధువుల వలన చిక్కులు ఏర్పడును. ఉద్యోగులకు అధికారుల వలన ఆదరము కల్గును. పత్రకులకు సామాన్యలాభము, ఆదాయమునకు మించిన వ్యయంజరుగును.అప్పటప్పటఆరోగ్యము భంగమగుచుండును. మొత్తంమీద శ్రమహెచ్చుగాను, సుఖము తక్కువగా నుండును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2. 3, 4పా వారికి బంధుమిత్రాదుల మూలకంగా ధన వ్యయంకలుగును. భార్యకు శరీరంలో నలతచేయును. సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి కలుగును. ఆర్థికపులోపం మాత్రం కలుగదు. వ్యవహారము లన్నింటిలోను మంచి అనుకూలత ఏర్పడును. ఉద్యోగులకు, విద్యార్థులకు, పత్రికులకు మొదలగు వారందరికి లాభదాయకముగా నుండును. మొత్తంమీద గతిమాసంకంటె కొంతమేలుగా నుండును. కాని శ్రమహెచ్చు, ఫలితం తక్కువ.

హస్త వారికి 9.దే వరకు శరీరంలో నలత, శ్రమ కలుగును బంధువిరోధం, మాటపట్టింపులు కలిగి మనస్సునకు ఖేదం కలిగించును. ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. కుటుంబంలో చిన్నచిన్న కలతలు, బంధువులరాక పోకల వలన ధనవ్యయం జరుగును. ఉద్యోగులకు, పత్రకులకు, కర్షక కార్మికులకు శ్రమకు తగిన ఫలితము కలుగును.

చిత్ర 1, 2పా. వారికి గతనెలనుండి ప్రారంభమైన శుభయోగము కొనసాగుటయేకాక బంధుమిత్రాదులతో సమావేశము, శుభ కార్యములలో పాల్గొనుట, తలచినపనులన్నియు సక్రమంగా నెరవేరుట జరుగును. విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అన్ని విధాల అభివృద్ధి కలుగును. పత్రకులకు, రాజకీయవేత్తలకు, కర్షక, కార్మికులకు, అన్ని విధాల కలసివచ్చును. 10-20తే.ల మధ్య శ్రమ, త్రిప్పట కలుగుచుండును.

## తుల (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

చిత్ర 3, 4పా. వారికి 10-20తే.ల మధ్య శరీరశ్రమ, మనః క్లేశం హెచ్చుగానుండును. శుభకార్యములు వాయిదాపడును. భార్యతో అభిప్రాయ భేదములు కలుగును బంధుమిత్రాదుల మూలకంగా ధన వ్యయము కలుగును. ఉద్యోగ వ్యవహారాలు సానుకూలమగును. మధ్య మధ్య చిన్న చిన్న ఏక్సిడెంట్లు కలిగి తొలగిపోవును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమ ఫలము కలుగును.

స్వాతి వారికి గతనెల ప్రారంభమైన ఒడుదుడుకులు ఈ నెలంతా కొనసాగును. ప్రతి పనికి ఆటంకములు కలుగును. అప్పట

ప్పట నలత చేయుచుండును. ధనవ్యయం అధికంగా జరుగును. దైవ పుణ్యకార్యములలో పాల్గొనుట జరుగును. విద్యార్థులు, ఉద్యోగులు, కార్మికులు, కర్షకులు మొదలగు వారందరికి మంచిమేలు - అభివృద్ధి కలుగును.

విశాఖ 1, 2, 3పా. వారికి 17తే. వరకు అన్నివిధాల అనుకూలంగాఉన్నా శరీరశ్రమ, ఖేదము హెచ్చుగానుండును. మధ్యమధ్య ఆరోగ్యభంగమును కలిగించి అలసటను, శ్రమను కలిగించును. వ్యవహారములన్నీ వాయిదాపడి, సమయానికి డబ్బుసర్దుబాటు కాక తొట్రుపాటు కలుగుచుండును. అనవసర వాగ్వాదాలు, మాటపట్టింపులు పెరిగి, స్థిమితం తక్కువగా నుండును. వైద్యులకు వ్యవసాయ దారులకు బాగుగా కలసివచ్చును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి 9తే. వరకు శ్రమ, నలత, కలుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును కుటుంబ సంసార సౌఖ్యం బాగుగా నుండును. శుభకార్యములలో పాల్గొనుట జరుగును. మంచి ఉత్సాహం, ధైర్యం కలుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు, కర్షక, కార్మికులకు మొదలగు వారందరికి లాభదాయకముగా నుండును.

అనూరాధ వారికి గతనెలనుండి కొంతలోకొంత శుభయోగం ప్రారంభమైనా శ్రమ, నలత, వేడిమిహెచ్చుగా నుండును. కుటుంబంలో కలతలు, నలతలు కలుగును ఖర్చులు మితిమీరుతున్నా తగిన ఆదాయం ఏర్పడుతుంది. అయితే మనోధైర్యంతో అన్ని చిక్కులను ఎదుర్కొని అధిగమించడానికి తగిన శక్తికలుగుతుంది. వీలయినంత వరకు మౌనంగా ఉండి, ఏ వ్యవహారములోను తలదూర్చకుండా ఉండడం చాలమంచిది. వైద్యులకు, వ్యవసాయదారులకు బాగుగా కలసి వచ్చును.

జ్యేష్ఠ వారికి నెలంతా శుభయోగం కలసిరాగలదు. నోటిమంచి వలన పనులను సాధించుకొని వస్తారు. గృహసువర్ణాది స్థిరవస్తు సంపాదనము కలుగును. అయితే సహవాసదోషంవల్ల కొంతవరకు వ్యసనములు తాత్కాలికంగా కలిగి తొలగిపోవును. అన్నీ అన్నివిధాల కలసివచ్చినా మనస్సునకు సంతృప్తి కలుగదు. సరికదా ఏదోఒకలోపం కనబడుతూ, ఏదో తప్పుచేసినట్లు మనస్సుకి అని పిస్తుంది. అయితే విద్యార్థులకు, ఉద్యోగులకు, వ్యవసాయ వ్యాపార రంగాలలో ఉన్నవారికి బాగుగా సంతృప్తి కలిగి సుఖసంతోషాలతో గడచును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మూలవారికి బంధువిరోధం కలుగును. శుభకార్య ప్రయత్నాలకు ఆటంకములు కలుగును శరీరంలోనలత, పనికిమాలిన ఆలోచనలు, ఆందోళనముకలుగును. మధ్యమధ్య ఆరోగ్య భంగమగుచుండును. మితిమీరిన ఖర్చులు పెరుగును. కుటుంబంలో కలతలు నలతలు జరుగును. ప్రతి విషయంలోను ఆందోళనము, అపనిందలు, అనుమానములు కలుగుచుండును. శనికి జపశాంతులు చేయించుట మంచిది

పూర్వాషాఢ వారికి ప్రతి విషయంలోను వ్యయ ప్రయాసలు కలుగును. శరీరంలో నలత, అధికవేడిమి హెచ్చుగానుండును. అన్ని పనులు ఎప్పుడెప్పుడు జరుగుతున్నట్లే అనిపించి, ఏ పని చివరకు జరుగక వెనుకకు వాయిదా పడును. ఆదాయమునకు మించిన వ్యయం జరుగుచుండును. అదే పనిగా మనస్సు పనికిమాలిన ఆలోచనలతో గడచును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు మంచి లాభదాయకముగా నుండును

ఉత్తరాషాఢ 1పా. వారికి ధనము బాగుగా కలసివచ్చును. వ్యాపార, వ్యవసాయ, ఉద్యోగ, విద్యా, వైద్యరంగాల్లో ఉన్న వారికి అన్నివిధాల మేలయిన కాలము. అప్పుడప్పుడు కొన్ని చిక్కులు ఎదురయినా, వాటిని అవలీలగా తొలగించుకొనుట జరుగును. కుటుంబంలో సుఖశాంతులు కలుగును. సంఘంలో మంచి పేరు ప్రతిష్టలు కలుగును. శుభకార్యముల మూలకంగా ధనవ్యయం జరుగును. మాతృవర్గం వారితో విరోధము కలుగును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ట 1, 2 పా.)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. శ్రమ హెచ్చుగా నుండును. స్థిరాస్తి క్రయ విక్రయాలు చేయడం జరుగును. శరీరశ్రమ, అలసట, త్రిప్పట హెచ్చుగా నుండును సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. గృహాది వ్యవహారాలు నెరవేరును. బంధుమిత్రుల ఆదరాభిమానాలు, ప్రజలలో, సంఘంలో, మాటపలుకుబడి పెరిగి వృద్ధియగును., ఉద్యోగులకు, విద్యార్థులకు అనుకూలమైన కాలము. ధనవ్యయం అధికంగా జరుగును.

శ్రవణం వారికి 9తే. వరకు శ్రమ, నలత కలుగును. ఆ పిమ్మట అన్నిరంగాలలో వారికి ప్రోత్సాహకరంగా ఉన్నా, కార్యసిద్ధి కోసం మిక్కిలిశ్రమ, ధనవ్యయం కలుగును. బడలిక, అలసట, శరీరంలో నలత హెచ్చుగానుండును. వ్యవహారములన్నీ సానుకూలమవుతాయి. రావలసిన డబ్బు సకాలంలో అందదు. ఉద్యోగులకు వర్తకులకు అనుకూలంగా ఉండును. కార్మికులకు శ్రమతో కూడిన లాభం కలిగినను వ్యయంమాత్రం అధికంగా జరుగును.

ధనిష్ట 1, 2పా. వారికి యోగము విషయంలో బాగుగా ఉన్నను. 10-20తే.ల మధ్య శ్రమ, భార్యకు నలత, ధనవ్యయం కలుగుచుండును. వ్యవహారములన్నీ పరిష్కారంకాగలవు. కుటుంబంలో సుఖశాంతులు, ఆర్థిక విషయాలలో విజయం, స్థిరాస్తి సంపాదన

ను. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. శుభకార్యములలో గ్గొనుట జరుగును. దైవభక్తి పరమార్థ చింతనము కలుగును.

**ంభం** (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ట 3, 4పా. వారికి అనుకూలమైన కాలము. కుటుంబ సారసౌఖ్యం, సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి కలుగును. రోగ్యం బాగుండును. ప్రతి విషయంలోను విజయం, కార్యసిద్ధి, త్సాహం, గౌరవ కలుగును. అయితే 10-20ల మధ్య శరీరశ్రమ హెచ్చు. విద్యార్థులకు, ఉద్యోగులకు, కార్మిక, కర్షక, వర్గాల వారంద రికి అన్ని విధాల మంచి ప్రోత్సాహకరంగా ఉండును.

శతభిషం వారికి 20తేనుండి చిక్కులు మరికొంత హెచ్చుగా నుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. లగ్గరి ఖర్చులు పెరుగును. బంధువుల మూలకంగా విపరీతమైన ధనవ్యయం కలుగును. మనస్సు వ్యసనాలకు దారితీయును అప్పటప్పట భార్యకు ఆరోగ్య భంగమగుచుండును. శారీరక - మానసికవ్యథ మనోవ్యాకులత్వం కలుగుచుండును. ప్రతి విషయంలోను అత్యధిక శ్రమా, ఖేదమూ తప్పదు.

పూర్వాభాద్ర 1. 2, 3పా. వారికి 11-26తే.ల మధ్య శరీర శ్రమహెచ్చుగా నుండును. మిగిలిన వ్యవహారములన్నీ అనుకూలంగా ఉండి, విజయమును కలిగించును. ధనాదాయము బాగుగానుండును. సువర్ణవస్త్రాభరణ ప్రాప్తి, పుణ్యకార్యాల్లో పాల్గొనడం జరుగును. పదుగురికి ఉపకారము చేయుట జరుగును. సంఘంలోమాట పలుకుబడి పెరుగును.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి ఉద్యోగవ్యవహారాలు కొంతమంద కొడిగా నుండును. శ్రమహెచ్చుగా ఉన్నా, తగిన ఫలితం ఉండును. శుభకార్యములలో పాల్గొనుట జరుగును. విలాసములకు బంధువుల నిమిత్తం అధికంగా డబ్బుఖర్చుపెట్టుట జరుగును, చివరకు బాధపడుట జరుగును. వర్తకులకు, కర్షకులకు, కార్మికులకు శ్రమతో కూడిన ఫలితం కలుగును. నెలమధ్యలో భార్యకు నలత చేయును.

ఉత్తరాభాద్ర వారికి ఉష్ణాధిక్యమూ, శ్రమా, బడలికా కలు గును ఆరోగ్యం లేకపోయినా, నలత చేసినట్లు ఉండును. అకారణ కోపం, పట్టుదల, చిరాకు హెచ్చుగా నుండును. చివరి వారంలో శ్రమ హెచ్చుగా నుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. ధనవ్యయం అధికంగా జరుగును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమముగానుండును.

రేవతి వారికి మానసికంగా, శారీరకంగా అశాంతి హెచ్చుగా నుండును. సహవాస వాతావరణ దోషంవలన స్వల్ప వ్యసనాలు పట్టు బడును. దర్జాఆడంబరాలకు, విలాసముల నిమిత్తము ఖర్చులు అధికంగా జరుగును. అయితే స్త్రీ మూలకంగాను, బంధుమిత్రాదుల రాకపోకల మూలకంగాను ధనవ్యయం జరుగును. ప్రతి విషయంలోను శ్రమ, అలసట. నిస్సత్తువ హెచ్చుగానుండును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

# సంయమనం

## శ్రీ వసంతరావు వేంకటరావు

ఇంద్రియాలోలున కెన్నెన్ని కోర్కెలో
పుట్టుచుండును జలమూరునట్లు,
కోర్కెలన్నియు తీరకుండుట సహజమే,
తీరనివెల్ల బాధించుచుండు
బాధ ద్వేషమ్ముగా పరివర్తనము చెందు,
ద్వేషము మనసు నుద్రేకపరచు,
ఉద్రేకమున బుద్ధి యుక్తిని కోల్పోయి
చెడుగా ప్రవర్తించి చేటు తెచ్చు;
ప్రతిభ ఛేదింపలేని ఈ వలయమందు
చిక్కుకొననేల? చిక్కి కృశింపనేల?
మూలమైనట్టి కోర్కెల మూలనాశ
నమున సిద్ధించు సుఖజీవనము సతమ్ము!

# ఎగిరిపోయిన కోకిల

## శ్రీ సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి

నువ్వో కోకిలవై
ఈ మోడువారిన వృక్షాలకు
నీ గానంతో చివురుల్ని పూయించావు.
ఈ వృక్షాల మొదళ్ళలో
నిక్షిప్తమై వున్న వసంతాల్ని
బైటకు చేదావు.
వసంతం కప్పుకున్న
వనాన్ని చూసి
తృప్తిగా అరచుకొంటూ
ఎటో ఎగిరిపోయావు.
నీ వెగిరేటప్పటి ఆ తాకిడి
మా గుండెల్ని బ్రద్దలు చేసిందమ్మా!
మా కొమ్మలమీద
నీవు విడిచి వెళ్ళిన గురుతు
మా మెదళ్ళను నొక్కి పట్టిందమ్మా!

నీ నవ్వుల్ని
మా గుండె గోడలకి
చెరగిపోని చిత్రాల్లా అలంకరించావు.
నీ మాటల్ని
మా స్మృతుల సరాల్లో
మెరిసే ముత్యాల్లా అమర్చావు.
నీ చూపుల
ఇంద్రధనుస్సు మీద
మమ్మల్ని ఊయెల లూపావు.
నీవొక
కరగిపోని అమృత గుళికవై
మా మెదళ్ళలో కూచున్నావు.
నిన్నెలా మరచగలమమ్మా?
నీవులేని యీ వనం
భావం తెలీని పద్యమే గదమ్మా!

("చిట్టితల్లి" అనసూయ స్మృతికి)

# నిష్క్రమణ

## దశశ్రీ

ఈ యేటి తీరానికి
దిగుల్లేదు
పోయే నీరు పోతూంటే
ధవళకాంతి ధగధగల్తో
వచ్చే నీరు లేదూ?
ఏ స్వప్నసీమలనో
పండించడానికి

నా మిత్రమ వెళ్ళిపోతూంటే
ఇఖాళ నేనేకాకి తీరాన్ని
దిగులు కేంద్రాన్ని-
ఏ మేఘమో ఒడిలో
రాలినప్పుడు మాత్రం
జ్ఞప్తికొస్తుంది చప్పున
నా ప్రియతమ మిత్రమ లాలన!

# చర్మవ్యాధులకు







## అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited** 

"త్రి"

# ప్రాచీన భారతవర్ష స్వరూపము

విష్ణుపురాణం భారతవర్ష స్వరూపాన్ని ఇట్లు వర్ణించింది. "ఉత్తరం యత్ సముద్రస్య, హిమాద్రేశ్చైవ దక్షిణం వర్షంతత్ భారతం నామ, భారతీ యత్రసంతతిః" సముద్రానికి ఉత్తరాన, హిమాద్రికి దక్షిణాన భారతవర్షముంది. అందు భారతీయులుంటారు. ఇది దాదాపు నేటి ఇండియాయే.

ప్రాచీన కావ్యాలలోనూ, జానపద కథలలోనూ భారతవర్షమందు "ఛప్పన్న" (అంటే హిందీలో 56) దేశాలున్నాయని చదువుతుంటాము. ఈ 56 దేశాలేవి? నాచనసోముడు "ఉత్తర హరివంశ"మున ఒక పద్యంలో వీనిని పేర్కొన్నాడు. అది సీసపద్యం. పద్యం నిండా దేశాల పేర్లే. వేరే పొల్లుమాట ఒక్కటైనా లేదు. ఆ పద్యాన్ని సంధులను విడదీసి పాదబద్ధంగా కాక, "లైను"గా ఇస్తున్నాను. (ఉ. హరివం, 3:142) 1. పాంచాల, 2. పాండ్య, 3. బర్బర, 4. కరాట, 5. ఆభీర, 6. కురు 7. విదేహ 8. విదర్భ, 9. కుకుర, 10. గౌళ, 11. గాంధార, 12. మగధ, 13. కొంకణ, 14. కళింద, 15. పుళింద, 16. సింధు, 17. సౌవీర, 18. ఆంధ్ర 19. చేర, 20. చోళ, 21. సాముద్ర సాళ్వ, 22. కోసల, 23. కళింగ, 24. కుళింగ(దః), 25. వత్స, 26. సౌ(సు)రాష్ట్ర, 27. అంగ, 28. వంగ, 29. మత్స్య, 30. శూ(సూ)రసేన, 31. సుధేష్ణ, 32. సుహ్మ, 33. ఆకాశ, 34. కరూశ, 35. లాట, 36. కర్ణాట, 37. మాళవ, 38. వరాట, 39. కుంతల, 40. అవంతి, 41. ఘూర్జర, 42. కుహ్మక, 43. త్రిగర్త. 44. బహుదాన, 45. యవన, 46. టేంకణ, 47. దశార్ణ, 48. పుండ్ర, 49. బాహ్లిక, 50. ద్రవిడ, 51. కాంభోజ, 52. హూణ, 53. కేకయ, 54. వసాతి, 55. కాశ్మీర, 56. కేరళములు. శబ్దరత్నాకరం (శ.ర) 56 దేశాల పేర్లిచ్చింది. ఇందులో ఉ. హరివం. లో లేని 22 దేశాల పేర్లు ఉన్నాయి. శ.ర. లో ప్రత్యేకంగా ఉన్న పేర్లు: కామరూప, వనవాస, గౌడ, భోట, శబర, మద్ర, సింహళ, పారశీక, హైహయ, తౌళవ, మిథిల, ప్రాగ్జ్యోతిష, చేది, నేపాళ, కన్యాకుబ్జ, ఖురసాణ, మహారాష్ట్ర, అహిచ్ఛత్ర, ప్రయాగ, కరహాటక, భోజ, కాశి.

* రెండు ఆకర గ్రంథాలలో 34 పేర్లు మాత్రమే సమానం.
* కొన్ని దేశాలు ఆనాడు భారతవర్షంలో వుండి వుండవచ్చును కానీ నేటి భారతదేశపు ఎల్లల అవతల వున్నవి.
  ఉదా : బాహ్లిక, గాంధార, కాంభోజ.
* ఆఫ్ఘనిస్తాన్‌నుండి ఇండోనీషియా వరకు గల భూభాగాన్ని "బృహద్భారతము" (గ్రేటర్ ఇండియా) అనడం కద్దు. ఏలన, ఇందు హైందవ ప్రభావం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది.
* కొన్ని దేశాలు భారత వర్షమందు ఎప్పుడూ భాగాలు కావు.
  ఉదా : ఖురసాణ, యవన, హూణ, పారశీక, సింహళ. సింహళ ఉత్తరభాగాన కల నేటి జాఫ్నాను తమిళులు "యార్పాళం" అనీ, తెలుగు కావ్యాలు "నేపాళం" అనీ అంటారు. ఈ నేపాళం, ఉత్తరంలో వుండే నేపాళమూ వేర్వేరని తెలియవలెను.
* పారశీకులు, యవనులు, హూణులు మన దేశ భాగాలని పాలించిరి కానీ వారి పేర్లతో దేశాలు భారతవర్షంలో లేవు.
* ఒక్కొక్క పట్టణమే ఒక దేశంగా చెలామణి అవుతుండేది. ఉదా: కాశి. ఈ లెక్కన 56 కాదుకదా 560 వరకు దేశాలుండి వుంటాయి. అయోధ్యరాజు హరిశ్చంద్రుడు కాశీలో తానెవరో చెప్పికొనవలసి వచ్చింది. అది అప్పటి రాజ్యాల "కమ్యూనికేషన్!" 1857లో మనవాళ్లు ఇంగ్లీషువారి చేతిలో ఓడిరంటే అందులో ఆశ్చర్యమేముంది?
* కొన్ని పేర్లు నేటికీ చెక్కుచెదరక నిల్చివున్నాయి. ఉదా: కాశ్మీర, వంగ, ఆంధ్ర (ఈ పేరు "ఐతరేయబ్రాహ్మణ"లో వున్నది), మహారాష్ట్ర, కర్ణాట(క), సింహళ, కంచి "ఒడ్యాణ" పట్టణం అని బౌద్ధ వాఙ్మయంలో వుంది. నేటి "బర్మ"కు నాడు "భర్మ" లేక "సువర్ణ భూమి" అని పేరు.
* కొన్ని దేశాలపేర్లు పోల్చలేకుండా వుంటున్నాయి. ఉదా: వసాతి, కుకుర, బహుదాన మొ॥.
* స్వాతంత్ర్యం తర్వాత ప్రాత పేర్లు తిరిగి వచ్చినవి. ఉదా: విదర్భ, సౌరాష్ట్ర, ఇవన్నీ పరిగణించి "భారత వర్ష"మనే దేశపటం వ్రాసినాను. (చూ. పటం) దీన్ని చూస్తే ప్రాచీన భారతవర్ష స్వరూపం కొంత తెలుస్తుంది.

భారతదేశం కర్మభూమి అని అంటారు. కురుక్షేత్రం (నాటి బ్రహ్మవర్త, నేటి హర్యాన)ను ధర్మక్షేత్రమని "గీత" అనింది. ధర్మక్షేత్రమనుటకంటె "యుద్ధక్షేత్ర" మనుటయే సమంజసం అని నేనను కొంటాను. భారతదేశ చరిత్రలో అతి కీలక యుద్ధాలన్నీ కురుక్షేత్ర-(పానిపట్-స్థానేశ్వర్) ప్రాంతాలలో జరిగినట్టివి. ఋగ్వేదంలోని దాశరాజ్ఞ యుద్ధం, పృథ్వీరాజ-మహమ్మదు ఘోరీల యుద్ధం, బాబరు-ఇబ్రహీం లోడీల యుద్ధం, అక్బరు-హీమూల యుద్ధం, మరాటాల-అహమ్మదుషా అబ్దాలీల యుద్ధం (తర్వాతివి మూడు పానిపట్టు యుద్ధాలు) ఇచటనే జరిగినవి. కురు పాండవుల యుద్ధం సరేసరి. దానికి కురుక్షేత్ర యుద్ధం అని పేరు. "కురుక్షేత్రం" అంటేనే భీకర యుద్ధానికి శబ్దప్రతీకగ చెలామణి అగుచున్నది. ఇంకా కొంచెం వాయవ్యానికి పోతే జీలం నదీతీరాన అలెగ్జాండరు - పౌరవుల యుద్ధం నడిచింది. యుద్ధాల కాటపట్టయిన బెల్జియం దేశాన్ని "కాక్ పిట్ అఫ్ యూరప్" అంటారు. అటులనే యుద్ధాల కాలవాలమైన కురుక్షేత్ర పరిసర ప్రాంతాన్ని "భారతదేశ కుక్కుటగర్త" మనవచ్చును. భారతవర్ష మందెన్ని "దేశా"లున్నా అన్నింటినీ కలిపి ఉంచింది "ధర్మం". "ఆసేతు శీతనగ", "కాశ్మీరునుండి కన్యాకుమారి", "గంగాస్నానం-తుంగాపానం", "కాశీ రామేశ్వరం", వంటి పదజాలం ప్రతి ఇండియన్ పెదవులపై వినబడుతుంది. నేపాళదేశంలోని గండకీ నదీతీరాన ఒకడు, తమిళనాడు తామ్రపర్ణి తీరాన ఒకడు జంబూద్వీపే, భరతఖండే, భరతవర్షే అంటూ సంకల్పం చదువుతుంటారు.

ఉపశ్రుతి: ఇద్దరు పార్కు బెంచిపై కూర్చొన్నారు. వారి సంభాషణ:

నీవు ఎవరిని అభిమానిస్తావు, బెంగాలీలనా?

"__"

గుజరాతీలనా?

"__"

పంజాబీలనా?

"__"

తమిళులనా?

"__"

మరి ఎవరిని అభిమానిస్తావు?

భారతీయులను.



# *మిథ్యాత్వ ప్రథనము

ఆంగ్లమూలము :
## సర్ వాల్టర్ రాలే

ఆంధ్రానువాదము :
## శ్రీ కోట సుందరరామశర్మ

1. జీవా, దేహాతిథి! నిను బంపెద
ధన్యవాదములులేని కృత్యమున,
సత్యమె నీ కధికార పత్రమగు;
ఎంతటి ఘనులైనను వెనుకాడకు.
నేనా పోవలె; నీవే జగతిని
మిథ్యాత్వమ్మును చాటిచెప్పవలె.

2. చివుకు కాష్ఠమటు మినుకుచుంటివని
రాచకొలువుతో హెచ్చరింపవలె:
మంచి చూపడమె కాని చేయడము
లేదని దేవళములతో ననవలె;
గుడి - రాకొలువులు బదులాడినచో
వాని అసత్యత విప్పి చెప్పవలె.

3. ఇతరుల కృతులే తమ "అహంకృతి"గ
బ్రతికెడి ప్రభుమానులతో ఇట్లను:
ఇచ్చి మెచ్చుకోల్ క్రయము సేతురని,
పక్షములగుటే బలమనుకొంద్రని.
ఆ ప్రభువులు ప్రతిపల్కబోవుచో
నిరూపింపు ప్రభుతానిస్సారత.

4. అస్తులపై అధికారము నెరపెడి
మహాధికృతులకు ఈ గతి దెల్పుము:
వారల ఆశయ మాశాదూషిత,
మాచరణము మాత్సర్యపూర్ణమని,
వారించుకయే బదులు వచించిన,
బైటపెట్టువారల వైతథ్యము.

5. దర్పదంభ దర్శకులకు చెప్పుము:
వెచ్చించుట యాచించుట కొరకని,
అతి వ్యయమ్ములవారు కోరునది
ఇతరులు తమపై కప్పెడు గొప్పని.
ఏదేని బదులాడినచో, వారల
'సర్వాబద్ధత' ప్రదర్శించు, పో.

6. ఉత్సాహానికి భక్తి లోపమని,
ప్రేమపేర రతిలోలత్వమ్మని,
కాలము కేవల గతిశీలమ్మని,
దేహమన్నచో వట్టి మట్టియని
పల్కుము, ప్రతిపల్కింపక, సత్యము
నిరూపింపవలసిన దీవే కద!

7. ఆయువు దైనందిన క్షయమ్మని
గౌరవించుటలు తిరమ్ము కావని,
అందచందములు ప్రేలుడుమందని,
మక్కువయన్నది మొగ్గలు కలదని,
పల్కు; బదులు ప్రయతించినచో, ప్రతి
దానికి మిథ్యాత్వము రూపింపుము.

8. చదువులు వాదమ్ముల వాగురలని,
స్తనశల్య పరీక్షల లోగిలిగింతని,
జిగీషకలదై మనిష తానే
స్వరచిత పాశాబద్ధమ్మగునని
చెప్పుము. వాదుకు వచ్చినయప్పుడు
వాని మిథ్యనే ప్రతిభాసింపుము.

9. వైద్యకమన్నది సాహసికమ్మని,
కుశలత చిక్కులదరికి రామి యని,
దానము పేరిట హృదయ విలోపము,
ధర్మశాస్త్రముల వాగ్వివాదములు,
కలవని వచింపు; కాదన నందలి
'అభూతార్థము'ను అవతారింపుము.

10. అదృష్ట దేవత కంధప్రాయత,
ప్రకృతిమాతకో జరత్స్వరూపత,
మిత్రత్వమ్మున కరుణాశూన్యత,
న్యాయాలయముల నతివిలంబితయు
కలవను; మింకను ప్రతివచించుచో
అన్నింటను గల అబద్ధమేర్పుము.

11. అభిరుచి మారిన విలువలు మారెడి
కళలకు స్వతో గభీరత కలదే!
బాహ్యరూపమే ఆధారమ్మగు
బుద్ధివాదముల ప్రతిష్ఠ యేదీ?
లేదని అను; కాదని ఎదిరించిన
వాని పునాదులె కదలిచి పెట్టుము.

12. నగరులు శ్రద్ధను బహిష్కరించుట,
జనపదములు కుపథమ్ములు పట్టుట,
పురుషత్వము తా దయ దిగనాడుట,
శీలము పేరిట శుష్కత ఎచ్చుట,
ప్రకటింపుము, కాదని అనబోయిన
మిథ్యను చాటింపగ వెనుకాడకు.

13. నా శాసించిన విధమున సత్య-
ప్రకటన కొరకే వక్కాణించిన
నీపై నెవరే నాగ్రహం పడుచు
కత్తి దూయుచో, భళీ దూయనీ;
ఆత్మకు శస్త్రచ్ఛేదన కలదే!
"నైనం ఛినత్తి శస్త్ర"మ్మని కద!

* సార్వకాలికమైన మానవ మనోజీవన స్వభావాన్ని చిత్రించే చిన్న కవిత.

—అనువక్త



# స్పందన

## శ్రీ కె. దినకర్

నీ కళ్ళు కలల గులాబీ ముళ్ళై
నా గుండెలో గుచ్చుకొన్నప్పుడు
అదృశ్యంగా స్రవించిన ప్రతి రక్తబిందువు
ఆనందతీరాల్ని స్పృశించిన రససింధువు
నీ కొనచూపుల కొరడాలు ఝళిపించి
నా భావ జవనాశ్వాల్ని పరుగులెత్తించి
వేదనాసౌధాగ్రాన నిరంతరం నివసించే నాకు
నీరవ స్వప్న సంగీతాన్ని
నిశ్శబ్ద సౌందర్య గీతాన్ని
ఒక నిమిషం వినిపించి
అదృశ్యమయ్యావు అకస్మాత్తుగా
మొదలయింది ఆ క్షణం తుదిలేని నా నిరీక్షణం
మదిగది గవాక్షంనుంచి అంతరిక్షంలోకి గవేషణం
ఏ గాలి పెదవులు నీ మూగరాగాలు వినిపిస్తాయోనని-
ఏ నీలి గగనాలలో నీ నయన దీప్తులు కనిపిస్తాయోనని-



శ్రీ తిరుమల రామచంద్ర

# తెలుగు-ప్రాకృతాల సంబంధాలు

ఇంగ్లాండులో ఒక వ్యాపారసంస్థ డిక్టాఫోనను కనిపెట్టింది. దానికి ప్రారంభోత్సవం చేయడానికి ఎవరిని ఆహ్వానిద్దామా అని ఆ సంస్థ నిర్వాహకులు చాలకాలం ఆలోచించి మహాపండితుడైన మాక్స్ ముల్లర్‌ను ఆహ్వానించారు. ఆయన దానిని

"అగ్ని మీళే పురోహితమ్
యజ్ఞస్యదేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్."

(యజ్ఞానికి పురోహితుడు, అధిదేవత, ఋత్విక్కు, హోత, యజ్ఞఫలధారి అయిన అగ్నిని స్తుతిస్తున్నాను.) అనే ఋక్కును పఠించి ఆవిష్కరించాడు. "ఇదేమిటి చాందసం! ఏదో పెద్దమనిషి అని పిలిస్తే ఖానిసల భాషాపద్యాన్ని, అదిన్నీ చచ్చిన భాషాపద్యాన్ని చదువుతున్నాడే!!"— అని నిర్వాహకులు సణుక్కున్నారు. అది గ్రహించిన మాక్స్ ముల్లర్ పండితుడు "దిస్ ఇజ్ ది ఫస్ట్ ఫొయెటిక్ అట్టరెన్స్ ఆఫ్ ది వైట్ రేస్" అని వివరించాడు. అతడు ఫస్ట్ పొయెటిక్ అట్టరెన్స్ ఆఫ్ ద వైట్ రేస్ అని అన్నాడుగాని, నేను తొలిసారిగా విచ్చుతున్న మానవజాతి కవితా కంఠం-అని చెబుతాను.

అగ్నిమీళే పురోహితమ్- ఋగ్వేదంలోని తొలి ఋక్కు. ఇంతటి పరిష్కృత భాషాగీతం, గాయత్రీ ఛందోలంకృతమైన గీతం పిడుగు పడ్డట్టుగా ఆకాశంనుంచి పడదు. కొన్నివేల సంవత్సరాల పరిష్కార పరిశ్రమతో రూపొంది ఉంటుంది; ప్రకృతులనుంచి, ప్రజలనుంచి ప్రాదుర్భవించి ఉంటుంది; ప్రకృతుల నోళ్ళలో రాపాడి రాపాడి పరిష్కృతమై, సంస్కృతమైన భాషనుంచి పొటమరించి ఉంటుంది. సుసంస్కృతమైన భాష ఉన్నతవర్గాల సొమ్మై, కాలం మారినా ఎంతమాత్రమూ పొల్లుపోక అష్టదిగ్బంధాలతో రక్షితమవుతూ రాగా, దీనికి మూలమైన, తల్లి వేరైన ప్రకృతుల భాష—ప్రాకృతభాష పిల్ల కాలువలను, ఏళ్ళను కలుపుకుంటూ, ఎప్పటికప్పుడు కాలంతోపాటు, ప్రజల అలవాట్లు, అనుభవాలతోపాటు మారుతూ విస్తరించింది.

ప్రాకృతం అనగానే నాకు ఉత్తరధ్రువ సమీపంలోని లట్వియా నార్వే స్వీడన్‌లనుంచి అటు తూర్పుగా రష్యా సైబేరియాల మీదుగా వాల్టివాస్టోక్ వరకు, ఇటు దక్షిణాన జర్మనీ, ఇటలీ, టర్కీ భారతదేశాల మీదుగా ఆగ్నేయాసియా దేశాలవరకు ఒకప్పుడు అఖండంగా వ్యాపించిన గొప్ప భాష సాక్షాత్కరిస్తుంది. ఆ భాషలో నేటి స్లావ్ భాషల పూర్వ స్వరూపాలు మొదటిదశ కాగా, ఆగ్నేయాసియా దేశభాషల పూర్వస్వరూపాలు చివరి దశగా భావిస్తున్నాను. హిట్టైట్ ప్రాచీనభాష ప్రాచీన ప్రాకృతభాషా పూర్వదశ ప్రథమావశేషంగాను, రష్యన్ భాషను పూర్వదశాంతి మావశేషంగాను భావిస్తున్నాను. ఇది ప్రజలభాష, ప్రజల నిత్య వ్యవహారభాష, ప్రజల ప్రేమభాష, ప్రజల కష్టసుఖాల భాష. ఇదే ప్రకృతుల—ప్రాకృతుల భాష, ప్రాకృతభాష.

సంస్కృతం అపభ్రష్టమై ప్రాకృతమైందని హేమచంద్రాది ప్రాచీనులు కొందరు, గ్రియర్సన్, సునీతికుమార చటర్జీ మహాశయాద్యర్వాచీనులు కొందరు భావించడంవల్ల అపసిద్ధాంతాలు పుట్టాయి. కాని, ఇంతకుముందే అన్నట్టు మానవజాతి తొలి ఛందోరూపమయిన ఋగ్వేదంతో ప్రాకృత భాషారూపాలు కానరావడంవల్ల ఋగ్వేదభాష కన్నా కొంత భిన్నమూ, అపరిష్కృతమూ అయిన భాష ఒకటి ఉండి ఉంటుందని, అదే ప్రాకృతమని లేక ప్రాకృత మూలమని భావించవచ్చు. ఋగ్వేదంలో చేరిన ప్రాకృత భాషారూపాలను కొన్నిటిని తెలియజేస్తాను.

వైదికభాషలో నేటి ప్రాకృత భాషారూపాలు కనిపించడం ఎవరికైనా ఆశ్చర్యకరమే. ప్రాకృత ప్రత్యయాలు సంస్కర్తల కనులుగప్పి సుసంస్కృతమైన భాషలో ఎలా మిగిలిపోయాయో! దీనినిబట్టి ప్రాకృతమో, తత్తుల్యమో అయిన భాష వైదికభాషకు మూలమై ఉండాలని అనుమానించవలసి వస్తున్నది. అటువంటి స్వరూపాలు కొన్నిటిని పరిశీలిద్దాం.

ప్రాకృత పదాలలో పదాది ఋకారం లు ప్తమౌతుంది: బృంద బంద; మృగ—మగ, మిగి, ఋతు—ఉడూ; పృధ్వీ—పుహవీ; వైదిక భాషలోను ఇలాటి ఋలు ప్తరూపాలు కనిపిస్తాయి: కృత—ఖుధ (ఋ. 1-48. 4.)

ప్రాకృత పదాలలో ద్విత్వాక్షరాలు దీర్ఘాలవుతాయి: దుర్లభ-దూలభ; విశ్రమ-విశామ; స్పర్శ-పాస. వైదిక భాషలోను ఇలాటి వైరూప్యం కనిపిస్తుంది: దుర్లభ-దూలభ (ఋ 4.9.9.); దుర్ణాశ-దూణాశ (శు.య.ప్రా. 3.45).

ప్రాకృతంలో అంతిమ వ్యంజన లోపం కనిపిస్తుంది: తావత్-తావ; యావత్-జావ వైదిక భాషలోను ఇలాటిది ఉంది: పశ్చాత్-పశ్చా; (అథర్వ సంహిత. 10.4.11); ఉచ్చాత్-ఉచ్చా (తైత్తిరీయ సంహిత. 2,3.14); నీచాత్-నిచా (అదే.1.2.14).

సంయుక్తాక్షరాలలో రేఫ యకార లోపం ప్రాకృతాలలో ఉంది. ప్రగల్భ-పగల్భ; శ్యామా-సామా. వైదికభాషలోను ఈ లోపం కనిపిస్తుంది: అప్రగల్భ-అపగల్భ (తై.సం. 4 5.6 1); త్ర్యృచ-త్రిచ (శతపథబ్రా. 1, 3.3.3.3.)

సంయుక్త పదాలలో పూర్వ దీర్ఘ వర్ణం ప్రాకృతంలో హ్రస్వమవుతుంది: పాత్ర-పత్త; రాత్రి-రత్తి; సాధ్య-సజ్జ. ఈ పద్ధతి వైదికభాషలోను ఉంది: రోదసీప్రా-రోదసిప్ర (ఋ.10.88.10); అమాత్ర-అమత్ర (ఋ. 9.66.4).

ప్రాకృతంలో దకారం ఢకారంగా మారుతుంది ఒకొక్కప్పుడు. దణ్డ-ఢణ్డ; దంస-డంస; దోలా-డోలా. వైదిక భాషలోను ఈ మార్పు అక్కడక్కడ కనిపిస్తుంది. దుర్దభ-దూడభ (వాజసనేయ సంహిత. 3.36); పురోదాస-పురోడాశ శుక్ల.య.ప్రా. 3.44)

ప్రాకృతంలో ధ హ గా మారుతుంది: బధిర-బహిర; వ్యాధ-వాహ. వైదికభాషలోను ఇది క్వాచిత్కంగా ఉంది: ప్రతిసంధాయ-ప్రతి సంహాయ (గోపథ బ్రాహ్మణం 2.4).

ప్రాకృతంలో సంయుక్త వ్యంజనంలో స్వరం ప్రవేశించడం ఉచ్చారణ సౌలభ్యం కోసం ఏర్పడింది: క్లిష్ట-కిలిట్ఠ; తన్వీ-తణఈ. వైదికభాషలోను ఈ పద్ధతి ఉంది: సహస్ర్యః-సహస్రియః స్వర్గ-సువర్గ (తై.సం. 4.2.3); తన్వః-తనువః; స్వః-సువః (తై. ఆద్యకం. 7.22.1, 6.3 7.)

ప్రాకృతంలో అకారాంత పుల్లింగ ప్రథమైక వచనం ఓకారం కావడం సహజం: దేవో, రామో, సో. వైదికభాషలోను ఈ ఓ అంత ప్రయోగం కనిపిస్తుంది: సంవత్సరో అజాయత (ఋ. 10.190.2); సోచిత్ (ఋ. 1.91.10,11)

ప్రాకృతంలో తృతీయా బహువచనం ఇహి ప్రత్యయం చేరి దేవేహి, గంభీరేహి, జేట్ఠేహి అని అవుతుంది. వైదికభాషలోను ఇలాటి రూపాలున్నాయి: అనురూపదేవేభిః, గంభీరేభిః, జ్యేష్ఠేభిః, భద్రం కర్ణేభిః మొదలయినవి.

ప్రాకృతంలో చతుర్థీ విభక్తికి షష్ఠీ విభక్తి రావడం తరచుగ కనిపిస్తుంది. వైదిక భాషలోను ఇలాటిది వున్నట్టు పాణిని సూత్రమే సాక్షి: చతుర్థ్యర్థే బహులం ఛందసి (అష్టాధ్యాయి. 2.3.62)

ప్రాకృతంలో పంచమీ విభక్త్యేకవచనంలో చివరి హల్లు లోపిస్తుంది: దేవాత్-దేవా; ఉచ్చాత్-ఉచ్చా; రామాత్-రామా. వైదిక భాషలోను ఇలాటి లోపం కనిపిస్తుంది: ఉచ్చా, నీచా, పశ్చా.

ప్రాకృతంలో ద్వివచనం లేదు. దానికిమారు బహువచనమే ప్రయుక్తమౌతుంది, దేవా, హరీ. వైదికభాషలోను ద్వివచనానికిమారు కొన్నిచోట్ల బహువచనమే కనిపిస్తుంది: ఇన్ద్రా వరుణౌ-ఇన్ద్రావరుణాః; మిత్రా వరుణౌ-మిత్రావరుణాః; దివి స్పృశా అశ్వినౌ-దివి స్పృశా అశ్వినాః[1]

పై పరిశీలననుబట్టి ప్రాకృతం వ్యాప్తంగా ఉన్నదని, అదే సంస్కరింపబడి సంస్కృతమైందని స్పష్టంగా చెప్పవచ్చు. ప్రాకృతం విశాల ప్రాంతంలో విస్తరించిన భాష. దీనినిబట్టి సంస్కృత ప్రాకృతాలకు ఏవిధంగాను పరస్పరం జన్యజనక సంబంధం లేదని, రెండూ ఒక పూవు రెండు రేకులని – కాదు కాదు. ఒక రేవు రెండు పార్శ్వాలని, ఒక నాణెం రెండు పక్కలని, ఒక కత్తి రెండు వాదులని నేను భావిస్తున్నాను. ఛందోబద్ధమైన భాష కొంతకు కొంత పరిష్కృతమూ, ప్రయత్నసాధితమూ, సుందరమూ కావడంవల్ల ఋగ్వేద సంస్కృతం పై వర్గాల భాష అయి, క్రింది వర్గాల సామాన్య వ్యవహార భాష దానికి కొంత భిన్నంగా ఉన్నా, చాల సన్నిహితమయి ఉండినదని చెప్పవచ్చు. దీనికి జైన బౌద్ధ గ్రంథాలు ఉదాహరణలు. ఇవి సంస్కృతభాషకు చాల సన్నిహితంగా ఉన్నందున సామాన్య సంస్కారంతో సంస్కృతమవుతాయి. ధమ్మపదంలోని సాహితీ ప్రాకృతభాష సంస్కృతభాషకు ఎంత సన్నిహితమో గమనించండి:

"అభిత్థరేత కల్లాణే పాపా చిత్తం నివారయే,
దన్దం హి కరోతోపుఞ్ఞం పాపస్మిం రమతే మనో,[2]
దీని సంస్కృతచ్ఛాయ ఇది:–
అభిత్వరేత కల్యాణే పాపాత్ చిత్తం నివారయేత్,
తన్ద్రాం హికుర్వతః పుణ్యం పాపే రమతే మనః.

(మానవుడు సత్కార్యాచరణ విషయంలో త్వరపడాలి. పాప కార్యాలనుంచి మనస్సును మరలించుకోవాలి. ఈ విషయంలో ఆలసిస్తే పుణ్యం, మనస్సు పాపలగ్న మవుతాయి.)

ఈ విధంగానే జైనాగమ సాహిత్యంలో ప్రాచీనతమమైన ఆయారాంగసుత్తంలోని రెండు వాక్యాలు చూడండి:

"నత్థి కాలస్స నాగమో – సవ్వే పాణా పిఆఉఆ, సుహసాఆ, దుక్ఖపడికూలా, అప్పి ఆసహా, పిఅ జీవినో, జీవిఉకామా. సవ్వేసిం జీవి అం పిఅం.[3]

దీని సంస్కృతచ్ఛాయ ఇది :

నాస్తి కాలస్య అనాగమః సర్వే ప్రాణాః ప్రియాయుషః, సుఖ సాధాః, దుఃప్రతికూలాః, అప్రియసహాః, ప్రియజీవినో, జీవితు కామాః. సర్వేషాం జీవితం ప్రియమ్.

(మృత్యువు రాదు అని అనలేము. ప్రాణులన్నీ సంతోషమే కోరుతాయి; సుఖం కోసం ప్రయత్నిస్తాయి; దుఃఖాన్ని ఇష్టపడవు; అప్రియాన్ని సహిస్తాయి; జీవితాన్ని ఇష్టపడతాయి; జీవింపగోరు తాయి. ఎందుకంటే, అందరికీ జీవితం ప్రియమైంది గనుక.)

ఈ ఉదాహరణాలనుబట్టి వివిధ ప్రాంతాలలో వివిధ రూపా లలో ఉన్న ప్రజాభాష అయిన ప్రాకృతాన్ని సంస్కరించి సంస్కృ తంగా రూపొందించారనడం స్పష్టం. నేటి ఉత్తరధ్రువ ప్రాంతాల భాషలను కొద్దిగా సంస్కరించినా, ఒక విధమైన సంస్కృతాలవు తాయి. ఈ సంస్కారం వేదాల ఆవిర్భావానికి ముందే ఎన్నో వేల యేళ్ళనాడే జరిగింది. ఆ ప్రయత్నంలో ఒక ఘట్టి జెండ్ అవెస్థా.

కాని, భాష—ఏ భాష అయినా ప్రవాహిని గనుక సంస్కరింప బడిన ఈ సంస్కృతభాష కూడ జనం ముఖయంత్రంలో పడి మారక తప్పలేదు. భాషను పొల్లుపోకుండా కాపాడుకోవాలని నేడున్నట్లే, ఆనాడూ వైయాకరణులు తాపత్రయపడ్డారు. అందువల్ల వైదిక సాహిత్యంలోని ఋక్కులకు, పనసలకు పద ఘనజటాది బందో బస్తులు, ఉచ్చారణ రక్షణకు ప్రాతిశాఖ్యలు పుట్టాయి. కాలక్రమాన వైదికభాష కేవలం కర్మకాండ భాష కావడంవల్ల అర్థనిరూపణకు నిరుక్తాది నిఘంటువులు పుట్టాయి; శిక్షాదులు పుట్టాయి. "వ్యాకరణం వేదాల రక్షణకు చదవాలి. లోపాగమ వర్ణవికారజ్ఞుడే వేదాలను రక్షించగలడు." అని పతంజలి హితవు.[4] పాణిన్యాచార్యుడు కూడ "వేదేలోకే" అని విడదీయడంవల్ల సాహిత్యభాష లౌకికభాష వేరు వేరయినట్లు స్పష్టపడుతుంది.

మేధావుల మేల్మి భాషకు పోక తథాగతుడు మహావీరుడు తమ తమ ప్రాంతాల వ్యవహారభాషలో ధర్మోపన్యాసాలు చేశారు. బుద్ధుడు ప్రచారం చేసిన భాషను బౌద్ధత్రిపిటకాల భాషను పాళీభాష అన్నారు. పాళీ పదానికి పర్యాయం, మూలపాఠం, బుద్ధవచనం అని బుద్ధ ఘోషుడు అర్థం చెప్పాడు. బుద్ధుడు ధర్మప్రచార పర్యటన చేసింది మగధరాజ్యంలో. దాని రాజధాని పాటలీపుత్రం. బుద్ధుని ధర్మ ప్రబోధ భాష పాటలీపుత్ర పరిసరభాష గనుక, పాటలీ క్రమంగా పాళీ అయిందని నా విశ్వాసం.

ఈ విస్తృతభాషకు ప్రాకృతమనే వ్యవహారం ఎప్పుడు వచ్చిందో చెప్పడం కష్టం. ఇది ప్రాంతాలనుబట్టి వివిధ రూపాలతో పాటు వివిధ నామధేయాలు పొందింది. మధ్య ఆసియాలోని భోటాన్ మున్నగు ప్రాంతాల సంబంధంతో చూళిక అయింది;[5] తర్వాత గాంధార బెలూచిస్తాన్‌లలో పైశాచి అయింది; మగధ సామ్రాజ్యంలో మాగధి అయింది. నేటి మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, మధ్య ప్రదేశ్‌లలోని అంచుప్రాంతాలు, ఆంధ్ర కర్ణాటకాల ఉత్తర ప్రాంతాలు కలిగిన విశాల మహారాష్ట్రంలో మహారాష్ట్రి అయింది.[6] ఈ మార్పులను గుర్తించి ఆయా ప్రాంతాల భాష పాత్రోచితమనే దృష్టిగల భరతాచార్యుడు ప్రాకృతం అనే మాటను మొదటిసారిగా పేర్కొన్నాడు. ఇతడు ప్రాకృత భాషలను మాగధీ, అవంతికా, ప్రాచ్యా శౌరసేనీ, అర్ధమాగధీ, బాహ్లీకా, దాక్షిణాత్యా అని ఏడుగా వింగడించాడు.[7] ప్రకృతుల—ప్రజల భాష అని అతని ఉద్దేశమై ఉంటుంది. కాని అతడు తత్సమ తద్భవాది విభజన చేయలేదు. భరతుని తర్వాత క్రీస్తుశకం రెండవ శతాబ్దివాడయిన చండుడు తన ప్రాకృత లక్షణమ్ అనే వ్యాకరణంలో భరతునిలాగే ప్రాకృతోత్పత్తిని గురించి చర్చించలేదు. కాని వర్ణాగమ వర్ణలోపాలు సూచించడంవల్ల సంస్కృతమే మూలమని వీరిద్దరూ భావించినట్టు తోస్తుంది.[8]

ప్రాచీనులలో 7వ శతాబ్ది వాడయిన రాజశేఖరుడు ప్రాకృతం నుంచే సంస్కృతం పుట్టిందంటాడు. అతడు తన పాత్రలలో ఒక దానితోఇలా చెప్పించాడు:

"యద్యోనిః కిల సంస్కృతస్య సుదృశాం జిహ్వాసు యన్మోదతే
యత్ర శ్రోత్ర • కటుః
భాషాక్షరాణాం రసః,
గద్యం చూర్ణ పదం పదం రతిపతేః తత్ప్రాకృతం యద్వచః
తాన్ లాటాన్ లలితాంగి పశ్య నుదతీ దృష్టే ర్నిమేష వ్రతమ్."

ఓ లలితాంగీ లాటదేశీయులను కళ్ళు రెప్పార్పకుండా చూడు. వారి భాష ప్రాకృతం. అది సంస్కృతభాషకు మూలమైనట్టిది. ఎప్పుడూ మహిళల నాలుకపై నాట్యమాడేది.

రతిపతికి స్థానమైనది—అని లాటదేశీయుల భాషను పొగిడాడు. ఈలాటి దేశం మన దేశంలోని ప్రాంతం కాదని, ఉత్తరధ్రువ సమీపంలోని లట్వియా మున్నగు దేశాలని నా అభిప్రాయం.

ఇలాగే 9వ శతాబ్దివాడయిన వాక్పతిరాజు తన గౌడవహో కావ్యంలో ప్రాకృతాన్ని తొలిభాషగా ఇలా వర్ణించాడు:

"సఅ లాఓ ఇయం వాఆ
విసంతి విత్తోయ వాయావో,
ఏంతి సముద్దం చిఅ
నేంతి స ఆలా వోచ్చయ జలాఇ."

అన్ని భాషలూ ప్రాకృత భాషలో ప్రవేశిస్తాయి. దానినుంచే అన్ని భాషలూ పుట్టాయి. నీరు సముద్రంలో చేరుతాయి. సముద్రంనుంచి ఆవిరై పోయి మళ్ళీ నీళ్ళవుతాయి.

రుద్రట రచిత కావ్యాలంకారః'నువ్యాఖ్యానించిన నమి సాధువు కూడ వాక్పతి రాజులాగే అన్నాడు:- "సకల జగజ్జంతువులకు వ్యాకరణాది సంస్కారంలేని సహజ వ్యాపారం ప్రకృతి, దానివల్ల కలిగినది గాని, అదిగాని ప్రాకృతమ్. ప్రాకృతం పసిపిల్లలకూ మహిళలకూ సుబోధమయింది. సకలభాషా నిబంధభూతమైన పలుకు. అది మేఘాలనుంచి పడిన నీరువంటిది. అది దేశ విశేషాన్ని బట్టి, సంస్కారాదులనుబట్టి విశిష్టతను పొంది, సంస్కృతాదులుగా తర్వాత విభేదాలు పొందుతుంది."[9] నమిసాధువు నిర్వచనం ఎంతో చక్కగా ఉంది. ప్రాకృతం ప్రజా సహజ భాష. సంస్కారం పొంది తర్వాత మారుతుంది.

కాని, తర్వాతివారు "సంస్కృతం ప్రకృతి; దానినుంచి పుట్టింది ప్రాకృతమ్. ప్రాకృత భాషకు సంస్కృత శబ్దం ప్రకృతి." అని విపరీత వ్యుత్పత్తి కల్పించారు.[10]

వివిధ వ్యవహారాలవల్ల, జైన బౌద్ధమత ప్రచారంవల్ల ప్రాకృతానికి ప్రజలలో ఆదరం కలిగి విశేష సంబంధం ఏర్పడడం వల్ల స్థానిక ప్రజల భాషల పదాలు కూడ ప్రాకృతంలో చేరుతూ వచ్చాయి; ఉత్తర దక్షిణా పథాలలోను, ఇతరత్రాను అలాటివాటిని తెలుసుకోడం; వాటి అర్థాలు స్పష్టంగా గ్రహించడం అవసరమైంది. ఏది ప్రాకృతమో, ఏది స్థానిక దేశ్యమో వింగడించ వీలులేనంతగా ప్రాకృతం విస్తరించింది. దానివల్ల అర్థ నిర్ణయంలోను సంశయం ఏర్పడింది. ఈ అర్థ నిర్ణయాదుల కోసం-ప్రాకృతం సంస్కృతభవ మని భావించిన, 11వ శతాబ్ది వాడయిన, హేమచంద్రాచార్యుడు తత్సమ, తద్భవ, దేశ్యపదాలనే విభజన తొలిసారిగా చేశాడు - సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనంలో.[11] హేమచంద్రాచార్యునికి ముందే ప్రాకృత కావ్య వాఖ్యాతలయిన కులబాలదేవ ధనపాలాదులు ప్రాకృత భాషాపదాలు కాని వాటిని "ఇతిదేశీ" అని సూచించారు. కొందరు దేశీ పదకోశాధికారః అనే పేర చిన్న చిన్న పదసూచికలు వ్రాశారు. అవేవీ సరిగా లేవని హేమచంద్రాచార్యుడు దేశీనామ మాలా అనే నిఘంటువునే వ్రాశాడు.

"దేశీ దుస్సందర్భా
ప్రాయః సం దర్భితాపి దుర్బోధా,
ఆచార్య హేమచంద్రః
తత్రాం సంద్ర భతి విభజతి చ."[12]

దేశీ పదాలను అన్వయించడం కష్టం. అన్వయించినా అర్థం చేసుకోడం మరొక కష్టం. ఆచార్య హేమచంద్రుడు అన్వయించి సుబోధం చేస్తాడు - అని నిఘంటు ప్రారంభంలోనే హేమచంద్రుడు ప్రతిజ్ఞ చేశాడు హేమచంద్రుని అనుసరించే 12-13 శతాబ్దివాడయిన త్రివిక్రముడు తన ప్రాకృతశబ్దాను శాసనవృత్తి పీఠికలో ఆ పద్ధతినే భాషా విశ్లేషణ చేశాడు-తత్సమ, తద్భవ, దేశ్యమని.

కన్నడ లక్షణ గ్రంథాలు తెలుగు లక్షణ గ్రంథాలకన్నా ముందుగా వెలశాయి. 9వ శతాబ్ది వాడయిన నృపతుంగుడు తత్సమ దేశ్యాలు చెప్పకపోయినా, తద్భవ పరిచ్ఛేదంలో సమసంస్కృత కావ్యాలని, దేశీ కావ్యాలని కావ్యవిభజన చేశాడు. సమసంస్కృత పదాలకు దేశీపదాలకు సమాసం చెల్లదన్నాడు.[13]

ప్రాకృత వ్యాకరణాలను అనుసరించే తెలుగు వ్యాకర్తలు భాషను తత్సమ, తద్భవ, దేశ్య అని విభజించారు. ఈ విభజనను చేసిన తొలి తెలుగు వ్యాకర్త కేతన, ఇతడు ఈ మూడు వర్గాలనే కాక అచ్చతెనుగు, గ్రామ్యం అని రెండు వర్గాలు అదనంగా చేర్చాడు. కాని, తత్సమం తక్క తక్కిన నాలుగూ అచ్చతెనుగే అన్నాడు— పంచపాండవులంటే మంచం కోళ్ళలాగ అన్న సామెతగా. అచ్చతెనుగు అనే పదాన్ని తనకు దాదాపు సమకాలికుడైన కన్నడ వ్యాకర్త కేశి రాజు రచించిన శబ్దమణి దర్పణంలోని అపభ్రంశ ప్రకరణంలో వాడిన అచ్చ గన్నడమనే పదంనుంచి సృష్టించుకొని ఉంటాడు.[14] ఇతడు కన్నడ ప్రాకృతాలు బాగా వచ్చినవాడు; కర్నాటక భాషా భూషణాన్ని అనుసరించి ఆంధ్ర భాషా భూషణం రచించాడు.[15]

ఏతావతా, దాదాపు బుద్ధుని కాలంనుంచే బౌద్ధం వ్యాపించిన తెలుగుదేశంలో, పల్లవుల సామ్రాజ్యం చివరివరకు ప్రాకృతం శాసన భాషగా ఉన్న తెలుగుదేశంలో తెలుగుపై ప్రాకృత ప్రభావం ఎక్కువ గానే పడివుంటుంది. అలాగే స్థానికాలైన తెలుగుపదాలూ ప్రాకృతంలో చేరిపోయాయి. ఈ ఆదాన ప్రదానాలు తెలిపే పదాలను కొన్నింటిని తెలియజేయడం ఇక్కడ కార్యం. మొదట పాలీ ప్రాకృతంలోని ప్రాకృత తెలుగు సమాన రూప సమానార్థక పదాలను పరిశీలించండి. వీటిని రైస్‌డేవిస్ పాలీ - సంస్కృత డిక్షనరీనుంచి మిత్రులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు వీరి తెలుగుగోష్ఠి చదువగా, తర్వాత వీటిపై విశేషంగా చర్చ జరిగింది.[16]

| పాలీ | తెలుగు | పాలీ | తెలుగు |
|---|---|---|---|
| అంస | అంచు | అక్కస | అక్కసు |
| అచ్చి | అచ్చివచ్చు | అచ్చిబంధ | అచ్చుకట్టు (వ్యవసాయం) |
| అచ్చరిఁట | అచ్చెరువు | అజ్ఝోస | అడియాస |
| అణ్ణు | అన్నెం (పున్నెం) | అణయ | అనయం |
| అంబిల | అంబలి | అలగ్గ | అలగా |

| పాలీ | తెలుగు | పాలీ | తెలుగు |
|---|---|---|---|
| తక్కర | టక్కరి | తట | తట్టు (ఆ తట్టు) |
| తట్టుక | తట్ట | తట్టిక | తడిక |
| తతీయ | తదియ | తన్హ | తనియు తనివు |
| | | | తంపు |
| తరి | తరి (నౌక) | తరచ్ఛ | త్రచ్చు |
| తాంబా | తాంబాళం | తాపిత | తాపించిన |
| తాళ | తాళం | తిట్ట | తిట్టం, డిట్టం |
| తిన్న | తిన్నని | తిప్ప | తిప్పలు (బాధలు) |
| నామ | నామం | పూగ | పోగు |
| పేటక (పిటక సంబంధి) | పెటకం | పేల | పెళ్ళ |
| పేలిక | పేళ్ళగంప | పోసేతి | ప్రోచు |
| ఫణర | పడగ | ఫరతి | పొయి |
| బిల | బిళ్ళ | బుజ్జన | బుజ్జగించు |
| బొంది | బొంది | భక్కన్ | బొక్క |
| భాణతి | బాణి | మంకు | మంకు (పట్టు) |
| మంతణ | మంతనం | మచ్చర | మచ్చరం |
| మర్యాదా | మర్యాద | మరుమ | మొరుం, మరస |
| మల్లక | మల్ల (మట్టికంచం) | మసి | మసి |
| మస్సు | మీసం | అమస్సు | మీసం లేని (స్త్రీ) |
| మానిక | మానిక (నాలుగు ద్రోణాలు) | మాయ | మాయ |
| మిగ | మెకం | మిల్హా, మేయిల | మైల |
| రక్కస | రాకాసి, రక్కసి | రచ్ఛ | రచ్చ |
| రిత్త | రిత్తి | లంచ | లంచం |
| లహు | లగువు | పంక | వంక, వంకర |
| వచ్ఛ | ఉచ్చ | వత్తిక | వత్తి |
| వడ్డి | వడ్డి | వణ్ణ | వన్నె |
| వణ్ణిఆ | వన్నె | వత్థి | ఒట్టు |
| వద్ద | ఒద్దె | వసథ | ఒసవ |
| వాట | వాడ, వాటా | వాల (క్రూర) | వాలు (మెకం) |
| వికట | అకటా వికటం | విన్నాణ | విన్నాణం |
| విలుగ్గ | విరుగు | విలార (పిల్లి) | ఇలారం (ఇల్లు ఇలారం లేచి పోయారు) |
| విసూక | విసగు | వెత్త | బెత్తం |
| వేలా | వేళ | వేర | వేరం |

| పాలీ | తెలుగు | పాలీ | తెలుగు |
|---|---|---|---|
| వోకర | ఓకరింపు | సంగతి | సంగతి (ఏమి సంగతి?) |
| సంధస | సంతన చేయు | సంబళ | సంబళం |
| సంబుక | చెంబు | సంభార | సంభారపు పొడి |
| సక్క | చక్కబరచు | సక్కలి (ఆకస్మాత్తుగా జరిగిన సంఘటన) | చక్కిలం |
| సచ్ఛ | సచ్ఛ | సన్హ | సన్న |
| సన్వ | సన్నని | | |
| సత్తు | సత్తుపిండి | సద్ద | సద్దు |
| సుక్క | చుక్క | సున్న | సున్న |
| సోంది | సోదె | సుంకం | సుంకం |

పైన పేర్కొన్న పదాలలో ఆదాన ప్రదానాలు ఎలా జరిగాయో చెప్పలేము. ఈ విధంగానే తెలుగు మొదలయిన స్థానిక భాషల పదాలు ప్రాకృతంలో చేరి తద్వారా సంస్కృతానికి ఎక్కాయి. ప్రాకృత సంస్కృత శాసనాలలో వేంపు, వేపూరు మొదలయిన తెలుగు ఊళ్ళపేళ్లు, దానగ్రహీతల పేళ్లు కనిపిస్తాయి. అవి సాహిత్యంలోను చేరిపోయాయి. గాథా సప్తశతి మొదలయిన ప్రాకృత రచనలలో ప్రాకృత వేషంలో వున్న తెలుగు పదాలు ఎన్నో కనిపిస్తాయి. అలాటివాటిని - గాథాసప్తశతిలో ఉన్నవాటిని 40 ఏళ్ళ క్రితమే నేను తొలిసారిగా భారతిలో ప్రచురించాను వాటిలో కొన్నిటిని ఇక్కడ తెలుపడం అవసరం.[17]

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| అత్తా | అత్త, మేనత్త |
| వాలుంకీ | దోస, వాలుగ |
| పలుఅ | పిల్ల |
| పోట్టం | పొట్ట, కడుపు |
| కిలించిఅ | క్రించు |
| అద్దాఏ | అద్దం |
| భోండీ | పంది |
| సరఆం | చెరకు (కల్లు) |
| తుప్ప | తురువు త్రువ్వ (నేయి) |
| ఫలహీ | ప్రత్తి |
| వేంట | ప్రత్తివెంటి |
| సిప్పర | చీపురుగడ్డి |
| తాలూర | తలారు, సుడి |
| మడహ సరిఆ | మడవ |
| ఓ! | ఓ! |

13

| పాలీ | తెలుగు | పాలీ | తెలుగు |
|---|---|---|---|
| తక్కర | టక్కరి | తట | తట్టు (ఆ తట్టు) |
| తట్టుక | తట్ట | తట్టిక | తడిక |
| తతీయ | తదియ | తన్న | తనియు తనివు |
| | | | తంపు |
| తరి | తరి (నౌక) | తరచ్ఛ | త్రచ్చు |
| తాంబా | తాంబాళం | తాపిత | తాపించిన |
| తాళ | తాళం | టిట్ట | టిట్టం, డిట్టం |
| తిన్న | తిన్నని | తిప్ప | తిప్పలు (బాధలు) |
| నామ | నామం | పూగ | పోగు |
| పేటక (పిటక సంబంధి) | పెటకం | పేల | పెళ్ళ |
| పేలిక | పేళ్ళగంప | పోసేతి | ప్రోచు |
| ఫణక | పడగ | ఫరతి | పాయి |
| బిల | బిళ్ళ | బుజ్జన | బుజ్జగించు |
| బొంది | బొంది | భక్కన్ | బొక్కు |
| భాణతి | బాణి | మంకు | మంకు (పట్టు) |
| మంతణ | మంతనం | మచ్ఛర | మచ్చరం |
| మర్యాదా | మర్యాద | మరుమ | మొరుం, మరస |
| మల్లిక | మల్ల (పుష్టికందం) | మసి | మసి |
| మస్సు | మీసం | అమస్సు | మీసం లేని (స్త్రీ) |
| మానిక | మానిక (నాలుగు ద్రోణాలు) | మాయ | మాయ |
| మిగ | మెకం | మిల్హా, మేయిల | మైల |
| రక్కస | రాకాసి, రక్కసి | రచ్ఛ | రచ్చ |
| రిత్త | రిత్తి | లంచ | లంచం |
| లహు | లగువు | పంక | వంక, వంకర |
| వచ్ఛ | ఉచ్చ | వత్తిక | వత్తి |
| వడ్డి | వడ్డి | వణ్ణ | వన్నె |
| వణ్ణిఅ | వన్నె | వత్థి | ఒట్టు |
| వద్ద | ఒద్దె | వసధ | ఒసవ |
| వాట | వాడ, వాటా | వాల (క్రూర) | వాలు (మెకం) |
| వికట | అకటా వికటం | విన్నాణ | విన్నాణం |
| విలుగ్గ | విరుగు | విలార (పిల్లి) | ఇలారం (ఇల్లు ఇలారం లేచి పోయారు) |
| విసూక | విసగు | వెత్త | బెత్తం |
| వేలా | వేళ | వేర | వేరం |

| పాలీ | తెలుగు | పాలీ | తెలుగు |
|---|---|---|---|
| వోకర | ఓకరింపు | సంగతి | సంగతి (ఏమి సంగతి?) |
| సంధస | సంతన చేయు | సంబళ | సంబళం |
| సంబుక | చెంబు | సంభార | సంభారపు పొడి |
| సక్క | చక్కబరచు | సక్కలి (అకస్మాత్తుగా జరిగిన సంఘటన) | చక్కిలం |
| సచ్ఛ | సచ్చ | సన్న | సన్న |
| సన్వ | సన్నని | | |
| సత్తు | సత్తుపిండి | సద్ద | సద్దు |
| సుక్క | చుక్క | సున్న | సున్న |
| సోంది | సోదె | సుంకం | సుంకం |

పైన పేర్కొన్న పదాలలో ఆదాన ప్రదానాలు ఎలా జరిగాయో చెప్పలేము. ఈ విధంగానే తెలుగు మొదలయిన స్థానిక భాషల పదాలు ప్రాకృతంలో చేరి తద్ద్వారా సంస్కృతానికి ఎక్కాయి. ప్రాకృత సంస్కృత శాసనాలలో వేంపు, వేపూరు మొదలయిన తెలుగు ఊళ్ళపేళ్ల, దానగ్రహీతల పేళ్లు కనిపిస్తాయి. అవి సాహిత్యంలోను చేరిపోయాయి. గాథా సప్తశతి మొదలయిన ప్రాకృత రచనలలో ప్రాకృత వేషంలో వున్న తెలుగు పదాలు ఎన్నో కనిపిస్తాయి. అలాటివాటిని - గాథాసప్తశతిలో ఉన్నవాటిని 40 ఏళ్ళ క్రితమే ఏరి తొలిసారిగా భారతిలో ప్రచురించాను వాటిలో కొన్నిటిని ఇక్కడ తెలుపడం అవసరం.[17]

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| అత్తా | అత్త, మేనత్త |
| వాలుంకీ | దోస, వాలుగ |
| పలుఅ | పిల్ల |
| పొట్టం | పొట్ట, కడుపు |
| కిలించిఅ | క్రించు |
| అద్దాఏ | అద్దం |
| భోండీ | పంది |
| సరఅం | చెరకు (కల్లు) |
| తుప్ప | తురువు త్రువ్వు (నేయి) |
| ఫలహీ | పత్తి |
| వేంట | పత్తివెంటి |
| సిప్పర | చీపురుగడ్డి |
| తాలూర | తలారు, సుడి |
| మడహ సరిఆ | మడవ |
| ఓ! | ఓ! |

13

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| ఓడ | అవిటి, ఓడు |
| సాఉలీ | శాలువ |
| మఇల | మైల |
| పాణ ఉడీ | పాణిసి గుడిసె |
| తీరవి | తీరదు |
| కుసుంభ | కుసుమపూవు |
| ణడిజ్జఇ | నలియు |
| పక్కల | మొక్కవీడు |
| చటుఅ | చట్టువం (తెడ్డు) (గరిటె) |
| రుంప | రంపపుపొడి |
| దోరో | దారం |
| ఉడే | వీడు |
| అవ్వో! | అమ్మో! అవ్వో! |
| భిసణేమి | విసరవేస్తున్నాను |
| దే! | అదో! అదిగో! |
| పేచిరీ | పెచ్చారితనంగల |
| ఉప్పంగో | ఉప్పొంగు |
| అత్తక్క! | అమ్మక్క! |
| పలాల | పులు |
| అలాహి | ఒల్ల |
| ఉఉ! ఊ అహ | ఓయి (చూడు) |
| కవి | క్రై (చతుర్థి) |
| సురసురంత్ | సురసురమను |
| ధరహరంతి | ధరధరమను |
| సణిఅం సణిఅం | సన్నగా సన్నగా |
| ఢక్కాదుక్కఇ | తుకతుకలాడు |
| పుప్పుఆ | పిడకల నిప్పు |
| చోజిఅం | చోద్యం |

ఇక్లే 8వ శతాబ్దంనాటి వజ్జాలగ్గం అనే ప్రాకృత సంకలన గ్రంథంలోను చాల తెలుగుపదాలుచేరాయి జయవల్లభుడనే శ్వేతాంబర జైనకవి దీనిని భర్తృహరి శతకత్రయంలాగ సంకలనం చేశాడు. దీనిలో ఇరవైకి పై తెలుగుపదాలు ప్రాకృతం ముసుగులో వున్నాయి.[18]

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| వింతర | వింత |
| ఆవట్టవి | పట్టిపోతున్నది |
| ఓ! | ఓ! (సంబోధనం) |
| కసరక్కా | కసుగాయ |
| తలినేహి | తలిరులచేత |
| విసూరణ | ఉస్సురను |
| దే! | అదిగో! అదో! |

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| నడిజ్జను | నిలియు |
| సాహే ఇ | చాటుతున్నది |
| (సుణ) పిల్లిఆ | (కుక్కపిల్ల) |
| చంపఉణ (నింపు) | చొమవు |
| ధుకోక్కడి అ | ధుకధుకలాడు |
| గగ్గర | గగ్గర |
| తువణ (మెతుకు) | తరవాణి (మె) |
| విలయా | వెలయాలు |
| ఉబ్బేఇ | ఉబ్బు |
| కాణా | కాననివాడు |
| దలి అ | దొర్లు |
| ఖరడియా | కర(మురికి)చేయు |
| పరోహడ | పెరడు |
| జూరేఇ | చురచుర జురజుర |

1 వ శతాబ్దంలో వున్న ప్రాచీన కర్నాటక వ్యాకర్త చెన్న వీరకవి కాశకృష్ణ ధాతుపాఠానికి వ్యాఖ్య వ్రాస్తూ బాలపైకృత పదాలను (కన్నడ తెలుగు తమిళ మూలపదాలను) కాశకృష్ణ ధాతువులతో సాధించాడు. ఇది కన్నడవ్యాఖ్య. దీనిని యుధిష్ఠిర మీమాంసకులనే పండితులు సంస్కృతీకరించారు. వాటిలో కొన్ని మాటల వ్యుత్పత్తిని ఉదాహరిస్తాను.[19]

అట:- అటిగతౌ, అటతి-భ్రమతి-క్రీడతీతి క్రీడనకమ్ (295)

ఈటె:- ఏటతి తాడయతి. ఈటిగతౌ ఈటి. శస్త్రవిశేషః

చేట:- చేటు ప్రేష్యే, శూర్పేణ చేటతి. శూర్పేణ నిష్పవన క్రియాం కరోతి. చేటః శూర్పం.

చాకలి:- చకతృప్తౌ; శీతభావేచ, చకతి, చకయాతి శీతేభవతి చాకలః=రజకః. చాకలీ=రజకీ.

గూడెం, గూడు:- గూడ నివాసే. గూడతి నివసతి గూడుః గూడం=నివాస స్థానమ్.

మంట:- మటిదాహే, మంటతి, జ్వలతి, మంటః=జ్వలనమ్.

విల్లు:- బిల్లగతౌ. బిల్లతి ఇషుం ప్రక్షిపతి, బిల్లుః (విల్లుః)=ధనుః.

నాయి (కుక్క):- నయ రక్షణే, చలనేచ నయతే రక్షతి నాయి=శునీ.

గాజు:- గజశబ్దౌ. గజతి, గాజుః=కంకణమ్.

పిట్ట:- పిట్ట చలనే, పిట్టతి చలతి, పిట్టః=పక్షీ.

సాని=షణుదానే. సనతి, సను తేదదాతి=సానీ=మాతా.

ఈ విధంగా ఎన్నో పదాలను వ్యుత్పత్తితో సాధించాడు. ఈ ఆదాన ప్రదానాలు ఇంత ఎక్కువగా వున్నందునే సుగృహీత నామధేయులు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు తెలుగుకు మూలం ప్రాకృత సంస్కృతాలని విశ్వసించారు. ఆ విధంగానే ఆంధ్రభాషా చరిత్ర రచించారు.[20]

(ఇంకా ఉంది)

## కల్యాణపుర 'సాళ్వ' రాజులు

"రాయ మీసరగండ ధరావరాహ,
విజయ విఖ్యాత, గుండ భూవిభు నృసింహ
సార్వభౌముని బిరుదంబు సాళువంబు"

(జై • భా 1-45)

పై పద్యములో- "రాయమీసరగండ - ధరావరాహ - విజయ విఖ్యాత - సాళువ బిరుదములు సాళ్వ నరసింహరాయల కుండినట్లు చెప్పబడి వుంది ఈ సాళ్వ నరసింహుని పెద్ద ముత్తాత 'సాళువ మంగు' యను నాతడు విజయనగరాధీశుడగు మొదటి బుక్కరాయల కడ సైన్యాధిపతిగను, కళ్యాణపుర పర్యవేక్షణాధికారిగను నుండినట్లు తెలియుచున్నది. కళ్యాణపుర సాళ్వవంశమునకు మూలపురుషుడు ఈ సాళ్వమంగుయే. ఆయన మధుర నేలు సుల్తాను నజీరుద్దీనును నోడించి, తొండై మండలమున సాంబువరాయని ప్రతిష్ఠించి 'సాంప రాయ స్థాపనాచార్య' బిరుదు వహించెను. సాళ్వమంగు శ్రీరంగమున విగ్రహప్రతిష్ఠ చేసినట్లును, దానికి అర్వదివేల మాడలిచ్చినట్లును ఈ క్రింది పద్యము వలన తెలియుచున్నది.

సీ॥ "దురములో దక్షిణ సురతాను నెదిరించి
కొనివచ్చి సాంపరాయనికి నిచ్చె,
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయ స్థాప
నాచార్య బిరుద విఖ్యాతిఁ గాంచె,
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
మాదలద్దేవ నుమ్మడికి నొసఁగె,
మధురా సురత్రాను మదియించి పరపక్షి
సాళువ బిరుదంబు జగతి నెఱపె,

తే॥ గబ్బితనమునఁ దేజి మొగం బెగట్టి
తఱిమి నగరంపు గవఁకులు విఱుఁగ్రదోలి
తాను వేసిన గౌరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు."

(జై . భా 1-32)

పై యుద్ధము క్రీ.శ. 1345లో జరిగినట్లు శాసనాధారములు కూడా కలవు. సాళ్వమంగిదేవ మహారాయ తర్వాత అతని కుమారుడు గుండ్రాజు. గుండ్రాజు కుమారుడు పరిపాలనాకాలంలో గజపతులు కల్యాణ నగరంపై క్రీ.శ. 1464లో దండెత్తి వచ్చిరి. అందువగను స్వకులస్థులను రక్షించుటకుగాను సాళ్వనరసింహుడు కల్యాణ నగరమును స్వాధీనపరచుకొని, పరిపాలించ మొదలిడెను.

సాళ్వదేవరాయ మహారాయ పరిపాలనా కాలంలో శ్రీ వేంక టేశ్వర సుప్రభాతమును దేవుని సన్నిధానమున గానము చేయుటకు ఉత్తర్వు యిచ్చినట్లు తిరుమల శాసనం.

సాళువాభ్యుదయమునందు సాళ్వ నరసింహ చంద్రగిరికి సమీపముననున్న కల్యాణపురమును పాలించుచుండినట్లు తెలియుచున్నది. అనేక విజయములకు కారణభూతుడైన ఈయన సామర్థ్యమును గుర్తించియే, సైన్యాధికారిగానున్నను, రాజ్యాధికారమును సంగమ వంశస్థులు యిచ్చియుండవచ్చును. శాసనాధారముల వలన ఈతడి వంశములోని సాళ్వ తిప్పరాజు లేక 'తిప్పగోప' డనేవానికి, విజయనగరాధిపతియైన రెండవ దేవరాయల చెల్లెలిని హరియమ్మను వివాహమాడినట్లు తెలియుచున్నది. ఈ చుట్టరికము వలన కూడా సాళ్వ వంశస్థులకు రాజ్యాధికారము స్థిరపడియుండవచ్చును. అట్లు కల్యాణపురము నుండియే పరిసరస్థములైన చంద్రగిరి - వెంకటాద్రి మున్నగు ప్రదేశములందు పర్యవేక్షణాధికారము నెఱపుచుండెను. కొన్ని దినములకు కల్యాణపురమునుండి రాజధానిని చంద్రగిరికి మార్చుకొన్నట్లు సాళువాభ్యుదయములో చెప్పబడి ఉంది. చంద్రగిరి రాజ్యములోని తిరుమలనుండి వెల్వడిన సాళ్వ నరసింహ మొదటి శాసనం 12-9-1456. కాన మంగిదేవ మహారాయ మనమడు దేవరాయ మహారాయ క్రీ శ. 1456 వరకు కల్యాణపురమును పాలించినట్లు భావించవలసి వుంది.

పూర్వము చంద్రగిరి రాజ్యమునకు కల్యాణపురము రాజధాని నగరముగ నుండెను. నాటి కల్యాణపురమే నేటి నారాయణవనం.

విజయనగరాధీశుడైన మల్లికార్జున రాయలు 1450 - 67 క్రిందను, విరూపాక్షరాయలు 1468-86 క్రిందను సాళ్వ నరసింహ పర్యవేక్షణాధికారము నెఱపుచుండెను. జైమినీ భారతములో సాళ్వ నరసింహుని విజయములు విపులముగ వర్ణింపబడియున్నవి. అతడు తమిళదేశమును నాక్రమించిన చోళులను పారద్రోలెననియు, ఒడ్డె రాజులను నిర్జించెననియు, బాలదుర్గము, పెనుగొండయంచలి ప్రతిపక్షులను జయించెననియు పినవీరన రచించిన జైమినీ భారతం 1 45లో చెప్పబడి వుంది.

మల్లికార్జునరాయల పరిపాలనా కాలములో గజపతులు దండ యాత్ర క్రీ.శ. 1464–65 లోనను; 1464 లోనను జరిగినట్లుగా శాసనాధారములనుబట్టి చరిత్రకారులు చరిత్రను చెప్పుచున్నారు. విరూపాక్షరాయల కాలమున 1474–76లో కూడా గజపతులు దండ యాత్ర జరిపినట్లు శాసనాధారములున్నవి. ఈ దుర్మాక్రమణలోనే గజపతులను సాళ్వ నరసింహ నోడించి అవమానపరచినది.

సంగమ వంశమున చివరిరాజైన ప్రౌఢ దేవరాయలు రాజకీయ సంక్షోపముచే భయపడి పారిపోగా సాళ్వనరసింహ విజయనగర సామ్రాజ్యమునకు మకుటాధిపతి యయ్యెనని చరిత్రకారులు చెప్పు చున్నారు. నరసింహరాయలు క్రీ.శ. 1–11–1486లో విజయనగర సామ్రాజ్యనేతయయ్యెనని శాసనములు పేర్కొనుచున్నవి. ఇది శాసనస్థ విషయం.

జైమినీ భారతమున సాళ్వ నరసింహరాయల పట్టాభిషేకము ఈ క్రింది పద్యమున వర్ణింపబడియున్నది.

సీ॥ "హరి పుత్రియుం డయ్యె సామ్రాజ్యంబు
గరిమఁ జేయనినాఁటి కడమ యొకటి,
యోగీంద్రవంద్యుండయ్యును నుగ్రసేనుని
నోలగించిన నాఁటి యొచ్చమొకటి,
భువనైక వీరుఁడయ్యె విభాకర తనూజ
తాఁపుఁ గోరిననాఁటి తక్కువొకటి,
యాదిలక్ష్మీ నాథుఁడయ్యును బలదైత్యు
నడుగఁబోయిన నాఁటి హైన్యమొకటి.

తే॥ తలఁచి మూర్ధాభిషిక్తుడై ధరణిపతులు
గొల్వ నసహాయ శూరత వెలసి దాన
శక్తి నవతారమెత్తిన శౌరిగాక."
క్షితిప మాత్రుండె సాళ్వ నరసింహవిభుఁడు."

సాళ్వ నరసింహరాయల కిష్టదైవము శ్రీ వేంకటేశ్వరస్వామి. ఆ వేంకటేశ్వరుని పినవీరన ఇలా స్తుతించియున్నాడు.

"శ్రీ వేంకటాద్రినాథ ద
యా వర్ధితరాజ్య సన్నుతార్థిజన
దేవగ వైరినృపరా
జీవ సికర చంద్ర నారసింహ నరేంద్ర."
(జై. భా 5-1)

శాసనాధారముల వలన, సాళ్వ పెరియ మల్లయాదేవ మహా, రాయ, సిరియ మల్లయాదేవ మహారాయ, సాళ్వగోపుడని నామాంత రములు గలిగి, విజయనగరాధీశుడైన సాళ్వ నరసింహరాయల క్రింద చంద్రగిరిని, నారాయణవనమును పాలించుచుండినట్లు తెలియు చున్నది.

తుళువ వంశపు రాజులైన శ్రీ కృష్ణదేవరాయలు, అచ్యుత రాయలు, సదాశివరాయల పరిపాలనా కాలంలో నారాయణవనమును మాత్రం సాళ్వ రెడ్డిరాజులు మూడు తరములవారు పాలించినట్లు కైఫీయత్తుం వలన తెలియుచున్నది. అచ్యుతరాయలు నారాయణ వనములో శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామివారి ఆలయమును పునర్ నిర్మించినట్లు నారాయణ వనం శాసనం. శ్రీ అగస్తీశ్వర ఆలయమును సాళ్వమంగుకు పూర్వం పాలించిన (క్రీ.శ. 1000 – 1367) నారాయణవనం యాదవరాజులు నిర్మింపజేసిరి. వీరి కులదైవం అవనాక్షమ్మ.

అరవీటి ప్రభువుల సేనాని ఎల్లంటి మాకరాజు (1543–1564) నారాయణ వనమును పాలించుచుండెను. క్రీ.శ. 1725 ప్రాంతములో వీరి రాజధానిని కార్వేటి నగరమునకు మార్చుకొనిరి. ఈ రాజులు కొంతకాలము గోల్కొండ నవాబుల క్రిందను క్రీ.శ. 1725 నుండి 1800 వరకు ఆర్కాటు నవాబుల క్రిందను, ఆఖరున తూర్పు ఇండియా సంఘమువారి క్రిందను మహామండలేశ్వరులుగ గుర్తింపబడిరి. ఈ వంశీయులు కవి పండితులను పోషించి అనేక గ్రంథములకు కృతి పతులైనారు. ఈ వంశీయులకు సాళువ బిరుదము కలదు

—డాక్టర్ తలుపూరు నాగేశ్వరరావు

## 'రాయప్రోలు'వారితో కొన్ని క్షణాలు

అది 22 మే 1981 సంవత్సరం. అప్పటికి రాయప్రోలువారు కొంత ఓపికగానే ఉన్నారు. కాని కళ్లు అంతగా కనబడడంలేదు. చెవులు దాదాపుగా వినబడడంలేదనే చెప్పాలి. వారి దర్శనం చేసు కుందామని నేనూ, మిత్రుడు గెల్లి రామమోహనరావు బయలుదేరాం. సికిందరాబాద్‌లో ఉన్న మారేడుపల్లి అంతా గాలించి వారి 'లలితా కుటీరం' చేరుకున్నాం.

గేటు చప్పుడయేసరికి 'ఏ దేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ భూమి భారతిని' అని గర్జించిన గంభీరనాదం "ఎవరూ?" అని గద్దించింది. నెమ్మదిగా ఆయనను చేరి మా విషయం చెప్పటానికి బ్రహ్మాదులు దిగివచ్చారు. చివరకు నేను వారిని ప్రశ్నించడం, అది రామమోహనరావు ఆయన చెవి దగ్గర గట్టిగా చెప్పడంతో మొద లైంది మా సంభాషణ.

నేను అడిగిన ముఖ్యమైన ప్రశ్నలూ, రాయప్రోలువారు ఇచ్చిన సమాధానం పొందుపరుస్తున్నాను ఇక్కడ.

1. అమలిన శృంగారం అంటే ఏమిటి?

"ఇది అమలినం అంటే మిగతాది మలినం అని నా అభిప్రాయం

# “ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!”

“పోయిందే!”




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

Amrutanjan Limited 

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

OBM 149 TG R

కాదు. స్త్రీ బహిష్ఠు అయితే మైల, మలినం అంటాం. అలా మలినం కానిది అమలినం. అంటే సంభోగ శృంగారం కానిది. స్త్రీ పురుషుల సంయోగంలో సంభోగార్థం ఉంది. కాని నేనా కోటిలోనివాడిని కాను. నేను పోతనను మెచ్చుకుంటాను. కాని సంభోగ శృంగారాన్ని కాదు. సంభోగ శృంగారం కానిది అమలిన శృంగారం 'భోగార్పన సలిపి నట్లు' (రమ్యాలోకం) అని నా భావాన్నిబట్టి వ్రాశాను.

ఏకపత్నీవ్రతం రామాయణం నుండి వచ్చింది. ఉపనిషత్తుల కాలంలో జబలకథ(భారతం)లో వివాహం ఉన్నట్లు కనబడదు. "అమరులకు వివాహం ఉందా? వారికి సంభోగం ఉందా? అందుకేనా భూలోకానికి వస్తున్నారు." అనే అనుమానం వచ్చింది నాకు. కాని 'అద్వైత సుఖ దుఃఖయోః...యస్మిన్హసారం' అని భవభూతి. అది దాంపత్యంలోనే ఉంది అని ఆయన అభిప్రాయం.

ఏ రసమైతే అవిభాజ్యం కాదో, మిధునాను సంభోగం కాదో, వాచ్యంగా పరమార్థం చూపుతుందో అది అమలిన రసం.

నన్నయ 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ...పుంస్త్వయోః' అంటే జంటగా ఉండటం. అదే నేను తీసుకున్నాను.

'యోఃవతోరసః తిపోజ్యోతీ రసః' దానికి సుఖస్ఫూర్తి అనే అర్థం వుంది. ఇదే నేను రమ్యాలోకంలో, మాధురీ దర్శనంలో చర్చించాను. "ప్రజాతంతును ఛేదించకు" అంటే స్త్రీ పురుషులకు సంయోగం అని తెలుసుకున్నాను. మైధునంవల్లనే అది కలుగుతుంది.

అయితే నేను 'తృణకంకణం'లో సంపూర్ణంగా మొదటినుండి చివరిదాకా నాయకీ నాయకులు విడిపోయేవరకూ ఎటువంటి సంయోగం లేకుండా వ్రాశాను. అదే నా దృష్టిలో అమలిన శృంగారం."

2. భావకవిత్వం అంటే మీ నిర్వచనం ఏమిటి?

"మకరధ్వజాని కొంప ఒకప్రక్క కనిపింప" అనేది అశ్లీలం అంటారు. కాని చినిగిపోయిన గుడ్డ కట్టుకొన్నదాని వర్ణన ఇది. ఇలా స్ఫురించేదే భావకవిత్వం.

కంచు కంచాలలో పెరుగన్నమును తినియె' అనడంలో కంచం అనీ పెరుగన్నం అనీ అనడం తప్పు "వెన్నెల" అని చెప్పను. అలా స్ఫురణ కలిగేదే భావకవిత్వం."

3. ఆధునిక సమాస ప్రయోగం గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?

"నేత్రాణి వైదర్భ సుతాసఖీనాం, ప్రాప్తస్తదేకం నిరూపాఖ్య రూపం' (నైషధం-తృతీయసర్గ) - "విదర్భ స్వరాజ్ఞః వైదర్భః" అని అయితే "వైదర్భస్య రాజ్ఞీ వైదర్భి" అని ఎందుకు కాదు?

ఇలా వాదిస్తేనే నన్ను భమిడిపాటి కామేశ్వరరావు "గడ్డ తెలగాణ్యం" అని హేళన చేశాడు.

నా దృష్టిలో తెలుగులో (1) సంధివివక్ష. (2) సమాస విధులు నిత్యం కావు. ఇది మల్లినాధాదులే ఒప్పుకున్నారు."

4 మీ కవిత్వ విశిష్టత ఏమిటి?

"అమరావతీ పట్టణ...' అని వ్రాసినదానికంటె ముందు 'అఖండ గోదావరి' అనే పద్యం వ్రాశాను. అది నా దగ్గర లేదు. గురజాడ "దేశమంటే మట్టికాదోయ్" అని వ్రాశాడు. కాని 'దేశం', 'భాష' అనేవాటిని మొట్టమొదట పట్టుకొన్నవాడిని నేనే. శ్రీకారం వంటి నియమాలు వదిలింది నేనే. నేను కూడా దేశం మట్టిగూర్చి వ్రాశాను. కాని కమ్యూనిష్టులు "పబ్లిష్" చేయడానికి భయపడ్డారు. బ్రహ్మయ్యశాస్త్రిగారు చాలా ఖండించారు. నా భాషను గూర్చి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు నా తృణ కంకణంమీద చాల ఇష్టం వచ్చినట్లు వ్రాశారు.

ఇంక తరవాత తన ఆరోగ్యాది విషయాలపైకి దృష్టి మరలించి కొన్ని మాటలు చెప్పి, మళ్ళీ "నన్ను బాగా 'ఇన్‌స్పయిర్' చేసింది "మేఘ సందేశం" అని అన్నారు.

నేను అభినవ కవిత్వాన్ని గూర్చి ఎన్నోచోట్ల మాటాడాను. వ్రాశాను. ఈ మధ్య నాగార్జున యూనివర్శిటీవారికి వ్రాసి పంపాను. అది ఇంకా ప్రింట్ కాలేదు."

ఇంక వారిని అధికంగా శ్రమపెట్టదలచుకోలేదు మేము.

చెప్పిన ఆ నాలుగు పలుకులే అమూల్యమని తలచి నమస్కారం చేసి వచ్చాం.

అయితే ప్రకటించడం ఆలస్యమైనా సాహితీ మిత్రులకివి ఎంతో ఉపకరిస్తాయనే భావంతో మీ ముందుంచుతున్నాను.

—డా॥ శివలెంక ప్రకాశరావు

# శాస్త్రిగారికి శంకరంబాడిగారి ప్రత్యుత్తరం

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారికి సుందరాచారి నమస్కరించి వ్రాయునది.

అయ్యా మీ జాబు నానందపూర్వకముగా నందికొంటిని. రాయదుర్గంలో మీరంతా నాకొసంగిన ఆతిథ్యభావ చిరస్మరణీయం. నా సతీమణియు మిమ్ము గుర్తుపట్టగలిగియున్నది.

కవులెవరో కనుగొన దుస్సాధ్యమైన నేటి కాలంలో మీరు మా సీమ కవులను గుర్తించి వ్రాయఁబూనుట ముదావహం. నేను కవినో కానో నాకు తెలియదు. అయ్యు మీరట్లు చేకొని నా జీవిత విశేషాల నడుగుటచేత కాదనలేక వ్రాయుచున్నాను.

నేను ప్రపంచ మహాసంగ్రామ కాలంలో 10 ఆగస్టు 1914న జన్మించితినని నా తండ్రి తెలిపిరి. రేపటి ఆగస్టున నేనరువదియవ యేడుఁ ద్రొక్కనున్నాను. జన్మస్థానము తిరుపతి.

నాకు రెండవయేట మా తాత మరణింప తండ్రి యుండియు ఆమె తండ్రి మా తాత నన్ను చనువుతో నెత్తి పెంచెను. కట్టుబాట్లు లేని స్వేచ్ఛా వాతావరణంలో సత్సంప్రదాయబద్ధ శ్రీవైష్ణవుఁడుగ నెదిగితిని. పదియవ తరగతి వఱకు తిరుపతి దేవస్థానం హైందవోన్నత పాఠశాలలో చదివి, ఆపైని మదనపల్లి దివ్యజ్ఞాన సమాజ కళాశాలలో 'ఇంటర్మీడియేటు' చదివి నెగ్గితిని. ఆర్థికాభావమున పై చదువు సాగక పోగా, ఆంధ్రపత్రికా కార్యాలయమున వత్సరకాలము సహాయ సంపాదకుఁడుగా పనిచేసితిని. దానిని వదలి రెండు వత్సరములు బెంగుళూరు, 'హిస్ మాస్టర్స్ వాయిస్' కంపెనీలో కవిగా కొన్ని నాటకముల సెట్లను రచియించితిని. 1939లో పెండ్లాడి బ్రతుకుచెడి చిత్తూరు బోర్డు హైస్కూల్లో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుఁడనై చక్కని దేశికుఁడని పేరు పొందితిని. ఆ వృత్తి నాకు నచ్చినది కూడా 1946లో సినిమా పిలుపందినది. రెండు సంవత్సరములు సెలవు గైకొని 'దీనబంధు' అను తెనుఁగు చిత్రమునకు 'మాటలు, పాటలు' వ్రాసితిని. అప్పుడే ప్రజాదరణ నందుకొనిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అను రాష్ట్రీయ గేయమును రచించితిని. టంగుటూరి సూర్యకుమారిచే పాడించితిని. రేడియోలో సారస్వతోప న్యాసములను ప్రసారము చేయుటయు, స్వీయ కవితాగానము చేయు టయు నప్పుడే ప్రారంభించితిని. అంతలో నా భార్యకు మనోవ్యాధి కలిగినది. సినిమా వదలి మరలా బడిపంతులనైతిని. ప్రభుత్వము 1951వ సం॥ము నన్ను జూనియర్ డెప్యూటి ఇన్స్పెక్టరుగ నెన్ను కున్నది. ఆ కొలువు మూడు సంవత్సరములు మాత్రమే. పై యధి కారులకు బానిసనై లొంగి నడువలేక 1954లో రాజీనామానిచ్చి సాహసించి కవితా జీవనమునకుఁ దొడఁగితిని.

నాకు బాల్యమునుండియు నాంధ్రభాషపై మక్కువ యెక్కువ. నేను నా పదునాల్గవ యేటనే కవిత్వము వ్రాయఁదలపడితిని. నాటి కవితా గతుల గుఱించి యనేకములగు కావ్యఖండికలను, గేయములను వ్రాసి 1940-46వ వత్సరములలో వాటిని 'భారతి'లో ప్రకటింపఁబడఁ జూచితిని.

కాని వయసు ముదురు కొలంది, యట్టి ఖండికలపై నాకాకర్షణ క్షీణించి పదుగురవలె వ్రాసి ప్రయోజనమేమి? సాహిత్యమునకు నేఁ జేయఁగలిగిన ప్రత్యేక సేవ యేది! నా శక్తి యెంతటిది? అను ప్రశ్నలు నాలోఁ బొడమినవి. "పండితుఁడగాను, గురపర్య పంచఁ జేరి పట్టుతో శిక్షణందినవాడను గాను. ప్రకృతి సిద్ధంబుగా లభ్యపడిన తెనుఁగుబాస నే ప్రాపుగాఁగొని వ్రాయువాడ" — అని కవితయన్న కరకాయగి భావించు నేటి విద్యార్థి లోకమునకు కవితాభిరుచిని పెంపొందించు దీక్షతో తేట తెలుఁగులో తేఁట మాటలలో తెనుఁగు వారి సొంత సొమ్మైన తేఁట గీతులలో సరళ కావ్యముల నల్లి విద్యా శాలలలో ప్రచారమునకు తెప్రారంభించితిని. సర్వేశ్వరుండు నాకు సరళ కవిత్వధారనే కాక చక్కని యుపన్యాసధోరణిని లభ్యపడఁ జేసిన కారణమున సుళువుగనే విద్యార్థుల ప్రేమనుఁ జూరఁగొంటిని. వారు ఆప్యాయముతో నా మాటలను కావ్యములను విని యానందించుచుఁ, నా పుస్తకములను స్వేచ్ఛగా కొని నా జీవితమును గడుప నార్థికముగ తోడ్పడుచున్నారు. ప్రజలలో దాతలింకా యున్నా రనుటకు సాక్షిగా నా ప్రతికావ్యము నెవరో పోషించి ముద్రణకు తెచ్చుచున్నారు. నేను 700 విద్యాశాలలు పర్యటించి భాషా ప్రచారము గావించితి నింతవఱకు.

నేను వ్రాయు కావ్యములన్నియు విద్యార్థుల యుపయోగార్థమే అనుకొంటిని కాని అవి మహాకవులను విమర్శకులను గూడా యాకర్షించుట నా యదృష్టము. కీ॥శే॥ శ్రీపాదవారు, "ఇది విద్యార్థుల యుపయోగ నిమిత్తమే యని చెప్పునే కానీ నేనట్లు తలంపను? ఎంత వారికైన నేర్పుకు తగిన పద్ధతులిందుఁ గలవు అనిరి. "తేటఁగీతుల తెలుగు తేదీపిరుచుల యూట. కొసరుల కెంకుల కాటువడక నమ్మి నమ్మించు నిత్య బోధనమ్ము దారి - సారతరమిది సుందరాచారి కవిత." అనియు ఎవరెవరో కందమును సీసమును సొంతము చేసికొనినట్లు సుందరాచారిగారు తేటగీతులను సొంతము చేసికొన్నారేమో అన్నంతటి సామరస్యమును వారి రచనలలో చూపుచున్నారనిరి శ్రీ విశ్వనాథ. తెలుగు పలుకుబడి కవితాశక్తి. నాకు ముఖ్యము. ఈ మూడు గుణములను మూటఁగట్టి వీరు పొత్తములను రచించుచున్నట్లున్నది. వీరి శైలి సంస్కృత సమాసముల నుండియు మారుమూల పదముల నుండియు విడివడి సరళమైనది. వీరు రచించుచున్న గ్రంథములఁ జూడ నీ యుగములో వీరిదొక ప్రత్యేక వాఙ్మయముగ నేర్పాటు కాఁబోవుచున్నట్లున్నది అన్నారు శ్రీ పింగళి, "సుందరాచారిగారి ఖండ కావ్యములను చదువుకొనియు, చదివించుకొని వినియు ఉత్తమ కవితా పఠనవేళ పొందఁదగిన పరమాహ్లాదమును పొందుచుంటిని. తమ రచన యాబాల గోపాలము సర్వజన సంసేవ్యము కాదగినట్లు అప్రయత్న ముగ సహజ ధోరణిలో వ్రాయఁగల తెలుఁగు కవులలో శ్రీ సుందరాచారి అగ్రశ్రేణికి చెందినవారు అన్నారు. శ్రీ గడియారం, ఈతని శైలి మిక్కిలి సహజమైనది, చక్కని తెలుఁగు నుడికారములు జాతీయములు ఈతని రచనకు ఒక యందమును చేకూర్చినది." శ్రీ రాయప్రోలు 'శ్రీ సుందరాచారి సూక్తి ఎంత తేటగా సూటిగా వినఁబడుతుందో అంతస్ఫురితగాను దూరంగా ధ్వనిస్తున్నది అన్నారు.

సామాన్య సంఘమును నా సాహిత్యసేవను గుర్తించినది. 40 విద్యాసంస్థలు చెరియొక 116/- లతో నన్ను సన్మానించినవి. 1966లో శ్రీ కల్లూరు సుబ్బారావుగారు హిందూపురములో సన్మానించిరి. చిత్తూరు టాగూర్ సెంటినరీ సెలబ్రేషన్ కమిటీవారు నా 'గీతాంజలి' అనువాదాన్ని ప్రకటించి వెలువరిస్తూ సువర్ణాంగుళీయ ప్రదానముతో సత్కరించిరి. 1968లో జిల్లా స్థాయిలో ఆంధ్ర ప్రభుత్వం తిరుపతిలో సత్కరించింది. 1970లో చిత్తూరు రామ విలాస సభవారు, జిల్లా కవిగా నన్నూ, జిల్లా నటుడుగా నాగయ్యను, జిల్లా గాయకునిగ చిత్తూరు సుబ్రమణ్యం పిళ్ళైను సత్కరించింది. 1970లో ఢిల్లీ ఆంధ్ర సంఘము ఘనసన్మాన మిచ్చినది. అనేక ఛందస్సులలో వ్రాసిన ఖండికలుగాక నేను నేటికి 9000 తేటగీతులను వ్రాసియున్నాను.

నాకు నటన కూడా నచ్చిన కళ నటింపగలను కూడా. శ్రీ బళ్ళారి రాఘవ, స్థానంగార్ల నటనను విమర్శిస్తూ అనేక వ్యాసములను వ్రాసితిని.

ఇక నే రచించిన ముద్రిత గ్రంథములు.

వచనములు

1. నేటి కవిత్వము 2. సంగ్రహ సుందర భారతము
3. ఏకలవ్యుడు 4. కళా పూర్ణోదయము

కావ్యములు

1. కెరటాలు [ఖండకావ్య సంపుటి] 2. సుందర సుధా బిందువులు [ఖండకావ్య సంపుటి] 3. బుద్ధగీత 4. ఏకలవ్యుఁడు 5. అపవాదం 6. పేదకవి 7. నా స్వామి 8. కాంచీ వరద రాజాపహరణము 9. సంగ్రహ వాల్మీకి సుందర రామాయణము 10. సుందర భారతము [ శిసుండి పదివటకు అన్ని తేఁటగీతి కావ్యములే. 11. జపమాల (గేయసంపుటి) 12. శాంతి దూతలు (బుద్ధుని గాంధీల బుఱ్ఱకథలు) 13. స్వప్న సుందరుఁడు (ఉషా పరిణయ గీతకావ్యము) 14. గీతాంజలి.

అముద్రితములు

1. రంగి రాళ్ళెం (పల్లెపదాలు) 2. గాలిమేడలు (నాటకము) 3. అరాచకము (నాటకము).

1968లో నా సుందర రామాయణము రాళ్ళపల్లి వారి కంకిత మగు సభలో వేంకటేశ్వర యూనివర్సిటీ యుపాధ్యక్షులు, రిజిస్ట్రారు రామానుజులురావు నాయుడుగారు. రాయప్రోలు, మానవల్లి వారి సమక్షంలో "ప్రసన్నకవి" యను బిరుదము నందికొంటిని.

ఈ వివరములు చాలనిచో నా పంచాశద్వర్ష పూర్తి వర్ధంతి సన్మాన సంచిక నిందు వెంట ప్రత్యేకముగ బుక్‌పోస్టులో పంపుచున్నాను. నన్ను గూర్చిన వివరములన్నియు నందుఁగలవు. నా పుస్తకముల నన్నింటిని తపాలుద్వారా మీకు పంపుట నాకు చేతకాని పని. మన్నింతురు గాక. మచ్చునకు నా పద్యములు కొన్ని:-

ఉ॥ వారును వీరు మెచ్చికొను భంగిని కోరి కలమ్ము పట్టి
నేరను వ్రాయ కావ్యములు, విండు మనమ్మది పొంగి యేరులై
పారెడు దాక యుక్త పదబంధము తీరెడుదాక భావముల్
ఊరవు నా కలమ్మునిడి సత్యము నా హృదయమ్ము తెల్పితిన్.

చ॥ లలిత పదాలనేరి మృదుళమ్మగు శయ్యను గూర్చి భావముల్
తెలియగఁ జెప్పి పామరుల తెల్వికి సందఁ బురాణ గాథలం
దలి పరమార్థ ధర్మములు తత్త్వము నింపి సలక్షణమ్ముగా
కలమును కట్టుతో నడిపి కైతల నల్లుదు విశ్వశాంతికై.

ఉ॥ భావకులన్న పేరిటను వందలు వేలుగ దేశమెల్లడన్
తావల మంది నవ్యకవితా వనవాటుల కోకిలమ్మలై
భావము బంధమున్నదలి పల్కులనల్లి పదాలు పాడుపుం
భావ సరస్వతీ యశులు ఫక్కున నవ్విన నవ్విపోవనీ॥

2. బుద్ధగీత [బుద్ధుఁడు జన్మించినపుడు]-

తే॥గీ॥ ప్రకృతి గర్భము పులకల పాటులంది
భరత దేశము బంగారు కురిసి మురియ
ప్రాణికోటికి నవ జీవ భావ మబ్బి
పొరలి పొంగెను నురువుల దొరలు విడిచి.

తే॥గీ॥ కరఁగి హిమగిరి వరదలై పరుగులిడగ,
గంగతో కూడి యమునయు పొంగుతన,
పంచముఖముల సింధువు పడగ నెత్త
తపతి నర్మద గట్టులఁ దన్ని పొరలె.

తే॥గీ॥ వీణియన మీట కృష్ణ. కావేరి పాడ
తుంగ మద్దెల మ్రోగింప తూగి యూగి
అందియలు మ్రోయ హస్త విన్యాసగతుల
అలరి గోదావరమ్మ నాట్యమ్ము సలిపె.

3. ఏకలవ్యుఁడు [వాని తీరు]

తే॥గీ॥ కురులు సవరించి, శిరముపై కూర్చి ముడిచి
ఫాలమందున బొట్టిడి, బరువుటురముఁ
గప్పి పులితోలఁ బిగియఁగట్టి నడుము
కూకోల పొదిఁబూన్చి విల్లుఁ జేఁగొనుచు వెడలె.

తే॥గీ॥ కర్ణ భూషలు కదలాడ, కంకణములు
మెఱయ ముంజేత, మెడలోన వరస తరి
విరియు పూసలు వేర్లాగ విలయకాల
భై రవుని మాడ్కి మన బోయ బయలుదేరె.

[భిల్ల కన్యలాతని వలచిన విధము]

తే॥గీ॥ కన్నుల బొమ విల్లు సవరించి, వన్నెలొలుకు
గుణము సంధించి కొన చూపు కోలలేని
కూల్చి సమ్మోహితునిఁ జేయ కోరి భిల్ల
కన్నెలాతని సన్నలఁ గాచినారు.

4. అపవాదు [రథముపై వదిన నిడికొని యడవికేగు లక్ష్మణుని ముఖ మానస వై ఖరి.]

తే॥గీ॥ కలత మబ్బులు చెలరేగి కలయఁ బరచి
ముసరి మోమున నలుపెక్కి మూగి కనుల
బొమం గిరులంటి కురియఁగఁ బూర్ణ సరసు
లగుచు కనుదీయి తెగి పారు ననెడు దిగులు.

తే॥గీ॥ తగిలి తలవంచి, గుండియ దడల పిడుగు
పడుల నడగించి, గొంతుక వెడలు నుడుల
నడచి పడఁగొట్టి సౌమిత్రి జడిసి జడిసి
మెడను త్రిప్పక పడి పడి నడిపె రథము.

5. పేదకవి [ఫిరదౌసి సుల్తానును పొగడి కావ్యము వ్రాయ మాట యిచ్చినప్పుడాతని సతి]

తే॥గీ॥ కవులు పుణ్యార్ణవమ్మున కల్గినట్టి
కల్ప తరువులు ఘనులలో ఘనులు చూడ
కవిత లోక హితార్థము, కన్నవారి
కన్న రీతులఁ గొనియాడ కాదు వినుఁడు.

తే॥గీ॥ పొన్నపై మల్లియలు చల్లి బాగ నలిపి
పరిమళమ్ములు మాయఁగ పండినట్లు
పరమ తులసీ దళమ్ముల వార కాంత
వలువఁ గురులనుఁ దురిమిన పగిది మీరు

తే॥గీ॥ కావ్య కన్యను కాంచన కాంక్షలగుచు
కాని వానికిఁ దార్చు దుష్కార్యమునకు
కడగు టెంతయు పాపము, ఘనతఁగన్న
కవులు ఋషితుల్యులరయ నిష్కామ నిధులు.

6. సుందర భారతము [కర్ణుని ధనుర్విద్యా ప్రదర్శనమును చూచి నపుడు]

తే॥గీ॥ బాగు బాగనె భీష్ముఁడు, పరమ వశమున
చూచె ద్రోణుఁడు: విజయుఁడు దాఁచికొనెను
మేనఁ బూచిన పులకల! నూన మ్రదుప
బెదరి చెదరుచు కుంతి నిర్విణ్ణయయ్యె.

[కృపాచార్యుడు కర్ణుని కులగోత్రమడుగ]

తే॥గీ॥ మంచు బొట్టులు వడపైని మస్తకమ్ము
వంచు పద్మమ్మువలె కర్ణుడించుకంత
శిరము వాలిచి యస్త్రాది మరుగుచున్న
సూర్యు వెసఁజూచె నూరక చురచురమని.

7. సుందర రామాయణము (తాటకా వర్ణన)

తే॥గీ॥ నల్లకుండల నుగ్గుగాఁ నలుగఁగొట్టి
చిమ్మ చీకటిలోనున్న చేవదీసి
కాళ సర్పాల విషమెల్లఁ గలిపి నూరి
కాచి పోసిన రూపుగఁ గానుపించి.

తే॥గీ॥ పచ్చి రక్కసి, నడకుండవలెను వదన
గహ్వరము విచ్చి, చిచ్చులు క్రక్కి నాల్క
సాచి, కనులెఱ్ఱవారఁ జేయుంచుకొనుచు
నురము ముందునకును నెట్టి శిరమునెత్తి.

తే॥గీ॥ కాలభైరవియై వల్లకాటికేల్గి
తానె కాఫరియనమించి, తలలుమాల
మెడను వ్రేలాడఁ ద్రాచులు పడగలెత్తి
భూషలు యమైన బుసకొట్టు ఘోషలిడుచు

తే॥గీ॥ కరులు గిరులును హరులును తరులొకటి
వెంటఁబడి మూగ, అడుగులు పిడుగులగుచు
విడిన చోట్లెల్ల గోతులు పడుచు నుండ
నటన కలదెంచె వికటాట్టహాసములతో.

—ఇంక ఓపిక లేదు. నిలుపుతాను. ఇది నా సోది. వలసి నంత వాడుకొనండి. ఆగస్టులో జరుగనున్న మీ మహాసభ కాహ్వాన కరపత్రమును నాకు పంపితినంటిరి. కాని నాకు నది యందలేదు.

దయయుంచి యీ నా జాబందిన వైనమును వెంటనే వ్రాయండి.

మీవాడు
సుందరాచారి



[శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి కీ॥శే॥ శంకరంబాడి సుందరాచారిగారు రాసిన లేఖ ఇది. శ్రీ సుందరాచారిగారి వివరాలు తెలిపే ఈ లేఖ సాహితీ సుగతులకు ఆసక్తికరంగా ఉండగలదు.]

## కీ॥ కృషికగు జయమ్ము!!

(సానెట్)

ఎటువంటి కష్టమ్ము, లెటువంటి నష్టమ్ము
లెదురైన, 'భారతి'ని ప్రచురింప నిర్ణయము
కైకొంటివీరు! ఇది మీ కాంధ్ర వాఙ్మయము
పట్ల గల నిరుపమ ప్రేమమును స్పష్టమ్ము
సేయు, రాధాకృష్ణ! మీ ఘనతకిది టీక!
'భారతి' ఇతోధిక ప్రాచుర్యమును జెందు;
భరత ఖండంపు సాహిత్య పత్రికలందు
సరిసాటి లేని మేటిగ తన జయపతాక
నాటు నిల్పతిచోట! (ఇది కాదు నా భ్రాంతి)
ఆంధ్ర సాహిత్యమున కద్భుత భవిష్యత్తు
కలదంచు చాటునిది! 'విశ్వదాత' మహత్తు
దెసల కొసల వెలుంగు! జాతి ఆత్మ ప్రశాంతి
కను! ఆంధ్ర కవి, పండిత, సహృదయ నివహమ్ము
'భారతి' గొని పఠించు! మీ కృషికగు జయమ్ము!!

శంకరగంటి రంగాచార్యులు



# గ్రంథ విమర్శలు

## రామాయణం - సమాజ దర్పణం

[రచయిత : డా॥ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి ప్రతులకు : 1) శివశ్రీప్రచురణలు, కోర్టువీథి, పొన్నూరు-522 124, గుంటూరు జిల్లా. 2) శ్రీ తూములూరు లక్ష్మీనారాయణశాస్త్రి ఆదిత్య జ్యోతిషాలయం, ఉప్పలూరు (పోస్టు) వయా-కంకిపాడు, కృష్ణా జిల్లా, వెల : తెలుపలేదు.]

రామాయణం పై చాలా రచనలు వస్తున్నాయి చిన్నపాత్రలను గూర్చికూడా వ్రాస్తున్నారు కొందరు. ఎవరెన్ని వ్రాసినా దాని అంతర్యం ఇదమిత్థమని నిర్ణయించి చెప్పడం సాధ్యం కాదని నా అభిప్రాయం. ఈ రచన ఒక పద్ధతిని సాగింది. మెచ్చవచ్చు. సాధ్యమైనంత వరకు రామాయణం సామాజిక దృక్పథంలో చూస్తే ఏమి చెప్తుంది ? అనే ప్రశ్నకి సముచితమయిన వ్యాఖ్యారూపమైన సమాధానం దీన లభిస్తుంది.

'నిత్యవసంతం' అనే తొలిశీర్షికలో రచయిత రామాయణ హృదయం సూత్ర పక్కని చెప్పి దానిని మిగిలిన శీర్షికలతో వివరించడం పాణిని పతంజలులు గోచరిస్తారు.

ఈ రచన - బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారి 'శ్రీరామ కథామృతము' అనే గ్రంథాన్ని ఆధారంగా చేసుకుని సాగినదే అయినను అవశ్యకమైనచోట వివిధ గ్రంథ విషయాలను ప్రమాణంగా తీసుకుని రూపొందిన విశిష్ట విమర్శగ్రంథం అని చెప్పదగినది.

సత్సాంగత్యము, సాహిత్యం, గురుశిష్యులు, విద్య లక్ష్యశుద్ధి, వివాహము, ప్రజాస్వామ్యం, చిత్తస్థైర్యం, ప్రత్యక్ష దైవాలు, నిస్స్వార్థం, స్నేహం, కృతజ్ఞత, సమయస్ఫూర్తి, మాట-మన్నన- అనే శీర్షికలతో సంతరించిన యీ కృతిలో గురుశిష్యులు, విద్య, ప్రజాస్వామ్యం - అనే శీర్షికలు ఈ కృతి కన్యకి శిరోభూషణాలుగా ఉన్నాయి నేడు గురుశిష్యులూ ప్రజాపాలనకి గద్దెనెక్కినవారు అవశ్యం నిత్యమూ చదివి అర్థం చేసుకోవాలి.

సామాజిక జీవితం రామాయణములో ఏ విధంగా ప్రతిఫలిస్తుంది? అనే ప్రశ్న మనసులో ఉంచుకుని యీ గ్రంథం చదివితే మనోరంజనమైన సమాధానం వస్తుంది. అన్నింటికీ రామాయణమే ఆదర్శ గ్రంథం అని ఏలాటి 'వాదులు' నిశ్శంకంగా అంగీకరించి తీరుతారు.

ఉపాధ్యాయుడిగా ఉండి శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి యీ విమర్శ గ్రంథం రచించడంలో చూపిన సువిశాల సామాజిక ధర్మ దృష్టికీ సాహిత్యహృదయ పుష్టికీ ధర్మబద్ధమైన నా అభినందన తెలుపుతున్నాను.

రామాయణ పాత్రలు మన ఎదుట ప్రత్యక్షమై సావకాశంగా కూర్చుని మాటాడుతూన్నట్టు తోస్తుంది.

ఇది సామాజిక జీవితం నింపుగా ప్రతిఫలించే నిద్దపు టద్దమే.

కళాశాలల్లో పాఠ్యముగ నిర్ణయించదగిన రచన.

## భజగోవింద మననం

[రచన : శ్రీ కొంపెల్ల విశ్వనాథం, ప్రతులకు: శ్రీ వెంకట రాఘవ పబ్లికేషన్స్, 1-1-336/45 వివేక నగర్, హైదరాబాదు-20 వెల : రు. 5/-.]

ఆది శంకరుల 'భజగోవింద' - శ్లోకాలకు వచ్చిన ప్రచారం ఏ తాత్త్విక గ్రంథానికీ రాలేదంటే ఎవరూ కాదనలేరు. అర్థం తెలిసినా తెలియకపోయినా చదువుతూ ఉంటారు. ఇంపుగా పాడుతారు కూడా. 'గోవిందనామం వినగానే' భజగోవిందం స్ఫురణకి వస్తుంది.

ఇటీవల ఈ శ్లోకాలకి తాత్పర్యాలు వ్రాసి అచ్చయిన పుస్తకాలు నాచేతికి వచ్చాయి. చూశాను. నేడు సమీక్షించే యీ చిన్న కృతికి.

'మున్నుడి'లో మిత్రులు శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మ గారు గోవిందనామ వ్యుత్పత్తినీ - సాధన సంపత్తినీ వివరించి నాకు శ్రమలేకుండా చేశారు. కనుక వారిని ముందు అభినందిస్తున్నాను. ఇక నేను వ్రాసేవి పరిచయ వాక్యాలే.

సంస్కృతభాషా పరిజ్ఞానం లేదని విశ్వనాథంగారు ఈశోపనిషత్తు కఠోపనిషత్తు, భగవద్గీత వంటి తాత్త్విక ప్రామాణిక గ్రంథాల నుంచి తన రచనకు ప్రమాణం ఇవ్వడం ఏమనాలో !

అలాగే రామదాస పద్యాలనూ పోతనామాత్యుల వారినీ ప్రమాణీకరించడం - తెలుగులో అవశ్యకరీతిని - మెచ్చవచ్చు.

తాత్త్విక విషయం అంటే తలకొట్టుకునేవారు కూడ శ్రీకొంపెల్ల వారి యీ వివృతిని చూస్తే అమృతపానం చేసినంత సంతృప్తిని పొందుతారు. 'కాతే కాంతా కస్తే పుత్రః' - అనే శ్లోకానికి ఇచ్చిన వివరణ మరీ హృదయ స్పర్శిగ ఉన్నది.

క్లిష్టమైన పదాల కూర్పు లేకుండా సామాన్యమైన అక్షరజ్ఞానం కల చదువరికి కూడా అర్థం అయేట్టు లలితమైన భాషతో చెప్పిన ధన్యజీవులు విశ్వనాథం గారు.

వితండ వాదముతో ఊరేగుతున్న వారు కూడా నిత్యం చదువుతూ భద్రంగా ఉంచుకోవలసిన భవ్య కృతి.

శ్రీ సత్యమూర్తి ముఖ పత్రచిత్రం ఆదిశంకర దర్శనభాగ్యం కలిగిస్తోంది,

## తిరుక్కురల్

[అనువాదకర్త : శ్రీ అన్నే పిచ్చిబాబు, ప్రతులకు: శ్రీఅన్నే చంద్రమౌళి కాలేజీ రోడ్డు - వుయ్యూరు - కృష్ణాజిల్లా మూల్యము : 15 రూ.]

అతి ప్రాచీనమైన తమిళ గ్రంథం 'తిరుక్కురళ్ - రచయిత 'తిరువళ్ళువర్'.

ధర్మార్థ కామములను వివరిస్తూ మూడు కృతులు చెప్పాడు వాటిని సక్రమంగా నిర్వర్తిస్తే మోక్షం వస్తుందని ఆయన ఉద్దేశం. అని అనుకోవచ్చు.

వేదాలూ పురాణాలూ భగవద్గీతాదులు చెప్పిన మానవజీవిత ప్రబోధం చిన్న చిన్న మాటల్లో ఆయన చెప్పిన యీ గ్రంథం తమిళ వేదముగా ప్రసిద్ధ మయింది.

దీనికి ఇంతకు ముందు ఇరువురు తెలుగు చేశారు. మూలం ప్రథమ పాదం పొడవుగా ఉండి రెండవ పాదం పొట్టిగా ఉంటుంది. అదొక విధమైన ఛందస్సు. దానిని తెలుగులో ద్విపదగా చెప్పవచ్చు. నే నిటీవల ధర్మఖండం పేరుతో మొదటిది మంజరీ ద్విపదలో వ్రాసేను.

ఇప్పటి ఈ అనువాదం తమిళమునకుగానీ, నావద్దనున్న ప్రసిద్ధమై ఆంగ్లమునకుగానీ అనుగుణంగా కన్పట్టలేదు. పైగా తేట గీతమూ కాదు, ద్విపదా కాదు - మరి ఏజాతికి చేరుతుందో నాకు తోచలేదు. మూలం దగ్గర ఉంచుకుని చూస్తే ఈ తెలుగు సులువుగా అర్థం అయేదిగా కూడా కన్పట్టలేదు.

మొదటి భాగంలో భార్య (గృహిణి)ని గూర్చి చెప్పేది తన మగవినే దైవముగా భావించి కొలిచే భార్య కురువుమంటే వాన కురుస్తుంది - అని సరిగ్గా తమిళమునకు అతిసన్నిహితమై తెలుగు దీనికి యీ అనువాదం.

'పతిని పరముగ వెంచి పూజించు పడతి కిలను
ప్రకృతివి శాసించు ప్రతిభ కలుగు'—

సరిగాలేదు. (ఇలాగే ఉంది అనువాదం చాలా)

'తన పతినే దైవమని కొల్చు దాన
కురియు మన్నంతనే కురియును వాన'—

ఇది నా తెలుగు సేత.

పద్యమా ఒక పద్ధతిగా లేదు. అర్థమా సక్రమంగా పుష్టిగా లేదు. చాలామందికి సులువుగా అర్థం కాదు. బాగా తెలుసుకుని తెలుగు చెయ్యవలసింది.

యామిజాల పద్మనాభస్వామి

## విజయ విలాసము

[తాపీ ధర్మారావు-హృదయోల్లాస వ్యాఖ్య వెల: రూ. 80-00 ప్రతులకు· విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001.]

శ్రీకృష్ణ దేవరాయల తరువాత దక్షిణాంధ్రయుగం రఘునాథ రాయల కాలంలో స్వర్ణయుగంగా పరిగణింప బడుతున్నది. తంజావూరు పాలకుడైన రఘునాథ రాయలు కృష్ణదేవరాయలవలె పండితుడు. కవి. రసికుడు పైపెచ్చు సంగీత నాట్యకళా విశారదుడు. ఈ కవిరాజు ఆస్థాన కవిగా, రాజాభిమానాన్ని మిక్కిలిగా చూరగొన్న కవి శిరోమణిగా చేమకూర వేంకట కవి ప్రసిద్ధి నొందాడు. రసపుష్టి చేత, జాతి, వార్తా చమత్కారాలు, అర్థ గౌరవం కలుగునట్లుగా అనేక కృతులు సంతరించిన రఘునాథ నృపమౌళిచే ప్రతి పద్య చమత్కృతిగా కవితల్లజ కవిగా ప్రశంసింబడిన చేమకూర కవి రచించిన రెండు కావ్యాలు సారంగధర చరిత్ర, విజయ విలాసం ఆంధ్ర రసికలోకాన్ని అలరింప జేస్తున్నాయి. ఈ రెండింటిలో విజయ విలాసము ఉత్తమోత్తమ కావ్యం. వేంకట కవి తన ప్రతిభా వైభవాన్ని సంపూర్ణముగా వెలయించి ఈ కృతిని కూర్చారనడంలో సందేహం లేదు. "ఈ చేమకూర చెక్కర మడిలో నమృతము పారించి పెంచినది కాని మట్టిలో నీరు పారించి పెంచినది కాదు" అని కళా ప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రిగారు కొనియాడారు. "పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నమునకు తరువాత విజయ విలాసమే సర్వవిధముల చేతను తెలుగులో శ్లాఘ్య కావ్యముగనున్నది" "సొమ్మెతలతోడను, శబ్దాలంకారములతోను నిండియుండి యర్థ గౌరవము కలదయి యున్నందున చేమకూర వేంకట కవి కవిత్వము సర్వజనాదరణీయమయినదని తలచుచున్నాను" అంటూ ఆంధ్ర చరిత్ర కారులు ఆదరంతో అభి భాషించారు. "కవీశ్వరులు రసధునీ ప్రవాహమువలెను, చమత్కార పయః పూరమువలెను కవనము చెప్పి యున్నారు. ఈ రెంటిని సమ్మేళనము గావించి యత్యంత రమణీయము గను హృదయంగమముగను కావ్యకల్పన చేసినవారు కొందరే. ఇందు రామరాజ భూషణుడు ప్రముఖుడు. మన చేమకూర కవి

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు *600 004*

**Amrutanjan Limited** 

యన్ననో రామరాజ భూషణుని యధః కరించినాడు. అగ్రస్థానము నాక్రమించినాడు" అని యథార్థ శ్లాఘన గావించారు నేలటూరు వేంకట రమణయ్యగారు.

ఇంతగా పొగడ్త గాంచి సర్వవిధముల ఉత్తమోత్తమ కావ్యమైన విజయ విలాసమునకు పందొమ్మిదవ శతాబ్దం వరకూ కావ్యంలోని మేలిమినీ, మెరుగులనూ వెల్లడించే వ్యాఖ్యానం రాకపోవడం విచారకర విషయం. తరువాత జూలూరి అప్పయ్య పండితులూ, వేదం వేంకటరాయ శాస్త్రిగారు విజయ విలాసానికి వ్యాఖ్యలు వ్రాశారు. వేదం వారి వ్యాఖ్యానంలో అక్కడక్కడా విశేషాలు ఉన్నా లఘు వ్యాఖ్యగానే పరిగణించాలి. శాస్త్రిగారు ఈ కావ్యానికి విపుల వ్యాఖ్యానం వ్రాయదలచినట్లుగా ఉద్దేశించినట్లు తెలుస్తున్నది. కాని ఎందువల్లో లఘుటి గానే ముగించారు. తాపీ ధర్మారావుగారు ఈ అన్ని విషయాలను గమనించి విజయ విలాసానికి విపుల వ్యాఖ్యానం వ్రాయాలని సంకల్పించి శ్రద్ధతో, దీక్షతో పరిశ్రమించి, ప్రజ్ఞాపాటవాన్ని ఉపయోగించి హృదయోల్లాస వాఖ్యానం పేరుతో ఈ విపుల వ్యాఖ్య సంతరించి ఆంధ్ర పాఠక లోకానికి మహోపకారం చేశారు. సహృదయోల్లాసం సమకూర్చారు. ఇందుకు వారు మిక్కిలీ అభినందనీయులు. గణితాధ్యాపకుడైన తాను అంతటి ఉదాత్త కావ్యానికి వ్యాఖ్యానం వ్రాసే పాండిత్యం కానీ, ప్రజ్ఞకానీ లేదని సందేహించి నప్పటికీ సహృదయాహ్లాద ప్రదంగా, సమర్థతతో వ్యాఖ్య రచించి పండితుల ప్రశంసలను చూరగొన్నారు. తాపీవారి వ్యాఖ్యానాన్ని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రీ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రీ, కళాప్రపూర్ణ త్రిపురాన సూర్య ప్రసాదరాయకవీ, మహా మహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయన శర్మ, వడ్డాది సుబ్బారాయకవీ, శతావధాన శిరోమణి కాశీ కృష్ణాచార్య ప్రభృతి పండిత ప్రకాండులు వేనోళ్ళ శ్లాఘించారు.

కాశీ కృష్ణాచార్య "అవురా! మెచ్చితి మామకాగమన వార్తాఖ్య స్థలంబందు నీ। వివృతిన్, బొంగితి నీదు చాతురికి తాపీవంశ ముక్తామణీ!" అంటూ ఉప్పొంగిన గుండెతో ఉగ్గడించి ప్రశంసించారు. ఈ పొగడ్త వట్టి ముఖస్తుతికాదని ప్రథమాశ్వాసంలోని "అపుడు నృపుడు" అనే 217వ పద్యం యొక్క వ్యాఖ్యను తిలకిస్తే తెలుస్తుంది. మామ కాగ మనవార్త అవే సమాసాన్ని విశ్లేషించి చమత్కార బాహుళ్యాన్ని చక్కగా చూపించారు తాపీవారు.

తాపీవారు తమ వ్యాఖ్యానంలో అనేక పద్యాలకు హృద్యమైన అర్థ విశేషాలను వివరించారు. ప్రతి పద్యానికి టీక, తాత్పర్యం, విశేషం, అలంకారాలను చూపించారు. ధర్మారావుగారు చూపించిన కొన్ని చమత్కారాలనూ, విశేషాలనూ ఉదహరించడం సమంజసమనీ, సముచితమనీ భావిస్తున్నాను.

ప్రథమాశ్వాసంలో కృతిపతి నాశీర్వదిస్తూ వ్రాసిన పద్యాల్లో రెండవ పద్యమైన "శ్రీ కలకంఠ కంఠియు" అనే పద్య వ్యాఖ్యలోని విశేషాన్ని ఇట్లా ప్రకటించారు.

"వారి గడకంగడ కన్నుల కాంతిఁ దేర్చి" అన్నచోట కవి శబ్దాలంకారం కోసం ఆస చేశాడని కొందరు భావిస్తారు. కాని చేమకూర కవివంటి భాషాధికారం కలవాడికి కావ్యారంభంలో దైవ ప్రార్థనయందు అలాటి కక్కుర్తి పడవలసిన అవసరం ఉంటుందా? ఉండకూడదు. 'కడకన్' అంటే ప్రయత్నమని అర్థము. ఈ ప్రయత్నమన్నది వ్యర్థ పదంకాక ఇక్కడ అర్థ గౌరవం కల చక్కని మాట. రంగభర్త దక్షిణనాయకుడు. ఇద్దరు నాయికలు-లక్ష్మీదేవి, భూదేవి-వీరిద్దరు ఎవరి మందిరంలో వారుంటే వారిని సమానంగా సంతోష పెట్టడం సుకరం కావచ్చును కాని ఇద్దరూ చెరి ఒక ప్రక్క తన్ను అంటిపెట్టుకొని ఉన్నప్పుడు ఎటువంటి నేర్పరికైనా కష్టమే. ఒకరికి క్రీగంట చూపిన మెప్పు ఎంత స్వల్పమైనా, రెండవదానికి ముప్పుగా పరిణమిస్తుంది. ఆ భావం కలుగకుండా ఉండాలంటే ఒకతెకు తెలియకుండా తగిన సమయం చూసుకొని రెండోదాన్ని కడకంటితో చూడాలి. ఎంతో సమయజ్ఞతతో ప్రవర్తించాలి......కాబట్టే మనకవి "కడకన్" అన్నపదము సార్థకముగ ప్రయోగించాడు"

ఇది తాపీవారి వ్యాఖ్యానపు పనితనమునకూ, ప్రతిభా వైభవమునకూ, చక్కని తార్కాణం. ఇక కృష్ణాచార్యులు గారు మిక్కిలి మెచ్చుకున్న "అపుడు నృపుడు" అనే ప్రథమాశ్వాసంలోని 217వ పద్యంలోని "మమ కాగమన వార్త" అనే సమాసాన్ని ఏవిధంగా విశ్లేషించి, వివరించి చమత్కారాన్ని సాధించారో ఈ దిగువ చూపబడుతున్నది.

"అపుడు నృపుడు" అనే పద్యం యొక్క వ్యాఖ్య సుమారు రెండున్నర పేజీలు విస్తరించి ఉంది. ఐతే ముఖ్యమైన అంశమే చూపబడుతున్నది.

"సుస్పష్టంగా అర్జునుడి హృదయములోని అభిప్రాయం కనబరచాడు. అర్జునుడు విశారదుడికి చెప్పిన మాటలను "మామ + కాగ + మనవార్త తెలుపుము" అని విడదీస్తే ప్రశస్తంగా ఉంటుందని మనవి శేశాను. దీని కర్థము "మామ అయేటట్లు మనవార్త (నాసంగతీ మన వంశము సంగతీ) చెప్పుమన్నాడు."

ఇక్కడ జూలూరి వారి వాఖ్యకూ, వేదం వారి వాఖ్యకూ మెరుగులు దిద్దునట్లుగా వ్యాఖ్యానించి తాపీవారు తమ ధీశక్తిని ప్రకటించారు.

ద్వితీయాశ్వాసంలోని 48వ పద్యానికి ఒకపుట విశేషార్థ ప్రతిపాదకమైన చక్కని వ్యాఖ్యానం వ్రాయబడినది.

—వేముగంటి

## విపంచి
(వ్యాస సంపుటి)

[టి. శ్రీరంగస్వామి, వెల: 4రూ॥ ప్రతులకు—శ్రీ లేఖా పబ్లికేషన్స్, 5-11-114/4, విద్యారణ్యపురి, వరంగల్-506 009]

శ్రీ టి. రంగస్వామిగారు స్వయంగా కవి. ఈనాటి కవిత్వం మీద వారి ఆలోచనలే ఈ వ్యాస సంకలనం. ఇందులో సాహిత్యంలో నూతన ప్రక్రియ మినీ కవిత, కవిత్వం ఏది? ఎందుకు?, కవితా విప్లవాల మధ్య ఓ మలుపు, సాహిత్యంలో రచయిత, బాధ్యత, విలువలు, వచన కవితలో వాస్తవికత, వచన కవిత్వంలో మానవతా సిద్ధాంతము అనే 6 వ్యాసాలున్నాయి. ఇవికాక ప్రకాశకుల ప్రకాశకీయం, రచయిత స్వకీయం, ఇంకా అనేకుల అభినందనలు ఉన్నై.

ఈ వ్యాసాలలో రచయిత ఎక్కువగా ఈ కాలపు కవులను, అందున కొత్త తరం కవులను ఎక్కువగా ఉదహరించారు. పాత తరం కవులలో శ్రీరంగం నారాయణబాబు, తిలక్, కాళోజి, చేతనా వర్తకవులు, అద్దేపల్లి రామమోహనరావు మొదలైనవారు ఈ వ్యాసకర్తకు ఉదాహరణార్హులు అయ్యారు. వ్యాసాలలో రచయిత కొత్తగా కవిత్వాన్ని గురించి గాని, మినీకవిత్వాన్ని గురించి కాని, అసలు కవిత్వ తత్వాన్ని గురించి కాని, వచన కవిత్వాన్ని గురించి కాని చెప్పినదేమీ లేదు. ఐతే సమకాలీన యువకవులపట్ల ఈ కవికి గల సానుభూతి బాగా వెల్లడైంది. కొత్తగా కవిత్వం రాస్తున్నవాళ్ళు ఈ పుస్తకాన్ని చదవటం మంచిది. ప్రకాశకులు భావించినట్లుగా సమకాలీన సాహిత్యంమీద తక్కువ విమర్శ యేమీ రాలేదు. అధ్యయన శూన్యత ఇట్లాంటి మాటలకు మూలమవుతుంది. తెలుగులో విమర్శ లేదు, విమర్శకుల కొరత ఎక్కువగా ఉంది అనేమాటలు చాలా పాతవి. వారు భావించిన లోపానికి ఈ పుస్తకం నాంది అని అనుకోవటం మరొక లోపం. టి. శ్రీరంగస్వామి భవిష్యత్తులో మంచి అవగాహనతో, పరిశీలనతో మరిన్ని మంచివ్యాసాలు రాస్తారని ఆశిద్దాం!

## వెన్నెల రెక్కలు
(కవితా సంకలనం)

[గడియారం శేషఫణిశర్మ, వెల: రు. 8-00 లు. ప్రతులకు: రచయిత పేర-క్వార్టర్ నెం. బి.ఇ. 86, బి కాలనీ, న్యూ పాల్వంచ, ఖమ్మంజిల్లా-507 115]

శేషఫణి శర్మగారు ప్రాచీన, ఆధునిక కవితారీతులలో ఆరితేరినవారు. వారి పేరు సాహిత్య ప్రపంచములో స్థిరపడినది. ఈ కవితా సంకలనానికి కవితా గుణఖని శేషఫణి అని దాశరథిగారు ఉత్తమమైన పీఠికను వెలయించినారు. వారు "శేషఫణి కవిత తొడుక్కున్న వెన్నెల రెక్కలమీద అశేష పాఠక హృదయాలు భావాంబరములో విహరిస్తాయి. కవికి శరీరంమీద కంటే ఆత్మమీద విశ్వాసం ఎక్కువ. అందుకే దీనిని ఆత్మాశ్రయ కవిత్వం అన్నాడుగాని ఈనాడు ప్రచలితమైన సాధారణార్థంలో వాడబడే సబ్జెక్టివ్ పోయట్రీ కాదు అని అన్నారు. ఈ కవికి ప్రత్యేకమైన నిబద్ధత వస్తుపరంగా ఏమీ లేదు. అట్లనే ప్రక్రియా పరమైన నిబద్ధతగాని, భాషాపరమైన నిబద్ధతగాని ఏమీలేవని ఇవన్నీ సారస్వత లోకములో వైవిధ్యాలేగాని వైరుధ్యాలు కావని కవిగారే స్వయంగా చెప్పుకున్నారు. సమాజాన్ని గురించి, దాని స్థితిగతులను గురించి ఒక అవగాహన లేనివారికి, రచనలో కూడా ఒక నిబద్ధత ఉండదు. అట్లా నిబద్ధత లేని కవిత-

తూరుపు వడగాట్పుతో
మోడువారిన రసాల శాఖలపై
మళ్ళీ మొలుస్తుంది,
క్రొత్త కోకిలను కోరి పిలుస్తుంది
పల్లవన్ నా కవిత

అనుకోవటం భ్రమాత్మకం కదా!

వియోగ ప్రణయమైనా, సంభోగ ప్రణయమైనా, సాంఘిక జీవితాన్ని గురించి ఎంత పట్టకపోయినా కవిలో తనదైన 'తనం' ఒకటుంటుంది.

నిద్రా దరిద్రమైన నిషా సమయంలో అన్నచోట సుఖస్వప్న దరిద్రమైన కృష్ణశాస్త్రిగారు గుర్తుకొస్తారు.

ఇది శిశిర చైత్రసంధి
నిండిన తమస్వినీ నిశిధి
చక్షువులు నిర్నిద్రములుగ
ఈ రహస్సీమ వేచియుంటిని
వియోగ విషమగీతిక
లెడద విన్పించుచుండ



ఈ స్థితినుండి కవిగారు బయటపడి కవిత్వం వ్యష్టికంటే సమిష్టిపర మైనద నై విశ్వాసంతో ఇకముందు కవిత్వం రాస్తారని ఆశిద్దాం!

—టి. యల్. కాంతారావు

# రష్యన్ చిత్రకళ

[రచన: చలసాని ప్రసాదరావు, ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001, పేజీలు: 64, వెల: ఏడు రూపాయలు]

శ్రీ చలసాని ప్రసాదరావు ఆంధ్రదేశంలో చిత్రకళమీద రాయ గలిగిన అతికొద్దిమందిలో ఒకరు. ఆయన ఏం రాసినా బాగా అధ్యయనం చేసి రాస్తారనిపిస్తుంది - ఆయన వ్యాసాలు చదివాక.

రష్యా చరిత్ర, సంస్కృతి, తొలినాటి రష్యన్ చిత్రకళ, ప్రాచ్య పాశ్చాత్య కళాప్రభావాలు, శిల్పకళలు, విప్లవకాలంలో రష్యన్ చిత్రకళ, గ్రాఫిక్స్ గురించి ఈ పుస్తకంలో వివరించారు-నలుపు తెలుపు బొమ్మలతో. ఈ చిన్న పుస్తకం చదవగానే, ఎన్నో విషయాలు ఒక్కసారే అన్నీ తెలుసుకున్నంత అనుభూతి కలుగుతుంది. నిజానికి ఇది ఏడు రూపాయల పుస్తకం అయినా, డెబ్బయి రూపాయల పుస్తకంగా, చిత్రాలన్నీ రంగుల్లో ముద్రించి వేసుకో వచ్చుగానీ, చిత్రకళ గురించి తెలుసుకోవాలన్న తపన కలిగిన తెలుగు వాళ్ళు చాలా తక్కువ అవటంచేత, అందరిలోనూ అంతో ఇంతో చిత్రకళమీద అభిరుచి కలిగించాలంటే ఇట్లాంటి 'అందుబాటు' ప్రచురణలే నయం. ఈ పుస్తకంలో వున్న అన్ని చిత్రాలు నలుపు తెలుపులో వుండటంవల్ల, రష్యన్ చిత్రకళా వైభవం తెలుసుకోవ టానికి, బొమ్మలకన్నా, ప్రసాదరావుగారి వచనమే ఎక్కువ ఉపయోగ పడుతుంది.

—బాబు

# చదువు

[కొడవటిగంటి కుటుంబరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, వెల: పది రూపాయలు]

రచయిత కథ కాలానికున్న రాజకీయ వాతావరణాన్ని కథతో కలిపి చక్కగా నేశారు. కథ ఆరంభకాలం 1915. అలనాటి రాజకీయ స్థితిని చూపారు. ఆనక రాజకీయ మార్పులు, చైతన్యాలు, బ్రిటీషు గొడవలు, గాంధీ మహాత్ముని ఉద్యమాలు వగైరాలన్నీ వున్నాయి. కథావస్తువుగా రచయిత తీసుకున్న ఆరు కుటుంబాలలో అయిదు పల్లె జీవితాలు, ఒక్క శ్యామల కుటుంబానికే మద్రాసు వాస మున్నది.

నవలారంభం సుందరం చదువు. ఆతని తల్లి సీతమ్మ ఆరాటం. కథాంతంలో సుందరం కొడుకు చదువు ఆరంభమవుతుంది. ముఖ్యపాత్ర సుందరం... కథలో ముఖ్యపాత్ర చదువు. ఈ చదువు ఆదిలో సుందరాన్ని చివరి కాతని కొడుకునూ చుట్టుంది. కథా గమన కాలం రెండు దశాబ్దాలకు పైనే!

కథలోని పాత్రల చిత్రీకరణ చక్కగా వుంది. రచయిత రచన లన్నిటికన్నా యిది గొప్ప నవల. రచయిత శైలికి చక్కని ఉదాహరణ యీ నవల.

ప్రకాశకులు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు అభినంద నీయులు.

—భూపతిరాజు

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247